# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపఁబడిన

## శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

సచిత్రము

ఎనిమిదవ భాగము




సంపాదకుఁడు

విద్యాభూషణ

ఉపన్యాసక రత్న - కవితా విశారద

**ధనకుధరం వరదాచార్యులు**




ప్రకాశకులు :

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల

**( This book is published with the financial assistance of Tirumala Tirupathi Devasthanams under their Scheme Aid to publish religious books )**

శ్రీ రామానుజ కీర్తి కౌముది

ఎనిమిదవ భాగము

మొదటి ముద్రణము

వేయి ప్రతులు

ప్రభవ - హేమంతము

డిశంబరు - 1987

రామానుజ శకము ౯౭౦

మూల్యము :

ముప్పది రూపాయలు

ముద్రణము :

వెల్‌కం ప్రెస్, ప్రైవేట్ లిమిటెడ్

బ్రాడీపేట : : గుంటూరు-2.

# సమాలోచన సమితి

మహాకవి - సరస్వతీ పుత్ర - కళాప్రపూర్ణ - పద్మశ్రీ
**డాక్టర్ : పుట్టపర్తి నారాయణాచార్యులు**
కడప

*

వ్యాకరణ విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ
**శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, M.A.**
విశాఖపట్టణము

*

సాహిత్య రత్న - భాషాప్రవీణ
**శ్రీమాన్ కె. టి. యల్. నరసింహాచార్యులు**
శ్రీ గోదా గ్రంథమాలా సంపాదకులు
ముసునూరు

*

సంగీత సాహిత్య కళానిధి
**శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు**
విజయవాడ

*

భాషా ప్రవీణ - విద్వాన్ - లలిత కవి
**శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులు**
కందుకూరు తాలూకా రచయితల సంఘాధ్యక్షులు
ఉలవపాడు

*

న్యాయవిద్యాప్రవీణ
**డాక్టర్. యస్. బి. రఘునాథాచార్యులు, M.A.;Ph.D**
సంస్కృత రీడర్ : శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము
తిరుపతి

సాహిత్య విద్యా ప్రవీణ
**శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యులు**
సంస్కృతోపన్యాసకులు
శ్రీ వేంకటేశ్వర వివేకవర్థినీ సంస్కృత కళాశాల
హైదరాబాదు

*

**శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యులు, M.A.**
లెక్చరర్ :- ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్ కాలేజి
నాగార్జున సాగర్ - విజయపురి సౌత్

*

**శ్రీమాన్ శ్రీపెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, M.A.**
ఉపన్యాసకులు :- శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్య కళాశాల
పాలెమ్

*

కవికోకిల - విద్వత్కవి - కావ్యకళానిధి
**శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు**
సాహిత్య వికాస మండలి అధ్యక్షులు
సిద్దిపేట

*

**డాక్టర్ : కె. సుప్రసన్నాచార్యులు, M.A;Ph.D.**
తెలుగు ప్రొఫెసర్ : కాకతీయ విశ్వ విద్యాలయము
వరంగల్

*

**డాక్టర్ : చింతాపట్టణం శ్రీరంగాచార్యులు, M.A;Ph.D.**
ఆంధ్రోపన్యాసకులు :- ప్రభుత్వ కళాశాల
[M. V. S Govt Arts & Since College]
మహబూబ్ నగర్

# ప్రముఖులు - ప్రశంసలు

**తెలికిచర్ల కందాడ గోపాలాచార్యులు** **నడిగడ్డపాలెము**

శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వముగా మీరు వెలువరించుచున్న శ్రీ రామానుజ కీర్తి కౌముది గ్రంథములను సేవించి, పరమానంద భరితుడనైతిని. అనేక సంప్రదాయ రహస్యార్థములను సదస్య మొనరించుచున్న మీ ఔదార్య మెంతయు ప్రశంసార్హము. సంప్రదాయ ప్రతిపాదకము లగు మీ ప్రచురణములు ఆదర్శ ప్రాయములు, ఆధునిక పద్ధతిలో - ఆధ్యాత్మిక విషయములతో భరితమైన ఈ గ్రంథములు చాల ఆనందమును కల్గించినవి. ఇట్లవిచ్ఛిన్నముగా నిట్టి ప్రథిత విషయములను నేర్పుతో సేకరించుటలో నెంత కృషి సలుపుచున్నారో గదా యని ఆశ్చర్యము కలుగుచున్నది. ఇట్టి ప్రచురణ శతమును భారతీయు లచిర కాలములో ననుభవింతురుగాక యని ఆశించి, శ్రియఃపతిని ప్రార్థించుచున్నాను.

**శ్రీభాష్యం అప్పలాచార్యులు, M A.** **విశాఖపట్టణము**

మీ దృఢ సంకల్పము సంప్రదాయమునకు రక్షయై సాగుచున్నది. మా ఆచార్యులు - శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారు చాలా సంతసించినారు. వారి ఆనందమును మీకు తెలియజేసియే యుందురు. చాల శ్రమ పడి, అపూర్వమైన గ్రంథములను అందజేయుచున్న మీకు అభినందనము.

**శ్రీ రంగాచార్య, M.A.** **పాలెము**

శ్రీ రామానుజ కీర్తి కౌముది ప్రతి సంపుటము కూడ, విశేష విషయ భరితమై విరాజిల్లుచున్నది. మీ అవిశ్రాంత కృషి అత్యంతము అభినంద్యము.

**వేముగంటి నరసింహాచార్యులు** **సిద్దిపేట**

తమ కృషి అమోఘమైనది. విశిష్టాద్వైతమునకు తాము చేయుచున్న సేవ - శ్లాఘాలంఘన జాంఘికము.

**దీక్షితదాసు** **నరసాపురము**

నాస్తికులను ఆస్తికులుగా పరివర్తన చెందింపజాలిన మీ కృషికి నా మనః పూర్వకాభినందనలు.

**ఆచార్య : యస్వీ జోగారావు, M.A; Ph.D.** **విశాఖపట్టణము**

మీరు అను నిత్యం చేస్తున్న సరస్వతీ పరివస్య కడు దొడ్డది. అస్మదాదులకు, అస్మాదృశులకు శ్లాఘా శిరఃకంపపాత్ర మైనది.

**చలమచర్ల వేంకట శేషాచార్యులు** **హైదరాబాదు**

శ్రీ రామానుజ కీర్తి కౌముదిని పదునారు సంపుటములతో వెలయించుట యను బృహత్కార్యమును నిర్వహింప నుద్యమించుట - నేటి పరిస్థితుల దృష్ట్యా మహా సాహస మనక తప్పదు. అట్టిచో - మీ అవిరళ కృషితో - క్లేశముల నధిగమించి విశిష్టాద్వైత ప్రచారము చేయుచు పురోగమించుచున్న మీకు సకల భాగవత లోకము కృతజ్ఞత జూపవలసియున్నది. త్వరలో మీరు - మీ ప్రయత్నమున కృతకృత్యులు కాగలరని విశ్వాసము.

**చిలకపాటి విజయరాఘవాచార్యులు, M.A.** **విజయపురి సౌత్**

సప్తమి కౌముది - సరిక్రొత్త లావణ్యముతోనూ, మహత్తర విశేష సముచ్చయముతోనూ సముల్లసిల్లు చున్నది. కృషి, తపస్సు తమరిది. ఫలితం, ప్రయోజనం రాబోయే తరాల వారిది. ఒకరిది కష్టము. మరొకరిది అదృష్టము.



# పత్రికలు - ప్రశంసలు

**శైవ్యాణి** **డిశంబరు 1986**

శ్రీ రామానుజ చంద్రమసః వేదాంత వియత్తలే దినదినాభివృద్ధి సముపగతాయాః కీర్తి కౌముద్యాః సప్తమీ నామ్నీ ప్రకాశిత మిదం పుస్తకం కళా సప్తకస్య అన్యతమం విరాజతే. సమగ్రోఽప్యయం గ్రంథః ఆంధ్ర భాషాయాం, ఆంధ్ర లిప్యాం ప్రకాశితః సమస్త తెలుగు జనతాయాః కృతే మహా నుపకారో భవతీతి నిశ్చప్రచమ్. పత్ర - పత్రికాత్మికోఽయం గ్రంథః, ఏతాదృశా శ్చాన్యే గ్రంథాః శ్రీ రామానుజ కీర్తి కౌముద్యాః షోడశ కలాత్మికాయాః సంభావితాయాః తత్తత్కలాస్థాన పూరకా భవేయు రితి, ఏత త్ప్రకాశకం వర్గస్య ఆర్థిక సహాయం కృతవతః శ్రీమత్తిరుమల తిరుపతి దేవస్థానస్య హిందూ ధర్మ రక్షణ సంస్థాయాం శ్రీ రామానుజ కీర్తి కౌముదీ యోజనా ప్రరూపం (Project) ధరే దితి చ ఆశాస్మహే.

**భక్తినివేదన** **జనవరి 1987**

చంద్రుడు తన పదునారు కళలతో నొప్పుచు - లోకము నంతను ఆనంద పరచునటుల, శ్రీ రామానుజ కీర్తి చంద్రుని పదునారు రమణీయ గ్రంథ భాగములతో ప్రపన్న లోకము నంతను ఆనందింపజేయు సంకల్పముతో శ్రీమాన్ ధనకుధరం వరదాచార్య స్వామివారు - సుమారు పది సంవత్సరముల నుండి నిరంతర కృషితో నిప్పటికి సప్త ప్రబంధముల నవతరింప జేసిరి. వీరు - శ్రీ రామానుజుల పవిత్ర చరిత్ర ఘట్టములనే గాక, శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రవర్తకులగు ఆళ్వారాచార్యుల యొక్క రచనలలోని విచిత్ర, విశిష్ట ఘట్టములను, వారి ప్రబంధ రహస్యార్థములను తాము స్వయముగా రచించియు, తదభిజ్ఞులగు పెద్ద పండితులచే రచింపజేసియు - ఈ కీర్తి కౌముదిని సార్థక నామము గావించిరి. కావున, శ్రీ రామానుజ దర్శనాభినాషు లెల్లరును, ఈ గ్రంథములను స్వీకరించి చదివి, వారి కృషిని సార్థక పరచుదర మని కోరుచున్నాము.







శ్రీనివాసాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ రామానుజ మతము



"శ్రీమ ల్లక్ష్మణ యోగివ స్తు భువనం సత్యం తదీశః శ్రియః
కాంతో బ్రహ్మ స ఏవ సోఽఖిల తనుః భిన్నా స్తతః చేతనాః
సత్యా సంసృతి రీశ నిగ్రహకృతా ముక్తి స్తు భక్త్యాదినా
త త్ప్రాప్తిః పరమేపదే త దనుభూ త్యాఖ్యేతి సంచక్షతే."

శ్రీమద్రామానుజులు విశిష్టాద్వైత సిద్ధాంతమునకు ముఖ్యాచార్యులు. వారు చెప్పిన దే మన - జగత్తు సత్యము; శుక్తి రజత భ్రాంతి వంటిది కాదు. ఈ జగత్తున కధిపతి శ్రియః పతియైన శ్రీమన్నారాయణుఁడే. ఆతఁడే పరబ్రహ్మ. ఈ సర్వ జగత్తులును ఆతని శరీరమే. అనఁగా - సర్వవ్యాపి యన్న మాట. శ్రీమన్నారాయణుని కంటెను జీవులు భిన్నులు. ఆ జగన్నాథుని నిగ్రహము వలన కలిగిన ఈ జగత్తు సత్యమైనది. భక్త్యాదుల వలననే మోక్షము లభించును. పరమ పదమునందుఁ గల ఆ బ్రహ్మానుభవ మను నదియే ఆ పరమపురుష ప్రాప్తి. ఇవియే యీ సిద్ధాంతము నందలి ముఖ్యాంశములు.

ఇట్టి విశిష్టాద్వైత సిద్ధాంతమును శ్రీమద్రామానుజులు పునరుజ్జీవింపఁ జేసినందున, దీనికి 'రామానుజ మత'మని పేరు వచ్చెను.

శ్రీ రామానుజ మతము నిగమాగమ సమ్మతమైనది. సర్వమతముల యందలి సుగుణము లిందు గలవు. శాస్త్ర ప్రమాణమునకు, యుక్తి వాదమునకు నిలువఁ దగినది. వైదిక మతములలో శ్రేష్ఠతమ

మైనది. సర్వవర్ణములవారికి , సకలాశ్రమములవారికిని ఆచరణ యోగ్య మైనది. క్లేశ రహితమై, అనుష్ఠాన సౌలభ్యము గలిగి, ఇహ పర సుఖములను చేకూర్చునది. కావున, ఇట్టి మత రాజముయొక్క సిద్ధాంతములు ఆబాలగోపాలమునకు తెలియవలసి యున్నవి. అందులకే ఈ రామానుజ కీర్తికౌముదీ గ్రంథ ప్రచురణ మహోద్యమము.

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథ పరంపరలో - ఇది యెనిమిదవది. ఈ అష్టమి కళతో - పూర్వార్థము ముగియుచున్నది. ఈ పూర్వార్థములో - 40 మంది కవి కోవిదులు రచించిన 63 పద్య గద్య రచనలు ప్రచురింపఁబడినవి. అట్టి వానిలో - ఏ యే రచనలు ఏ యే భాగములందు ప్రచురింపఁబడినవో, ఆ యా వివరములు - ఈ గ్రంథాంతమునందుగల 'పూర్వార్థ విషయ దీపిక' మూలమున తెలియఁ గలవు.

అట్టి అమూల్య రచనలతో విలసిల్లు నెనిమిది సంపుటములును పాఠక మహాశయుల ప్రశంసలకు, ప్రముఖ పత్రికా ప్రశంసలకు పాత్రము లగుటయే గాక, మారిషస్, అమెరికా వంటి ఖండాంతరములలో నివసించు ఆంధ్రమహాజనులను సైతము ఆకర్షింపఁగల్గిన వన్న, ఇక యీ గ్రంథ రాజముల వైశిష్ట్యమును గుఱించి వేరుగా వివరించి చెప్ప నేల ?

ఇట్టి యీ పవిత్ర గ్రంథ ప్రచురణ మహోద్యమమునకు వివిధ రూపములలో సహకరించిన మహనీయు లందఱకును ఇందు మూలమున మా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాము.

— ప్రకాశకులు.



# విషయానుక్రమణిక

# శ్రీ వేంకటాద్రీశ్వరస్తుతి

'కవిశేఖర'

**శ్రీమాన్ కోటుభట్టరు వేంకట రంగాచార్యులు, బి. ఏ.**



శ్రీకాంతా కుచ కుంకు మాంకిత తను శ్రీగంధ సౌగంధ శో
భాకాంత్యుజ్జ్వల దివ్యమంగళగళ వ్యాకీర్ణ మాధు వ్రతా
నీకశ్యామల నవ్యపుష్పతులసీ నిక్షిప్త మాలాధరా !
స్వీకార మ్మొనరించు నా నతు లివే ! శ్రీ వేంకటాద్రీశ్వరా !

గంగా పావన వాహినీ మహిమ కేశాధారమై, వేద వే
దాంగాలాప పవిత్రమాత్రచయ మాలాధార భూతంబునై,
రంగన్మౌని జనాంతరంగ వర సారంగా శ్రితాంభోజమై,
శృంగారాంఘ్రియుగంబు వెల్గు గదరా ! శ్రీ వేంకటాద్రీశ్వరా !

ఏ పాదమ్ములు ద్వంద్వసంకుల మహా హేయంపు సంసార దు
ష్పాపధ్వాంత సుతాకరంబులయి, వైకుంఠంపు శుద్ధాంత స
త్సోపానమ్ములునై, సదా నిగమ సుశ్లోకంబులై యొప్పు నీ
శ్రీ పాదమ్ముల జూపి పాపు మఘముల్, శ్రీ వేంకటాద్రీశ్వరా !

మధు మాసాంతర సస్యపల్లవ భర న్మారంద మందార ము
ఖ్య ధరిత్రీ భవ రాగమున్, పృథుల సంధ్యాకాశ రాగంబు, లే
యధర ప్రాభవకోమలారుణిమ లే యంఘ్రి ప్రభల్ గాంచి సం
శిథిలంబై జను జూపుమా ! చరణముల్, శ్రీ వేంకటాద్రీశ్వరా !

నిత్యంబై, వరభక్తకోటికి మహా నిక్షేపమై, వేదవా
క్సత్యంబై, ప్రభవాబ్ధి సంతరణ ముఖ్యాధారమై, ముగ్ధ లా
లిత్య శ్రీ ఘనమై, యనంత భువనాళీసేవ్యమై వెల్గు హృ
త్ప్రీత్యర్థంబుల జూపరా ! చరణముల్, శ్రీ వేంకటాద్రీశ్వరా !

ఆనందమ్ముల మూట, ముక్తిరమణీ యావాసమౌ కోట, వి
జ్ఞానార్యాళికి బువ్వుదోట, నిగమాంతస్సారమౌ తేట, య
జ్ఞానాంధావళి వెల్గుబాట, అరయన్ నా గుండెలో మాట, నీ
శ్రీనిక్షేపపదాంబుజద్వయ మహో ! శ్రీ వేంకటాద్రీశ్వరా !

కలికాల మ్మిది - దేహపోషణ మహాకష్టంబుగా నుండె, ని
ర్మల దీక్షానిరతుండనై నిగమ మార్గంబను యజ్ఞవ్రతా
దులు పూజా మహనీయ కర్మములు విధ్యుక్తంబుగా జేసి, నీ
చెలిమిన్ జెందగలేనురా ! శరణురా ! శ్రీ వేంకటాద్రీశ్వరా !

తల్లిం దండ్రియు నల్ల బాంధవులు నీ దారా తనూజాదు లీ
యెల్లం దేహపు బంధులం చెఱిగి నే నీ మోహ సంసారమం
దుల్లం బుంచి దురంత మస్సహా మహాదుఃఖంబులన్ బొంది శో
షిల్లం సంచిత మాయెరా ! శరణురా ! శ్రీ వేంకటాద్రీశ్వరా !

ఎన్నో జన్మల నెత్తినాడ, మఱి యే నింకెన్నిటో యెత్తగా
నున్నాడన్ గద ! చావు పుట్టుకలతో నున్నట్టి యీ జన్మ చ
క్రాన్నత్యంబు విచిత్ర దుఃఖమయమేతా ! వద్దురా నాకు - నీ
చెన్నుం జెందు పదంబు జూపగదరా ! శ్రీ వేంకటాద్రీశ్వరా !

మోక్షంబో ! భవభారపీడిత మహామోహాంధ సంరక్షణా
దక్షప్రజ్ఞయొ ! శౌరి శిక్షయొ ! ప్రశస్తానంద సంవర్ధకా
నిక్షేపంబో ! ముముక్షు లక్ష్యమొ ! ప్రభూ ! నే చెప్ప లేకుంటి నీ
శిక్షా పాత్రుడ, జూపుమా పదములన్ శ్రీ వేంకటాద్రీశ్వరా !



# దివ్య ప్రబంధ నీరాజనము

'విద్యా భూషణ - కవితా విశారద'

## శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీరామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు



"అల పన్నిద్దఱు సూరులందును సముద్యల్లీలఁగా వున్నవె
గ్గలపుం దాపముఁ బాప నా నిజమనః కంజాత సంజాత పు
ష్కల మాధ్వీక ఝురిన్మురారి సొగియంగాఁ జొక్కి ధన్యాత్ములౌ
నిల పన్నిద్దఱు సూరులం దలఁతు మోక్షేచ్ఛామతిం దివ్యులన్."

## ఆళ్వారుల వాఙ్మయ పరిభావము

ఆళ్వారుల దివ్య ప్రబంధముల ప్రభావము అద్వితీయమైనది. మహత్తర శక్తి సంభరితములైన ఆ దివ్య ప్రబంధములు - ధర్మము, సాహిత్యము, సమాజము, కళ అనువానిపై, తమ ప్రభావమును బహుముఖములుగా ప్రదర్శించియున్నవి. కావున, ఆళ్వారుల దివ్య ప్రబంధములతో తులదూఁగు గ్రంథము - తమిళ భాషలో మఱియొకటి లేదనుట - నిర్వివాదాంశము. భారతీయ సాహిత్య ప్రపంచమున అనర్ఘరత్నము లనఁదగు అట్టి ఆళ్వారుల దివ్య ప్రబంధములు - సర్వజనులకు శిరోధార్యములై యలరారుచున్నవి.

## ఆళ్వారుల భక్తి ప్రచార మహోద్యమము

ఆళ్వారుల దివ్య ప్రబంధములు భక్తి ప్రచారోద్యమమునకు ఆద్య గ్రంథములుగా విఖ్యాతి నార్జించుకొని యున్నవి. తమిళ ప్రదేశమునకు సంబంధించిన ధార్మిక, సామాజిక, నైతికాది విషయములపై, ఆళ్వారుల దివ్య ప్రబంధముల ప్రభావము బాగుగా వ్యాపించినది. వేద బాహ్యములైన జైన బౌద్ధములు ప్రబలములై, వైష్ణవ ధర్మముపై దాడిజేయ నారంభించిన తరుణములో - వైదిక ధర్మమును పున రుద్ధరింపవలసిన యవసర మేర్పడినందునను, యజ్ఞ యాగాది క్రియలలో కఠిన నియమములుగల వైదిక ధర్మమును సరళము

గావించి, సామాన్య ప్రజలకు సైతము ముక్తిసాధనములను సులభ సాధ్య మొనరించుటకు హిందూమతమున సంస్కర్త లవసర మగు పరిస్థితి యేర్పడినందునను, ఆ యుగమున ఆ యవసరములను నెర వేర్చుటకై, ఆళ్వారు లవతరింప వలసివచ్చెను. మహనీయులైన ఆ యాళ్వారులు - జైన బౌద్ధాది నాస్తిక మతములను ఖండించుచు - భగవంతుని మహిమను, ఔదార్యమును, దయా స్వభావమును ప్రజా నీకమున ప్రచారము గావింప నుపక్రమించిరి. అట్టి స్థితిలో - ఆళ్వా రులు తమిళ ప్రదేశమునందు ప్రవహింపఁజేసిన పావన భక్తి పయ స్వినీ తరంగములలో నోలలాడిన సుకృతవంతులు పరమ శాంతిని పొందగల్గిరి.

వైదికమైన భక్తిస్వరూపమును యుగధర్మానుసారముగ పరివర్త నము గావించి, అది జను లందఱకును అందుబాటులో నుండి శ్రేయ మును చేకూర్చుటకును, దానిని సులభతరముగను - ఆకర్షవంతము గను రూపొందించుటలో ఆళ్వారులు విశేష పరిశ్రమ గావించి, సఫల మనోరథులు కాఁగల్గిరి. కావున, నేఁటి భారతీయ భక్తి వాఙ్మయ ప్రపంచమున దృగ్గోచరమగు శ్రీవైష్ణవ సంప్రదాయము ఆళ్వారుల యనుగ్రహ ఫలవిశేష మనియే గ్రహింప నగును.

వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత మున్నగు వానిలోఁ గల తాత్త్విక విషయములను పరిపూర్ణముగా నెఱింగిన ఆళ్వారులు - తత్ప్రాంతీయమైన తమిళభాష యందే తమ తమ అనుభూతులను వెలువరించి, తమిళ ప్రజలకు మహోపకారము గావించిరి. అట్టి మహోపకారమునకు కారణభూతములగు ఆళ్వారుల పాశురము లన్నియు - మధురాతి మధురములై, గాన యోగ్యములుగా నున్నం దున, అవి తమిళ ప్రజలను విశేషముగ ఆకర్షింపఁగల్గినవి. భక్తి మార్గమున కుల భేదములను పాటింపని ఆళ్వారుల ఉన్నతాశయములు ప్రజలపై గొప్ప ప్రభావమునుఁ జూపినవి. ఇందువలన జరిగిన నిమ్నజాతి సముద్ధరణము - చరిత్రప్రసిద్ధి గాంచినది.

భక్తి ప్రపూరితములైన ఆళ్వారుల జీవిత ప్రతిభా విశేషములు - ప్రజలచే బహు భంగులుగా ప్రస్తుతింపఁబడినవి. మహోన్నతములైన ఆ భక్తాగ్రేసరుల భావనా పరంపరలు - అఖిల మానవాళికిని గ్రహణ యోగ్యములుగా విరాజిల్లినవి. వారి దివ్య ప్రబంధములలోఁ గల విశిష్ట విషయములు ముముక్షువు ల దఱకును మార్గదర్శకములై యొప్పారినవి. ఆ మహనీయు లొనరించిన భక్తి ప్రచారోద్యమమునకు ఫలముగా - దక్షిణభారతమునం దంతటను భక్తిమయమైన వాతావరణ మేర్పడినది.

## నాలాయిర దివ్య ప్రబంధ వ్యాపక ప్రభావము

ఆళ్వారుల భక్తి వాఙ్మయము - ధార్మిక మయములైన ప్రజా జీవితములపై, అపూర్వమైన ప్రభావమును ప్రదర్శించెను. 5 - వ శతాబ్దము మొదలుకొని, 9 - వ శతాబ్దము వఱకు నడుమగాఁ గల కాలము తమిళ ప్రదేశమునకు సంబంధించిన ధార్మిక జీవిత చరిత్రలో - అత్యధికమైన ప్రాముఖ్యమును పొందియున్నది. ఆళ్వారుల భక్తి సిద్ధాంత మంతయు - ఆ తరుణమునందే తమిళ ప్రదేశమున బాగుగా వ్యాపించెను. తత్ఫలముగా - తమిళ ప్రదేశమున దేవాలయములు అసంఖ్యాకముగ నిర్మింపబడినవి. అట్లు నిర్మింపబడిన ఆలయములలో - అర్చనలు, ఉత్సవాదులుకూడ జరుగ నారంభమైనవి. ఆళ్వారులు నాటిన భక్తి బీజ మంకురించి, కాలక్రమమున నొక మహావృక్షముగా వృద్ధి జెందెను. అట్లు వర్ధిల్లిన భక్తి వృక్షము యొక్క శీతల ఛాయలలో - ఆళ్వారుల యనంతరము సైతము అనేక శతాబ్దముల వఱకు తమిళ ప్రజలు శాంతి ననుభవించిరి.

9 - వ శతాబ్దమునకు పిమ్మటనే తమిళ ప్రజలు ఆళ్వారుల వాఙ్మయ ప్రభావమును పరిపూర్ణముగ గుర్తింపఁ గల్గిరి. న్యాయ కర్తలు అళ్వారుల వాఙ్మయ మహోదధిలో మునిఁగి, న్యాయ రత్నముల నెన్నింటినో వెలికి దీసిరి. ఆళ్వారుల దివ్య ప్రబంధములపై కాల

క్రమమున అనేక టీకలు వెలువడినవి. ఆళ్వారులను ప్రస్తుతించుచు, అనేక వేల గ్రంథములు రచింపఁబడినవి. ఆళ్వారుల ద్రావిడ దివ్య ప్రబంధములు సంస్కృత వేదములకంటెను శ్రేష్ఠతరములుగ ప్రజలచే సంభావింపఁబడినవి. తత్ఫలముగా - వైష్ణవాలయములలో ఆళ్వారుల పాశురములు ప్రతిధ్వనింపసాగెను.

ప్రజల ధార్మిక జీవితమున సంస్కృత వేదమునకు లభించి యున్నంతటి స్థానమే ఆళ్వారుల దివ్య ప్రబంధములకును లభించి యున్నది. ఏ యే సందర్భములలో వేద మంత్ర పఠన మావశ్యక మగు చున్నదో - ఆ యా సమయ సందర్భములలో ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయనమే చేయబడుచున్నది. దేవాలయములలో అర్చనాది సమయములందు - సంస్కృత వేదముతోఁ బాటు, ద్రావిడ వేదాధ్యయనము గూడ విధిగా జరుగవలెనని శాసింపఁబడినది.

మార్గశీర్ష మాసములో శుద్ధ ఏకాదశి మొదలుకొని, పది దినముల వఱకును వైష్ణవాలయములలో ప్రత్యేకముగ వేదాధ్యయనము జరుగుచుండుట పరిపాటి. దీనిని 'వైకుంఠోత్సవము' అని యందురు. శ్రీరంగములో ఈ యుత్సవము జరుగు నపుడు - వైకుంఠ ఏకాదశీ ప్రభృతి, ద్రావిడ వేదములో నొక భాగముగా ప్రసిద్ధిఁ జెందిన 'తిరువాయిమొళి' అధ్యయనముకూడ జరుపఁబడుచున్నది. పది దినములు జరుగు ఆ యుత్సవములో - ఒక దినమున ప్రత్యేకముగ యజుర్వేదమునందలి అష్టమ ప్రపాఠకము అధ్యయనము చేయఁబడుచుండెడిది. కాని, ఆళ్వారుల యనంతరము ఆ పద్ధతి మార్పు జెంది ఆ నాఁడు ఆ సమయమున ద్రావిడ వేదాధ్యయనమే జరుగ నారంభమయ్యెను. అందువలన, యజుర్వేదాధ్యయనము విరమింపఁబడవలసి వచ్చెను. నాఁటినుండి కేవలము ద్రావిడ వేదాధ్యయనమే ఆ యుత్సవములో జరుగుట పరిపాటి యయ్యెను. ఆ నాఁటి ఉత్సవ సమయములో - నమ్మాళ్వారుల 'తిరువాయిమొళి' దివ్య ప్రబంధమునందలి

రెండు వందల పాశురములు అను సంధింపఁబడుచున్నవి. ఈ రీతిగా - 'తిరువాయిమొళి' యందలి పాశురములన్నియు, ఆ పది దినములలో పూర్తిగా అధ్యయనము చేయఁబడుచున్నవి. ఇట్లు ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయనము పూర్తియైనంతనే - నమ్మాళ్వారులు పరమాత్మలో ఐక్యమైన సూచనగా - నమ్మాళ్వారుల విగ్రహము శ్రీరంగనాథుని చరణారవిందముల సన్నిధికి చేర్చబడుచున్నది.

పైఁ జెప్పఁబడిన వైకుంఠోత్సవములో - 'తిరువాయిమొళి' దివ్య ప్రబంధాధ్యయనమే జరుగుచున్నందున, ఆ ఉత్సవము 'తిరువాయిమొళి' ఉత్సవ మనియు - 'మోక్షోత్సవ' మనియు వ్యవహరింపఁబడసాగెను. ఆ యుత్సవము మొట్టమొదట కేవలము 'తిరువాయి మొళి ఉత్సవ' మనియే వ్యవహరింపఁబడుచుండెడిది. కాని, అనంతర కాలమున భక్తులచే మఱియొక ఉత్సవము కూడ జరుపఁబడ నారంభమైనది. ఇది - తిరువాయిమొళి ఉత్సవమునకు పది దినములు ముందుగా ప్రారంభింపఁబడి, ఆ ఉత్సవమునకు ఒక దినము ముందువఱకు - అనఁగా, వైకుంఠ ఏకాదశివఱకు జరుపఁబడుచుండెడిది. ఇందువలన ఈ యుత్సవము - 'వైకుంఠోత్సవము' అని వ్యవహరింపఁ బడసాగెను. మోక్షోత్సవములో - 'తిరువాయిమొళి' అధ్యయనము జరుగుచున్నట్లే, ఈ వైకుంఠోత్సవములో - ఇతర ఆళ్వారుల పాశురములు కూడ అనుసంధింపఁబడుచున్నవి. పైఁ జెప్పఁబడిన రెండు ఉత్సవములకు - ఆగమ మనియు, నిగమ మనియు పేరులు. కాని, వాని స్థానములలో నిపుడు తమిళ నామములే వాడుకలో నున్నవి. వైకుంఠోత్సవమును 'తిరుమొళి తిరునాళ్' అనియు, మోక్షోత్సవమును 'తిరువాయి మొళి తిరునాళ్' అనియు వ్యవహరించుట పరిపాటి యయ్యెను. ప్రారంభపు పది దినములను 'పగల్ పత్తు' అనియు, తర్వాత పది దినములను 'ఇరాపత్తు' అని నుడువుచుందురు. మొదటి ఉత్సవమున - 'తిరుమొళి' కి అధ్యయనము పగటికాలము

నందును, రెండవ ఉత్సవమున - 'తిరువాయిమొళి' అధ్యయనము రాత్రికాలమునందును జరుపఁబడుచున్నవి. ఇందువలన, పెరియ తిరుమొళి'లోఁ గల తిరుమంగైయాళ్వారుల పాశురములకును విశేషమైన ప్రాముఖ్యము లభించియున్నది.

పైఁ జేర్కొనఁబడిన ప్రధాన వార్షికోత్సవములందే గాక, దక్షిణ భారతదేశమునందుఁ గల సుప్రసిద్ధ వైష్ణవ క్షేత్రములలో జరుగు వివిధ ఉత్సవములందును ఆళ్వారుల ద్రావిడదివ్యప్రబంధములు అనుసంధింపఁబడుచున్నవి. దక్షిణ దేశమునఁ గల ప్రముఖ వైష్ణవాలయములలో - శ్రీరంగము, తిరుపతి, కాంచీపురము అను మూడు క్షేత్రములును ఆళ్వారుల వాఙ్మయమున విశేషముగ వర్ణింపఁబడినవి. ఆ దివ్య క్షేత్రములలో వరుసగా వేంచేసియున్న శ్రీ రంగనాథస్వామివారికిని, శ్రీ వేంకటేశ్వరస్వామివారికిని, శ్రీ వరదరాజస్వామివారికిని ఉత్సవములు జరుగునపుడు - నాలాయిర దివ్యప్రబంధమునందలి 'ఇయత్పా' విభాగమునగల రచనలలో - చివఱి రచనయగు 'పెరియ తిరుమడల్' దివ్య ప్రబంధాధ్యయనము కడపటి దినమున జరుగుచుండుట పరిపాటియైనది. బ్రహ్మోత్సవ దినములలో - పైఁ జెప్పఁబడిన వైష్ణవాలయముల లోపల గల నమ్మాళ్వారుల సన్నిధానమునందే (విగ్రహము వద్దనే) ఆ పాశురములు అనుసంధింపఁబడుచున్నవి. మొట్టమొదట ఈ యుత్సవము కేవలము శ్రీరంగమునందు మాత్రమే జరుగుచుండెడిది. కాని, తర్వాత - దాని ననుసరించి,ఇతర వైష్ణవాలయములందును జరుగసాగినది.తమిళప్రదేశమునఁ గల వైష్ణవ ధర్మ ప్రచారకములైన కేంద్రము లన్నింటిలో ప్రధాన కేంద్రమగు శ్రీరంగమునందే ఈ యుత్సవము లన్నియు ప్రారంభమున జరుగుచుండెడివనియు, తర్వాత - ఇతర వైష్ణవాలయములలోఁగూడ తదనుసారముగ జరుగ నారంభమయ్యెననియు తెలియుచున్నది. కొన్ని ఉత్సవములకు సంబంధించిన వివరములు శిలాశాసనముల మూలము

నను తెలియవచ్చుచున్నవి.

ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయనము కేవలము వైష్ణవాలయము లలో జరుగు ఉత్సవములందేగాక, తదితరములైన శుభ కార్య సందర్భము లన్నింటి యందును జరుగుచున్నది. శ్రీకృష్ణ జన్మాష్టమీ సందర్భమున, కృష్ణావతారమునకు సంబంధించిన దివ్యప్రబంధములోఁ గల పాశురములు అధ్యయనము చేయఁబడుచున్నవి. భగవద్విగ్రహములకు ఊరేగింపు జరుగునపుడు - ముందు వెళ్ళువారు దివ్య ప్రబంధములందలి పాశురములను, వెనుక వచ్చువారు వేద మంత్రములను అధ్యయనము చేయుచుందురు. ఆళ్వారుల పాశురములకు లభించిన ప్రాముఖ్యమును సూచించుటకే ఇట్లు జరుగుచుండుటకు కారణము. శ్రీవేదాంత దేశికులు - 'పాదుకా సహస్రము' అను పేర నొక స్తోత్ర గ్రంథమును రచించుచు, అందు వారు దివ్యప్రబంధములను ప్రశంసించు సందర్భమున - 'అర్చా మూర్తులను ఊరేగించునపుడు దివ్య ప్రబంధాధ్యయనము ముందువైపున జరుగుట అత్యంతము సముచితము' అని తమ అభిప్రాయమును స్పష్టముగా వెల్లడించి యున్నారు.

మార్గశీర్ష మాసము (మార్గళి) లో-ప్రాతఃకాలమున,ఆండాళ్ రచించిన 'తిరుప్పావు' నందలి ముప్పది పాశురములను, తొండరడిప్పొడి యాళ్వారులు రచించిన 'తిరుప్పళ్ళియెళుచ్చి' యందలి పది పాశురములును అనుసంధింపఁబడుచున్నవి. ఆశ్వయుజ మాసము (అల్పిశి)లో 'ఊంజల్ ఉత్సవము' (డోలోత్సవము) జరుగునపుడు - పెరియాళ్వారులచే రచింపఁబడిన ('మాణిక్కంగట్టి' నుండి ప్రారంభమగు) పాశురములు కొన్నియు, కులశేఖరాళ్వారులచే రచింపఁబడిన ('మన్నుపుగళ్ కూశలైతన్' నుండి ప్రారంభమగు) పాశురములు కొన్నియు అనుసంధింపఁబడుచున్నవి. అర్చా మూర్తులకు ఆరగింపు

(నైవేద్యము) సమర్పించు సమయమున పెరియాళ్వారులచే రచింపఁబడిన 'వెణ్ణెయళైన్ద కుణ్ణుజ్గుమ్' అను పాశురముతో ప్రారంభమగు పాశురములు కొన్ని అనుసంధింపఁబడుచున్నవి. తిరుమంజనము (భగవద్విగ్రహములకు స్నానము, పుష్ప ధారణము మొదలగు అలంకార సేవలు జరుగు వేళలలో - 'నీరాట్టమ్' 'పూచ్చూడల్' 'కాప్పిడల్' మున్నగు శీర్షికలతోఁగల పాశురము లనుసంధింపఁబడుచున్నవి. ఇట్టి అర్చనాది క్రియలలో - సంస్కృత వేదముకంటెను, ద్రావిడ వేదము ముఖ్యమైనదిగా భావింపఁబడుచున్నది. ప్రతి నిత్యము పఠించుటకై, యెన్నిక చేయఁబడిన పాశుర సముదాయమును - 'నిత్యానుసంధానము'(నిత్య పాఠ సంగ్రహము) అనియు, ఆ యా ప్రత్యేక సందర్భములలో చివఱకు అనుసంధించు పాశుర సముదాయమును 'సాత్తుమొఱై' అనియు వ్యవహరించుచుందురు. ఈ వ్యవహార మంతయు - నేఁటికిని తమిళ ప్రదేశమున యథావిధిగా జరుగుచునే ఉన్నది. ఈ కారణముల వలన, ఆళ్వారుల దివ్య ప్రబంధములు తమిళ ప్రజల ధార్మిక జీవితమునకు ఎంతగా సన్నిహితము లయ్యెనో గ్రహింపనగును.

శ్రీవైష్ణవ సంప్రదాయులు భగవదారాధనార్థమై, తమ తమ గృహములలో ప్రత్యేకముగా నొకవైపున కొంత ప్రదేశమును నేలు బఱచి యుంచుచుందురు. అట్టి ప్రదేశమును 'కోవిల్ ఆళ్వార్' అనియందురు. అనఁగా - 'ఆళ్వారుల ఆలయము' అని యర్థము. అర్చనాది సమయములలో - ఆళ్వారుల దివ్య ప్రబంధములందలి పాశురము లేవేని యనుసంధించుట శ్రేయస్కరమని శ్రీవైష్ణవ సంప్రదాయుల విశ్వాసము. రమణీమణులు ప్రభాత సమయమున తమ తమ గృహ ప్రాంగణములలో రంగవల్లులు దీర్చు సందర్భమునందు - ఆండాళ్ రచించిన కొన్ని పాశురములను అనుసంధించుచుందురు. ఇట్టి రంగవల్లీకరణమును తమిళ ప్రజలు - 'కోలమ్' (అలంకార రేఖలు) అని వ్యవహరించుచుందురు.

శ్రీ వైష్ణవ సంప్రదాయని గృహమున శిశువుకు జన్మ దినోత్సవము జరుగునపుడు - ఆళ్వారులు రచించిన పాశురములలో కొన్ని పఠింపఁబడుచున్నవి. తల్లులు తమ తమ బిడ్డలను నిద్ర బుచ్చునపుడు మిక్కిలి మక్కువఁ జూపుచు, పెరియాళ్వారులచేతను - కులశేఖరాళ్వారులచేతను రచింపఁబడిన జోలపాటలను పాడుచుందురు. ఆళ్వారుల దివ్య ప్రబంధములలో వర్ణింపఁబడిన ఉత్సవము లన్నియు తమిళప్రదేశమున నేఁటికిని జరుపఁబడుచునే ఉన్నవి. ఆ దివ్య ప్రబంధములలో నిర్దేశింపఁబడిన సంస్కారములు, వ్రతాదులు ఆచరింపఁబడుచునే ఉన్నవి. 'తిరుప్పావు' దివ్యప్రబంధములో గోదాదేవి మార్గళి వ్రతమునకు సంబంధించిన విశేషముల నన్నింటిని విపులీకరించి యున్నందున, తదనుసారముగా - యువతులు యోగ్యులైన వరులను పొందుటకై, అట్టి మార్గళివ్రత మాచరించుచు - 'తిరుప్పావు' పాశురములను అనుసంధించుచుందురు. వైష్ణవ గృహములలో వివాహ సందర్భమున ఆళ్వారుల పాశురములు నేఁటి కాలమునందును గోష్ఠిగా గానము చేయఁబడుచున్నవి. దీనిని - 'సీర్ పాడల్' అని యందురు. ఈ సందర్భమున, ఆండాళ్ రచించిన 'నాచ్చియార్ తిరుమొళి' దివ్య ప్రబంధమునందలి 'వారణ మాయిరమ్' అను పాశురముతో ప్రారంభమగు పది పాశురములను పాడుట - పరమావశ్యకముగా భావింపఁబడుచున్నది. మఱియు - వధూవరులను గుఱించి మంగళాశాసనము (ఆశీర్వచనము) చేయు సమయమునందును, ఇతరులు 'వారణమాయిరమ్' అను శీర్షిక గల దశకమును పఠించుచుందురు. ఆండాళ్ - స్వప్న సీమలో కృష్ణభగవానుఁడు తనను వివాహమాడినట్లు, తాను రచించిన 'నాచ్చియార్ తిరుమొళి' యను దివ్య ప్రబంధమునందు విశదీకరించి యున్నందున, ఆ యంశమును సంస్మరించుచు, ఆండాళ్ నిమిత్తమై నిర్మింపఁబడిన ఆలయములలో ప్రత్యేకముగా ప్రతి సంవత్సరము మార్గళి మాసమున భక్తులచే ఒక ఉత్సవము జరుపఁబడుచున్నది. అట్టి

ఉత్సవమును - 'ఆండాళ్ తిరుక్కల్యాణమ్' (ఆండాళ్ వివాహ మహోత్సవము)అని వ్యవహరించుచుందురు. ఈ సందర్భమున,ఆండాళ్ రచించిన 'నాచ్చియార్ తిరుమొళి' దివ్య ప్రబంధమునందలి ఆ వివాహ ఘట్టమునందలి పాశురములు అనుసంధింపఁబడుచున్నవి.

ప్రాణప్రయాణ సమయమునందును, శ్రాద్ధ సమయమునందును ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయనము మూఁడు దినములు చేయఁబడు చున్నది. ఆ సందర్భమున - ఒక దినమునకు ముందే దివ్యప్రబంధాధ్య యనము పూర్తి చేయఁబడుచున్నది. దివ్య ప్రబంధాధ్యయనము జరిగిన యనంతరమే శ్రాద్ధ సంబంధములగు ఇతర కర్మలు నిర్వ ర్తింపఁబడుచున్నవి. అంత్యేష్టిక్రియ నిమిత్తము భౌతిక కాయమును తీసికొని వెళ్ళునపుడు - ఆళ్వారుల పాశురములలో కొన్ని అను సంధింపఁబడుచున్నవి. భౌతిక శరీరమును వీడిన జీవుఁడు- ముందు ఆచార్య పాదపద్మముల సన్నిధికిఁ జేరగలడని శ్రీవైష్ణవుల విశ్వాసము. ఇందువలన, శ్రీ రామానుజ స్తుతిగా - 'తిరువరంగత్త ముదనారులు' అనువారిచే రచింపఁబడి, ప్రపన్న గాయత్రిగా ప్రసిద్ధి గాంచిన 'ఇరా మానుశ నూత్తందాది'అను దివ్య ప్రబంధమునందలి నూట యెనిమిది పాశురములు ముందుగా అనుసంధింపఁబడుచున్నవి. శ్రీవైష్ణవ సంప్ర దాయుఁడు ప్రాణము విడచుటకు కొన్ని క్షణములకు ముందు - నమ్మా ళ్వారులచే రచింపఁబడిన 'తిరువాయిమొళి' దివ్య ప్రబంధమునందలి దశమ శతకమున - 'శూళివిశుమ్బిల్' (అర్చిరాది) అను శీర్షికతోఁ, నవమ దశకమునందలి పాశురములను ఆ వైష్ణవభక్తునివద్ద నుండువారు పఠించుందురు. ఆ పాశురములను ఆ రీతిగా పఠించుటచే, ఆ యాత్మకు తప్పక పరమపదము లభింపగలదని శ్రీవైష్ణవ సంప్రదాయుల ప్రగాఢ విశ్వాసము. ఈ విధముగా - ఆళ్వారుల దివ్య ప్రబంధములు శ్రీ వైష్ణవ సంప్రదాయుల సామాజిక జీవితముతోఁ గలిసిపోయినందున, ఆ దివ్య ప్రబంధములకును, శ్రీవైష్ణవ సంప్రదాయమునకును అవినా భావసంబంధ మేర్పడెనని తెలియనగును.

విష్ణ్వాలయములలో పన్నిద్దఱాళ్వారుల విగ్రహము లుండుట అత్యావశ్యక మని సంప్రదాయజ్ఞులు నిర్దేశించి యున్నారు. తదనుసారముగ - కొన్ని విష్ణ్వాలయములలో పన్నిద్దఱాళ్వారుల విగ్రహములు ప్రతిష్ఠింపఁబడినవి. అట్టి దేవాలయములు దివ్య స్థలములుగా శ్రీవైష్ణవ సంప్రదాయులచే సంభావింపఁబడుచున్నవి. ఒకవేళ ఈ రీతిగా పన్నిద్దరాళ్వారులను ప్రతిష్ఠించుటకు తగిన యవకాశము లభించనిచో - కనీసము నమ్మాళ్వారుల యొక్కయు, ఆండాళ్ యొక్కయు విగ్రహములు రెండేని విధిగా నుండవలెనని శ్రీ వైష్ణవ సంప్రదాయుల కృత నిశ్చయము. కనుక, ఈ నిర్ణయానుసారము ఈ రెండు విగ్రహములైనను ప్రతి విష్ణ్వాలయములో నుండుట అవసరము. అటుపిమ్మట - అట్టి ఆలయములలో జరుగు ఉత్సవాదులందు ద్రావిడ దివ్యప్రబంధాధ్యయనము విధిగా జరుగవలసిన కృత్యము. ఆళ్వారుల వాఙ్మయములో అభివర్ణింపఁబడిన అష్టోత్తరశతదివ్య క్షేత్రములు (నూట యెనిమిది దివ్యతిరుపతులు) ముఖ్యముగా సందర్శింపఁదగినవని శ్రీ వైష్ణవ సంప్రదాయుల నిశ్చితాభిప్రాయము.[1] ఈ కారణములనుఁ బట్టి, శ్రీ వైష్ణవ లోకమునకు ఆళ్వారులయందును వారి దివ్యప్రబంధముల యందునుఁ గల గౌరవభావము స్పష్టమగుచున్నది కదా!

## వివిధ కళలపై దివ్య ప్రబంధ ప్రభావము

ఆళ్వారుల వాఙ్మయము - అనేక కళలకు రూప కల్పనము గావించి, వానికి మిక్కిలి ప్రాముఖ్యమును చేకూర్చియున్నది. ఆళ్వారులు తమిళ ప్రదేశమున భక్తిమయమైన వాతావరణమును కల్పించిన ఫలితముగా-భక్తులైనవారు తమ ఉపాసనా పిపాసను శాంతింపఁజేసికొనుటకై, ఆనాఁటి ప్రభువుల మూలమున అనేక వైష్ణవాలయ

1 ఆళ్వారుల దివ్య ప్రబంధములలో దాదాపు 108 వైష్ణవాలయములకు సంబంధించిన వివరణమున్నది. ఆ వైష్ణవాలయములలో, గల అర్చా మూర్తులను స్తుతించుచు, ఆళ్వారులు అనేక పాశురములను గానము చేసియున్నారు. ఇందువలన, ఆ దేవాలయములు మిక్కిలి ముఖ్యమైనవిగా శ్రీవైష్ణవులచే సంభావింపఁబడుచున్నవి.

ములను నిర్మింపఁ జేసిరి. అధిక సంఖ్యలో భక్తులు దేవాలయములకు వెడల నారంభించిరి. ఆ దేవాలయములలో ప్రతిష్ఠింపఁబడిన భగవద్విగ్రహములను, భగవల్లీలలను ప్రస్ఫుటింపఁజేయు శిలా ఖండములను సందర్శించి, ఆత్మశాంతిని పొందసాగిరి. ఆ కాలమున దేవాలయ నిర్మాణ విషయములో పల్లవరాజులు చూపిన శ్రద్ధాసక్తులు అనుపమానములు.[2] నేఁడు తమిళ ప్రదేశమునఁగల విష్ణ్వాలయములలో చాలవఱకు ఆళ్వారులచే నిర్వహింపఁబడిన భక్తి ప్రచారోద్యమమునకు దివ్యఫలములే యనుట - సత్యదూరము కానేరదు.

ఆ కాలమున దేవాలయ నిర్మాణమునకు ఫలముగా గృహ నిర్మాణ కళయు నభివృద్ధి పొందసాగెను. కళాకారుల నైపుణ్యము విశేషముగ ప్రకటనమై, ప్రజల నాకర్షింపఁదొడంగెను. తమిళ ప్రదేశమునఁ గల వైష్ణవాలయము లన్నింటి బాహ్యరూపము ఒకే రీతిగా నుండు నను విషయము మన మెన్నటికిని మఱువరానిది. దేవాలయ గోపురములు మహోన్నతములై, చూపరులను ఆశ్చర్య చకితులను గావించుచునే ఉన్నవి. వైష్ణవాలయములలో వివిధ రూపములుగాఁ గల భగవ

---

2. పల్లవులు :- వీరు కాంచీ పురము రాజధానిగాఁ జేసికొని కృష్ణానదికి దక్షిణమున నుండిన తూర్పుతీరమును పాలించిరి. పలనాడు పల్లవుల మూలస్థానము. పల్లవులు వైదిక మతాభిమానులు. 4-వ శతాబ్దము నందలి సముద్ర గుప్తుని దండయాత్ర కాలమున నతని నెదిరించిన విష్ణుగోపుడు పల్లవుడు. పల్లవులలో శివస్కంధవర్మ, నరసింహవర్మ, నందివర్మ, మహేంద్రవర్మలు సుప్రసిద్ధులు. వీరి కాలమున హిందూమతమునకు విశేష ఆదరణ లభించెను, హైందవ దేవాలయము లెన్నియో నిర్మింపబడెను. నరసింహవర్మ తూర్పు సముద్ర తీరమునందలి మహా బలిపురమున దివ్య శిల్పముతో కూడిన రాతి రథములు ఆలయములను నిర్మించెను. పల్లవులు సంస్కృతమును గూడ పోషించిరి. ఆనాడు కాంచీపురము మొక విద్యా పీఠముగ నుండెను."

– "భారతదేశ చరిత్రము" 44, 45 పుటలు.

గ్రంథకర్త :- శ్రీ గడియారం రామకృష్ణ శర్మ.

ప్రకాశకులు :- ఆంధ్రసారస్వత పరిషత్తు – హైదరాబాదు.

ప్రచురణ 1955

ద్విగ్రహములతోఁబాటు, ఆళ్వారుల విగ్రహములు కూడ వివిధ ప్రదేశములలో ప్రతిష్ఠింపఁబడినవి. కాలము గడచిన కొలఁదియు - ఆళ్వారులు కూడ భగవదవతారములే యను భావము ప్రజల మనస్సులలో బాగుగా నాటుకొనెను. తత్ఫలముగా - ఆళ్వారులకును ఆలయములు నిర్మింపఁబడినవి. అట్టి ఆలయములలో శ్రీవిల్లిపుత్తూరునందుఁగల ఆండాళ్ ఆలయము మిక్కిలి ప్రసిద్ధమైనది. విజయనగర సామ్రాజ్యమునకు ప్రభువుగా నుండి, విద్వత్కవియై, 'విష్ణుచిత్తీయ' మను నామాంతరము గల 'ఆముక్తమాల్యద' అను కావ్యరత్నమును రచించి సాటిలేని, కీర్తి గడించిన శ్రీకృష్ణదేవరాయలు - 13 వ శతాబ్ద ప్రాంతమున ప్రత్యేకముగా నొక విష్ణ్వాలయమున ఆండాళ్ విగ్రహమును ప్రతిష్ఠించి చరితార్థుఁ డయ్యెను. ఆ యాలయమునందలి ఆ భాగమునకు - 'ఆండాళ్ సన్నిధి' అని పేరు.

ఆ కాలమున దేవాలయములతోఁబాటు - అనేక మండపములు కూడ నిర్మింపఁబడినవి. ఆ మండపములలో గాయకులు వివిధ వాద్యములతోఁ గూడి ఆసీనులై, ఆళ్వారుల పాశురములను గానము చేయుచుండెడివారు. ఆళ్వారుల భక్తిప్రచారోద్యమ ఫలముగా నిర్మింపబడిన వేలకొలది దేవాలయము లుండుటను బట్టియే తమిళ ప్రదేశము 'దేవాలయముల దేశము' అను అన్వర్థనామముతో విఖ్యాతి గాంచి యున్నది.

శిల్పకళయందును, చిత్రకళయందును ఆళ్వారుల వాఙ్మయ ప్రభావము విశేషముగ వ్యాపించియున్నది. భగవద్విగ్రహములను మలచుటయందును, ఆ విగ్రహముల ఆకారాదులను నిర్ణయించుటయందును ఆళ్వారుల వాఙ్మయమే ప్రధానాధారముగా గ్రహింపఁబడినది. ఆళ్వారుల వాఙ్మయములో - విష్ణువుకు సంబంధించిన వివిధ రూపములు ఏ విధముగాఁ వర్ణింపబడి యున్నవో - ఆ విధముగనే శిల్పులు భగవద్విగ్రహములను మలచుచు, ఆ విగ్రహములలో తమ

కళాకౌశల విశేషముచే, సౌందర్యమును పరిపూర్ణముగా నింపికేసిరి. పెద్ద పెద్ద శిలాఖండములను విగ్రహములుగా మలచుటలో – ఆ కాలమున శిల్పులు మంచి నైపుణ్యము గల్గియుండెడివారు. మహాబలిపురమునందలి గుహ, దేవాలయము, రథము, మండపము మొదలగునవి అట్టి శిలా ఖండములతో నిర్మింపఁబడియున్నవియే. ఆళ్వారుల యనంతరకాలమున, ఆ మహనీయుల విగ్రహములు సైతము మలచబడి, వైష్ణవాలయములలో ప్రతిష్ఠింపఁబడినవి. అట్టి ఆళ్వారుల విగ్రహ ప్రతిష్ఠలను బట్టి ఆ నాటి తమిళ ప్రజలకు ఆళ్వారులపై గల భక్తి భావమును మనము సులభముగా గ్రహింపవచ్చును.

ఆ తరుణమున శిల్పకళతోఁబాటు – చిత్రకళయు వికాసము జెంద నారంభించెను. ఆళ్వారుల వాఙ్మయమునందలి రామకృష్ణా ద్యవతారములకు సంబంధించిన చరిత్రాంశములను దృష్టిలో నిడుకొని, చిత్రకారులు అనేక చిత్రములను చిత్రీకరించిరి. ఆ చిత్రములను పరిశీలించిన ప్రజలు, మిక్కిలి ముగ్ధులగుచుండెడివారు. కాని, ఆ నాటి ఆ చిత్రములలో కొన్ని మాత్రమే తమిళ ప్రదేశమునందలి వైష్ణవాలయములలో నేఁడు కానవచ్చుచున్నవి. మఱి కొన్ని చిత్రములు కాలగర్భమున లీనమై యుండుట కడుంగడు విచారకరమైన విషయము.

ఆళ్వారుల మూలమున సంగీత కళకు సైతము ప్రాప్తించిన ప్రాముఖ్యము నిరూపమానమైనది. వివిధ రాగములతో నొప్పారు ఆళ్వారుల పాశురములను భక్తులు గాన మొనరించి, ఆత్మానందము నందుచుండెడివారు. ఆళ్వారుల భక్తి గీతముల బాణి (Stail) భక్తుల చిత్తములను వశ్యము జేసికొను నంతటి శక్తి సామర్థ్యములను సంపాదించెను. ఆళ్వారులు సహజముగ సంగీత విద్వాంసులు. అందునను . తిరుప్పాణాళ్వారులు సంగీత విద్యలో విశేషమైన కౌశల్యము గలవారు– కావుననే ఆ మహనీయులు – 'గాయక సార్వభౌము' అను బిరుదముతో విఖ్యాతి నందఁగల్గిరి.

ఆళ్వారులకు పూర్వముకూడ తమిళమున గీతముల ప్రక్రియ యొకటి ప్రచలిత మగుచుండెడిది. కాని, అది అంతగా వ్యాప్తి జెంది యుండలేదు. ఆళ్వారులు తమిళ భాషలో గీతముల ప్రక్రియకు ఒక నూతన చైతన్యమును గల్గించి, దానిని అనంతర కాలపు గాయకులకు మార్గ దర్శకము గావించిరి. అనేక నూతన రాగములను వెలికి దీసి, సంగీత విద్వాంసులకు మిక్కిలి సంతుష్టిని గల్గించిరి. ఆళ్వారుల పాశురములలో గేయత్వమే విశేషముగా గన్పట్టుచుండును. తమిళ వాఙ్మయ ప్రపంచమునందలి గేయ పదములలో (పాశురములలో) చాలవరకు ఆళ్వారులవియే అయియున్నవి. తమిళ సాహిత్య చరిత్రలో - ఆళ్వారుల గేయపద్ధతికి విశేషమైన ప్రాముఖ్యమున్నది. భక్తులు గోష్ఠిగాఁ జేరి, ఆళ్వారుల గీతములను గానముజేయ నారంభించిరి. గాయకులైన ఆ భక్తుల గోష్ఠికి వివిధ వాద్యములు కూడ ఉపకరణము లగుటచే, కేవలము అట్టి గాయకులనే గాక, శ్రోతలను సైతము ఆ భక్తి గీతములు తన్మయుల గావించివైచినవి. తత్ఫలముగా - ప్రజలలో గానకళయందును అభిరుచి యేర్పడి, కాల క్రమమున ఆ యభిరుచి వర్ధిల్లసాగెను. అందువలన, సంగీత విద్యలో తమిళ ప్రదేశము విశేషమైన ప్రాముఖ్యమును సంపాదించెను. ఈ కారణములనుబట్టి, ఆళ్వారుల వాఙ్మయ ప్రభావముచే, గానకళకు చేకూరిన ప్రయోజనము అనన్యాదృశమైనదని గ్రహింపనగును.

## తమిళ భాషా సాహిత్యములపై దివ్య ప్రబంధ ప్రభావము

ఆళ్వారుల అవతార విశేషములు, ప్రతిభా వ్యుత్పత్తులు, భక్తి ప్రపత్తులు, దివ్య సందేశములు అన్నియు - తమిళ వాఙ్మయ చరిత్రలో, సువర్ణాక్షరములతో విరాజిల్లుచున్నవి. తమిళ భాషలో

మొట్ట మొదట ఉత్తమ కావ్యములను నిర్మించినవార లగుటవలననే ఆ మహనీయులకు అట్టి ప్రాముఖ్యము లభింపఁగల్గెను. వారి గ్రంథముల నన్నింటిని భక్తి కావ్యములుఁగనే మనము సంభావించుచున్నాము. ఆళ్వారుల భక్తి కావ్యములకంటెను ముందు - తమిళ భాషలో భక్తి ప్రబోధకములైన గ్రంథములు కొన్ని వెలువడియుండకపోలేదు. కాని, ఆ గ్రంథములను పూర్తిగా భక్తి కావ్యములని మాత్రము చెప్ప జాలము. ఆళ్వారులు తమ కావ్యశైలికి గూడ ఒక నూతన శోభను సంతరింపఁజేసిరి. ఆ మహనీయులు — భావ మధురములైన గేయ పదములను (పాశురములను) రచించి, వానిలో ఒక నూతన కావ్య శైలిని వెలయించిరి. వైష్ణవ భక్తి కావ్య ప్రపంచమున - నాలాయిర దివ్య ప్రబంధమునకుఁ గల స్థానము మహోన్నతమైనది. రామ కృష్ణావతారములకు సంబంధించిన వృత్తాంతములు ఆళ్వారుల దివ్య ప్రబంధములందే అధికముగా ప్రథమమున వర్ణింపఁబడినవి. ఆళ్వారుల యుగములో - మహా కావ్య రచనకు ఆవశ్యకమైన సాధన సంపత్తి తమిళ భాషకు లేనందున, రామకృష్ణావతారములకు సంబంధించిన ఇతి వృత్తములను గైకొని, మహాకావ్యములను రచించుటకై వారు పూను కొని యుండలేదు. అయినను, ఆ మహనీయులు రామకృష్ణావతార సంబంధములగు కొన్ని ముఖ్య ఘట్టములను వర్ణించుచు, అనేక పాశు రములను రచించియే యుండిరి. తమిళ భాషలో మహా కావ్య రూప మున రామాయణము రచింపఁబడుటకు తగిన ప్రేరణము ఆళ్వారుల కావ్యరత్నముల మూలముననే జరిగెను. ఈ కారణముచే, తమిళమున రామ కథాగానము చేసిన వారిలోఁ గూడ ఆళ్వారులకే అగ్రస్థానము లభించెను. తమిళమునఁ గల కృష్ణభక్తి సంభరితములైన గ్రంథము లలో - ఆళ్వారుల దివ్య ప్రబంధములే అగ్రగణ్యములైనవి. ఆ దివ్య ప్రబంధములలో కృష్ణ లీలలు అత్యధికముగా వర్ణింపఁబడినవి. అనంతర కాలమున కృష్ణ భక్తి ప్రబోధకములైన కొన్ని చిన్న చిన్న

కావ్యములు తమిళ భాషలో వెలువడి యున్నను, కృష్ణ భక్తిని ప్రబోధించుటలో – ఆళ్వారుల దివ్య ప్రబంధములే విశేషమైన ప్రాముఖ్యమును సంపాదింపఁగలిగినవి. కావున, వైష్ణవభక్తి ప్రబోధక ములైన కావ్యములలో – తమిళమున ఆళ్వారుల దివ్యప్రబంధములే ఆద్య గ్రంథము లనుట నిర్వివాదాంశము.

ఆళ్వారులు సహజముగ మహా భక్తులు. వారు తమ తమ పాశురములను భావావేశముతో గానము చేసిరి. అయినను, వారి కావ్య రత్నములలో సాహిత్య సంపత్తి సమృద్ధిగనే కానవచ్చును. కనుకనే, ఆ దివ్యప్రబంధములు తమిళ వాఙ్మయ ప్రపంచమున అద్వితీయమైన గౌరవమును సంపాదించుకొనగలిగినవి.

భక్తిలో మధుర భావమును మేళవించిన ఆదికవులు ఆళ్వారులే. వారు తమ దివ్య ప్రబంధములలో – అలౌకికమైన ప్రేమతత్త్వమును వ్యక్తీకరించుచు, అట్టి ప్రేమతత్త్వముతోడనే ఆత్మ పరమాత్మలకు మధ్య సంబంధ బాంధవ్యముల నేర్పరచియుండిరి. విరహావేదన ననుభవించు నాయికవలె, వారు భగవంతునియందు ప్రకటించిన భక్తి భావము - అపూర్వమైనది. సజీవము, సహజమును అగు ఇట్టి విరహ వర్ణనము – తమిళ వాఙ్మయమున మఱెచ్చటను కానరాదు. కృష్ణుని బాల లీలలను వర్ణించుటలో - పెరియాళ్వారులు ప్రదర్శించిన నైపుణ్యము అద్భుతమైనది. వా రనుసరించిన 'పిళ్ళై తమిళ్' ప్రక్రియ - లోకోత్తరమైనది. అట్టి ప్రక్రియను సృష్టించిన పెరియాళ్వారులు - తమిళ కవులలో అగ్రగణ్యులుగా కీర్తి గడించిరి. కృష్ణుని బాల లీలలను పెరియాళ్వారులు వర్ణించియున్నంత మనోజ్ఞముగ - తమిళ భాషలో మఱియొక రెవరును వర్ణించియుండలేదు. పెరియాళ్వారుల 'పిళ్ళై తమిళ్' శైలి ననుకరించుచు, తర్వాతి కవు లనేకులు కావ్యములను రచించిరి.

ద్రావిడ దివ్యప్రబంధములను ఛందశ్శాస్త్ర దృష్టితో పరిశీలించిన యెడల, ఆళ్వారులు కొన్ని క్రొత్త వృత్తములను సైతము

సృష్టించినట్లు అవగతము కాగలదు. అట్టి క్రొత్త ఛందస్సులలో - 'అందాది' అను వృత్తము అగ్రగణ్యమైనది. ఆ 'అందాది' వృత్తముతో రచింపఁబడిన ఆళ్వారుల పాశురములను ఆదర్శముగా నిడుకొని, తర్వాతి కవులు ఆ వృత్తమును ప్రయోగింపనారంభించిరి. ఆళ్వారుల కావ్యములలో ప్రయోగింపఁబడిన మఱియొక వృత్త విశేషము - 'తాళిశై' అనునది. ఇది - ఆళ్వారుల యనంతరము విశేషముగ వాడుకలోనికి వచ్చెను.

ఆళ్వారుల కావ్యరత్నములలో — ఆ యా సమయములందు దేశమున ప్రచలితములైన జానపదగీతము లనేకములు విలసిల్లుచున్నవి. పెరియాళ్వారులు, కులశేఖరాళ్వారులు, తిరుమంగైయాళ్వారులు మున్నగువారు — తమ తమ కావ్యములలో జానపద గీతములను సందర్భోచితముగ అచ్చటచ్చట పొందుబఱచి యున్నారు.

ఆళ్వారుల కావ్యములలో - ఆ కాలపు ప్రజా జీవిత మంతయు కన్నులకు గట్టినట్లు విశదముగా వర్ణింపఁబడియుండుట గొప్ప విశేషము. ఆ యుగమున జరుగు ఉత్సవములు, దేవతలకు సంబంధించిన విశేషములు, స్త్రీ పురుషుల శృంగార చేష్టలు, వేష భూషణములు, జన మనోరంజక సాధనములు, ఆచార వ్యవహారములు, దైనందిన కృత్యములు (దిన చర్యలు) మున్నగునవి ఆళ్వారుల కావ్యములలో విశదీకరింపఁబడినవి. ఒక్క మాటలోఁ జెప్పవలెనన్న, ఆళ్వారుల వాఙ్మయములో - ఆ నాఁటి ప్రజా జీవిత మంతయు పూర్తిగా ప్రతిబింబించి యున్నది. కావున, ఆళ్వారులు - నాఁటి ప్రజలకు ఆత్మతుల్యులుగా నుండెడివారని తెలియనగును. ఆళ్వారుల భక్తి కావ్యములు ప్రపంచమునకు అమూల్యములైన నిధులనాఁటి వనుట - అత్యుక్తి కానేరదు.

## ఆళ్వారుల యనుగ్రహ ఫల విశేషముచే తమిళ భాషోజ్జీవము

ఆళ్వారుల దివ్య ప్రబంధములు తమిళ భాషను వికసింపఁజేయుటలో ప్రముఖపాత్ర వహించియున్నవి. ఆళ్వారుల కంటెను పూర్వము

వెలువడిన తమిళ గ్రంథములు సంస్కృత శబ్ద విహీనములగుటచే, ఆ గ్రంథములు ప్రజా హృదయముల నాకర్షింపఁ జాలవయ్యెను. ఆ కాలమున తమిళ కవులు స్వచ్ఛముగా తమిళ భాషయందే గ్రంథములను రచించుచుండెడివారు. వారికి సంస్కృత భాషా ప్రభావము తెలియకుండుటయే ఇందులకు కారణము. కాని, తమిళ ప్రదేశమున ఆర్య సంస్కృతితోఁబాటు - సంస్కృత భాషామయములైన ధార్మిక దార్శనికాది గ్రంథముల ప్రభావము తమిళ పండితులపై కాలక్రమమున ప్రసరింపసాగెను. తత్ఫలముగా తమిళ పండితులు సంస్కృత భాషా ప్రభావమును బాగుగా గుర్తింపగల్గిరి.

ఆళ్వారులు కేవలము తమిళ భాషయందే గాక, సంస్కృత భాషయందును మహా పండితులు. వారికి తమ ప్రాంతీయ భాషయగు తమిళమునందు అభిమాన ముండుట సహజమే యైనను - ఆ మహనీయులు సంస్కృత భాష యందు మాత్రము వైముఖ్యము జూపియుండక పోవుట - సర్వులకును గమనావశ్యకమైన యంశము.[3] వారు తమ దివ్య ప్రబంధములను తమిళ భాషలో రచించుచు - వానిలో సంస్కృత శబ్దములను సైతము ప్రయోగించియుండుటచే, తమిళ ప్రదేశమున అమర భాషను సమాదరించినవారిలో ఆళ్వారులే ఆద్యులుగా విఖ్యాతి నార్జించిరి. కావుననే సంస్కృత భాషా స్పర్శతో తమిళ భాషా యోష - శైలీ సౌభాగ్యముతో, రసాలంకారములతో ప్రకాశింపఁగల్గెను. నేఁడు ప్రచలిత మగుచున్న తమిళ భాషయొక్క రూప లావణ్యములకు ఆళ్వారులే కర్తలను విషయము విస్మరింపరానిది. తమిళ భాషలో సంస్కృత పదములకు సముచిత స్థానము నిడి, ఆ తమిళ భాషను సజీవమైన భాషగా తీర్చి దిద్దినవారిలో - మహాకవులైన ఆళ్వారులే ప్రథములు.

---

3. కులశేఖరాళ్వారులు ప్రత్యేకముగ సంస్కృత భాషలో - "ముకుందమాల" యను నొక స్తోత్ర గ్రంథమును సైతము రచించియుండుట జగత్ప్రసిద్ధమైన విషయము.

ఆళ్వారుల యనంతరము దివ్య ప్రబంధములపై వెలువడిన టీకలలో - టీకాకారులు తాత్త్విక విషయములను విశదీకరించు సందర్భములందు సంస్కృత పదములనే అధికముగా ప్రయోగించి, నూతన శైలిని ప్రకాశింపఁ జేసిరి. అట్టి నూతన శైలియే 'మణి ప్రవాళము' అను పేర వ్యవహరింపఁబడుచున్నది. ఆళ్వారుల దివ్య ప్రబంధములకు సంబంధించిన టీకలు చాలవఱకు మణి ప్రవాళ శైలి యందే ఉన్నవి. మణి ప్రవాళములో - తమిళ పదము సంస్కృత శబ్దమువలెనే ప్రయోగింపఁబడినది. ఈ మణి ప్రవాళ శైలికి సంస్కృత శబ్ద స్పర్శ సంభవించిననాఁటినుండియు - మలయాళ భాష వికసింప సాగెను. మలయాళ భాషలో మణి ప్రవాళమునకు అత్యధికమైన ప్రాముఖ్య ముండుటయే ఇందులకు కారణము.

అతఃపూర్వము తమిళ భాషలో వెలువడిన గ్రంథముల కంటెను ఆళ్వారుల దివ్య ప్రబంధములు సరళమైన భాషతో రాణించు చున్నందున, ఆ దివ్య ప్రబంధములు భాషా విషయకముగా గూడ ప్రాముఖ్యము వహించెను. అయినచో - వ్యావహారిక భాషకు సైతము దివ్య ప్రబంధములలో ప్రాధాన్యము లేకపోలేదు. తత్సమ శబ్ద రూపమున లోకోక్తులు, జాతీయములు దివ్య ప్రబంధములలో ప్రయోగింపఁబడియే ఉన్నవి. ఆళ్వారుల వాఙ్మయమునందు గల భావనా పరంపరలు హృదయంగమములై,రస స్ఫోరకములై యొప్పారు చున్నందున,అవి పాఠకుల నుఱ్ఱూతలూగింపఁగల్గుచున్నవి. అదియునుఁ గాక, వారి దివ్య ప్రబంధములలో మహోన్నతమైన వ్యంగ్య వైచిత్ర్యము కూడ మనోల్లాస కరముగా విలసిల్లుచున్నది. ఆళ్వారుల వాఙ్మయములో - సంగీత సాహిత్యములు రెండును పుష్కల శోభతో ప్రకాశించినవి. తమిళ భాషను సజీవముగా - సుందరముగా - సరళముగా రూపొందించుటలో ఆళ్వారులే అగ్ర గణ్యులని ఇందు మూలమున గ్రహింప నగును.

## తమిళ వాఙ్మయముపై దివ్యప్రబంధ పరిభావము

**దివ్య ప్రబంధ భాష్యములు :-**

నాథముకులు ఆళ్వారుల దివ్య ప్రబంధములను సంపాదించి సంకలనము గావించి, ప్రచారమునకుఁ దెచ్చిననాఁటి నుండియు - ఆ దివ్యప్రబంధముల ప్రభావము లోకమున విశేషముగా వ్యాప్తి నంద సాగెను. కాలక్రమమున ఆ దివ్య ప్రబంధములపై, అనేక భాష్యములు కూడ వెలువడెను. ఆళ్వారుల యనంతరము కొన్ని శతాబ్దములవఱకును - కేవలము ఆ దివ్య ప్రబంధములపై భాష్యములే వెలువడ సాగెను. అట్టికాలము తమిళ వాఙ్మయ చరిత్రలో - 'మహాభాష్య కాలము' అని నిర్దేశింపబడినది. ఈ భాష్యములను గుఱించిన విశేషములు - ముస్ముందు వివరింపఁబడును.

***కంబ రామాయణము*** :-

9 వ - శతాబ్దపు ఉత్తరార్థమున కంబకవి - నమ్మాళ్వారులను గురువుగా భావించి, తమిళమున రామాయణమును రచించెను. తమిళ వాఙ్మయ ప్రపంచమున ఈ కంబరామాయణమునకుగల ప్రాముఖ్యము అసామాన్యమైనది. కంబకవి — వాల్మీకి రామాయణమునుండియే రామకథను ఆధారముగ గైకొనియున్నను,- తన ప్రతిభను, విద్వత్తును ప్రదర్శించుటకై, కావ్యమున కొన్ని కొన్ని తావులలో - క్రొత్త భావములను గూడ ప్రవేశింపఁ జేయనెంచెను. కావున, కావ్యరచనకు ఆవశ్యకమైన సాధన సామగ్రిలో - ఆళ్వారుల దివ్య ప్రబంధములే ఆ కవికి ప్రధానాధారము లయ్యెను. అతఁడు పరబ్రహ్మకు సంబంధించిన యంశములను నమ్మాళ్వారుల 'తిరువాయిమొళి'నుండి గ్రహించి, వానిని తన కావ్యమున వర్ణించియున్నాఁడు. అదియునుఁగాక, కులశేఖరాళ్వారుల దివ్యప్రబంధమగు 'పెరుమాళ్ తిరుమొళి'లోఁగల రామ కథావర్ణనములందలి భావములను కొన్నింటిని గ్రహించి ఆ భావములను

తన రామాయణ మహాకావ్యమున ప్రస్ఫుటింపఁజేసియున్నాఁడు. కంబ రామాయణమునందలి శైలియు - ఆళ్వారుల దివ్యప్రబంధముల శైలినే పోలియుండును. ఇట్లు, ఆళ్వారుల దివ్యప్రబంధములచే ప్రభావితుఁడైన కంబ మహాకవి, రామాయణమును రసవత్తరముగా - భావమధురముగా రచించి, కవిచక్రవర్తిగా విఖ్యాతి గాంచెను.

కంబమహాకవి - తన గురువగు నమ్మాళ్వారులను ప్రస్తుతించుచు నూరు పాశురములతో - 'శఠగోపరన్దాది' అను నొక కావ్యమును రచించియున్నాఁడు. అందు కంబమహాకవి - నమ్మాళ్వారులకు తానెంతయో ఋణపడియున్నట్లు వివరించుచు, 'ప్రపంచమునఁ గల కావ్యము లన్నియుఁ గలిసి, నమ్మాళ్వారుల శ్రీసూక్తియొక్కటితో సరితూఁగజాల' వని, తన గురుదేవులగు నమ్మాళ్వారులను బహు భంగులుగా ప్రశంసించియున్నాఁడు.

**మారనలంకారమ్ :-**

13 - వ శతాబ్దపు పూర్వార్ధములో - 'తిరుక్కురుగై పెరుమాళ్' అను పండితుఁడు - 'మారనలంకారమ్' అనుపేర నొక గ్రంథమును రచించియున్నాఁడు. ఇది - 'మారన్' అను నామాంతరముగ నమ్మాళ్వారులను నాయకునిగా నెన్నుకొని రచింపఁబడిన ఒక అలంకార శాస్త్రము.[4]

**నలవెణ్బా :-**

13 - వ శతాబ్దపు ఉత్తరార్ధమున 'పుకళేన్ది' అను కవి - 'నలవెణ్బా' అను నొక మహాకావ్యమును రచించెను. ఇతఁడీ కావ్యమున - ఆళ్వారుల భావనా పరంపరలను, భాషాశైలిని విశేషముగ

4. "తమిళముమ్ - వైష్ణవముమ్"

— ము. రాధాకృష్ణపిళ్ళై // పుట.

అనుకరించెను. కావ్యప్రారంభమున మంగళాచరణములో - నమ్మాళ్వారులను ప్రస్తుతించి యుండుటనుబట్టియు, 'తిరువాయిమొళి' దివ్యప్రబంధమునకు తా నెంతయో ఋణపడియున్నట్లు తెలిపియుండుటను బట్టియు, ఈ కావ్య రచయితకు ఆళ్వారులయందును, వారి దివ్యప్రబంధము లందునుఁగల గౌరవ భావము స్పష్టము.

**తిరుక్కుఱళ్ వ్యాఖ్యానము :-**

తిరువళ్ళువర్ మహాకవిచే రచింపఁబడిన 'తిరుక్కుఱళ్' అను నీతిశాస్త్రమునకు - 'పరిమేళ అళగర్' అను నొక పండితుఁడు వ్యాఖ్యానము వ్రాసియున్నాఁడు. ఇతఁడు 'తిరుక్కుఱళ్' అను గ్రంథ కుసుమమును తన వ్యాఖ్యానముతో పరిమళింపఁజేయ నుద్దేశించి, ఆళ్వారుల దివ్యప్రబంధములలోఁగల యంశము లనేకములను అందు ప్రస్ఫుటింపఁజేసియున్నాఁడు. ఇట్లు తన వ్యాఖ్యానముతో తిరుక్కుఱళ్ కావ్యకుసుమమును పరిమళింపఁజేసిన కారణమునలననే, అతఁడు 'పరిమేళ అళగర్' అను పేర వ్యవహరింపఁబడుచున్నట్లు విద్వాంసుల అభిప్రాయము.

**మహాభారతము :-**

14 - వ శతాబ్దపు పూర్వార్థములో - 'విల్లిపుత్తూరార్' అను కవి తమిళభాషలో మహాభారతమును రచించెను. ఇది మిక్కిలి రసవత్తరమైన గ్రంథము. ఈ గ్రంథమున రచయిత - నమ్మాళ్వారులను, తిరుమంగై యాళ్వారులను విశేషముగా ప్రస్తుతించి యుండుటేగాక, దివ్యప్రబంధములలోఁగల భావముల ననుకరించుచు, తన గ్రంథమున ఆళ్వారుల హృదయమును చాల వఱకు ప్రతిబింబింపఁజేసియున్నాఁడు.

**తిరుప్పుగళ్ :-**

14 - వ శతాబ్దపు ఉత్తరార్థములో - 'అళగియ నాథర్' అను నొక కవి - 'తిరుప్పుగళ్' అను తన కావ్యములో - రామకృష్ణావతారములకు సంబంధించిన వివిధ ఘట్టములను రమణీయముగ వర్ణించుచు,

ఆళ్వారుల దివ్యప్రబంధములందలి భావములను కొన్నింటిని సందర్భోచితముగా అట నట పొందు పఱచెను. ఈ కవి - తన కావ్యమున మురళీకృష్ణుని వర్ణించు సందర్భమున, పెరియాళ్వారుల భావములనే అనుకరించెను. ఇందువలన, ఈ కవియొక్క దృక్పథము స్పష్టము.

ఈ కారణములనుబట్టి - ధార్మిక, తాత్త్విక, సాహిత్య కళాదులపై ఆళ్వారుల దివ్య ప్రబంధము లెంతటి ప్రభావమును ప్రదర్శించి యుండెనో సులభముగా గ్రహింపవచ్చును. కేవల తమిళ వాఙ్మయము నందే గాక, తదితరములైన భారతీయ భాష లన్నింటియందును, ఆళ్వారుల దివ్యప్రబంధ ప్రభావము బహుముఖములుగా విస్తరించి యున్నది. కావున, సమస్త భారతీయ వాఙ్మయ భాండారమునకును ఆళ్వారుల దివ్య ప్రబంధములు అనర్ఘ రత్నములని గ్రహింప నగును.

## అనంతర భక్తి సంప్రదాయములపై దివ్య ప్రబంధ పరిభావము

భారతదేశమునకు సంబంధించిన మధ్య కాలీన చరిత్ర - తమిళ ప్రదేశమునందే ఉద్భవించినది. కాని, దానిని దేశ వ్యాప్తము గావించి, తన్కాలమున ప్రజానీకమునకు ప్రయోజనమును గల్గించుటకై, ఆళ్వారుల యనంతరము ఆచార్యు లవతరింపవలసివచ్చెను. దక్షిణభారతమునకు జెందిన ఈ యాచార్యులు - మాయా వాదమును ఖండించుచు, జ్ఞానమార్గముకంటెను సరళమైన భక్తి మార్గమును నిర్మించి, ఆ మార్గమున ప్రజలను పయనింపఁజేయుటకును, తమ తమ సిద్ధాంతములను లోకమున పరివ్యాప్తము గావించుటకును సమున్నమించిరి. ఆ నాఁటి ప్రజలను అతఃపూర్వులైన ఆళ్వారుల దివ్యప్రబంధములే భక్తి సిద్ధాంతమును గ్రహించుటకు ప్రేరేపించెను. విష్ణుభక్తికి సంబంధించిన ప్రాణశక్తి నుద్దీపింపఁజేయుటలో - ఆళ్వారులు, ఆచార్యులు మాత్రమే ముఖ్యులు.

ఆళ్వారుల భావపరంపరా ప్రభావము - అనంతర కాలమున వెలువడిన సంప్రదాయములపై బాగుగా వ్యాపించినది. అన్నిటి కంటెను అధిక ప్రభావము - భగవద్రామానుజులవిశిష్టాద్వైతమతముపై ప్రసరించియున్నది. ఈ ప్రభావము - నాథమునుల సమయమునసే సూత్రప్రాయముగాఁ గన్పట్టెను. నాలాయిర దివ్య ప్రబంధమునందలి పాశురములను ప్రచారమునకుఁ దెచ్చిన నాథమునులు - శాస్త్రీయము లైన ఆళ్వారుల సిద్ధాంతములను విశేషముగా ప్రశంసించియుండిరి. ఆ సిద్ధాంతములకు దార్శనికమైన రూపము నిడి, వానిని ధరాతలముపై ప్రవర్తింపఁజేయుటలో శ్రీమద్రామానుజు లొనరించిన ప్రయత్నము నిరుపమానమైనది. ఆళ్వారుల దివ్య ప్రబంధముల ప్రభావమును శ్రీమద్రామానుజులు స్వయముగా గుర్తించి, ఆ ప్రభావమును తమ శిష్యుల మూలమున లోకమునందు ప్రచారము గావింపఁజేసిరి. తాము ప్రతిపాదింపఁ దలఁచిన విశిష్టాద్వైత సిద్ధాంతమునకు ఆళ్వారుల దివ్య ప్రబంధములు విశేషముగా నుపకరించినందున, శ్రీమద్రామానుజులు మిక్కిలి సంతృప్తి జెందిరి. వేద తాత్పర్య మెచ్చటేని దుర్బోధముగ నున్నచో, అపుడు ఆళ్వారుల దివ్యప్రబంధముల మూలముననే వారు తాత్పర్యమును గ్రహించుచుండెడివారఁట ! ఆండాళ్ రచించిన 'తిరుప్పావు' దివ్య ప్రబంధముపై వారికి అపరిమితమైన గౌరవ భావ ముండెడిది. అందువలననే, తమిళ ప్రదేశమున శ్రీమద్రామానుజులు - 'తిరుప్పావై జీయర్' (తిరుప్పావును ప్రేమించువారు) అని ప్రస్తుతింపఁబడిరి. ఈ కారణములచే, శ్రీ మద్రామానుజులు భక్తి సిద్ధాంతమును ప్రవర్తింపఁజేయుటలో - ఆళ్వారుల దివ్య ప్రబంధములనే ప్రధానాధారములుగా స్వీకరించియుండిరని విశద మగుచున్నది.

"ఈశ్వరుఁడు సమస్త జగత్తునకు నిమిత్తకారణమైనను - ఉపాదాన కారణము కూడ అయియున్నాఁడు. భగవంతుని లీలచే జగత్సృష్టి జరుగుచున్నది. జీవులు, జగత్తు నిత్యములు; స్వతంత్రములు. అయినను ఈశ్వరుడు జీవ జగత్తుల రెంటి యందును వ్యాపించి యున్నందున,

అవి యాతని యధీనములై యున్నవి. ఇందువలన, జీవులు - జగత్తు పరబ్రహ్మయొక్క శరీరముగా భావింపఁబడుచున్నవి. జీవ బ్రహ్మల మధ్య, శేష శేషీ - అంగ అంగీ సంబంధము లున్నవి. భగవంతుఁడు భక్తుల ననుగ్రహించు నిమిత్తమై, పర వ్యూహ విభవ అంతర్యామి అర్చా రూపములతో అయిదు విధములుగా నున్నాడు."

ఇత్యాదులే ఆళ్వారుల సిద్ధాంతములు. ఈ సిద్ధాంతము లన్నియు విశిష్టాద్వైత దర్శనమునఁ స్వీకరింపఁబడినవి. ఈ సిద్ధాంతములను ఆధారముగా నిడుకొనియే శ్రీమద్రామానుజులు మాయావాదమును ఖండించి వైచిరి. కాలక్రమమున కర్ణాటక దేశమం దంతటను శ్రీ రామానుజ సంప్రదాయము పరివ్యాప్తమై, అఖండమైన విఖ్యాతిని సముపార్జించెను.

## దివ్య ప్రబంధములపై వెలువడిన భాష్యములు

నాథమునులు మొదలుకొని, ఉడయవరుల[5] వఱకును నడుమ - దాదాపు మూఁడు దశాబ్దములు గడచినట్లు చరిత్రాధారములనుబట్టి స్పష్టమగుచున్నది. ఆ మధ్య కాలమున - శ్రీ వైష్ణవ మత ప్రవర్తకులుగా విఖ్యాతి నార్జించిన వా రెందరో కలరు. అట్టివా రందఱును ఆళ్వారుల దివ్య ప్రబంధములను అత్యంత శ్రద్ధాసక్తులతో అధ్యయనము గావించినవారలే. వారిలో ననేకులు - దివ్య ప్రబంధములచే ప్రభావితులైన కారణమువలన, ఆళ్వారులయందు మిగుల భక్తి తాత్పర్యములు గలవారలై, ఆ దివ్య ప్రబంధములకు టీకలు వ్రాయ నారంభించిరి. అట్టి తరుణమున, ఆళ్వారుల వాఙ్మయ మహోదధినుండి అనర్ఘ రత్నము లెన్నియో బయల్వెడలి, ప్రజలను విస్మయ చకితుల గావించి వైచెను. తత్ఫలముగా - శ్రీ రామానుజ యుగమునుండి, ఆళ్వారుల దివ్య ప్రబంధములపై అనేక భాష్యములు వెలువడ సాగెను. అట్టి భాష్యములలో - ఆళ్వారుల పాశురములందలి విశేషార్థ

5. 'ఉదయవరులు' అనగా - భగవద్రామానుజులు.

ములు విపులీకరింపఁబడుటయే గాక, ఆ యర్థములు పైఁ తేను మనోజ్ఞముగా నున్నందున, ఆ భాష్యము లన్నియు ప్రజల నాకర్షింపఁగల్గుటచే, తద్వ్యాఖ్యాకర్తల ప్రయత్నము సార్థక మయ్యెను.

అట్టి భాష్యములలో - నమ్మాళ్వారుల 'తిరువాయిమొళి' పై వెలువడిన భాష్యమే మొట్ట మొదటిది. పన్నిద్దఱాళ్వారులలో - నమ్మాళ్వారులకు గల ప్రాముఖ్యమును బట్టియే ఆరంభమున 'తిరువాయిమొళి'పై భాష్యము వెలువడుటకు కారణమై యుండునని మనము భావింపవచ్చును. దీనిని శ్రీమద్రామానుజుల ఆజ్ఞానుసారము వారి శిష్యులగు 'తిరుక్కురుగై పిరాన్ పిళ్ళాన్' అనువారు ఒక భాష్యము రచించిరి. ఈ భాష్యమునకు - 'ఆరాయిరప్పడి'[6] (6,000 పరిచ్ఛేదములు గల భాష్యము) అని పేరు.

అనంతరము శ్రీ పెరియభట్టరువారి శిష్యులగు 'నంజీయర్' అనువారు - ఒక భాష్యమును రచించిరి. ఇది - 'ఒన్బదారాయిరప్పడి' (9000 పరిచ్ఛేదములు గల భాష్యము) అని వ్యవహరింపఁబడుచున్నది.

అటుపిమ్మట - నంజీయరువారి అంతేవాసులును, ఆంధ్రప్రదేశ వాసులును అగు 'నంబిళ్ళై' అనువారి శిష్యులలో నొకరగు 'అళగియ మణవాళ జీయర్' అనువారు - తిరువాయిమొళికి ప్రతిపదార్థముగా 'పన్నీరాయిరప్పడి' (12,000 పరిచ్ఛేదములు గల భాష్యము) అను పేర నొక వ్యాఖ్యాన గ్రంథమును రచించి యున్నారు.

తదుపరి - 'నమ్బిళ్ళై'గారి పర్యవేక్షణమున, వారి శిష్యులగు 'వడక్కు తిరువీథి ప్పిళ్ళై' అనువారు ఒక గొప్ప భాష్యమును రచించిరి. ఇది - 'ముప్పత్తాఱాయిరప్పడి' (36,000 పరిచ్ఛేదములు గల భాష్యము) అను పేర విఖ్యాతి గాంచియున్నది. ఈ భాష్యమునకు -

6. 'పడి' యను శబ్దమునకు - 'ఒక పరిమాణ'మని యర్థము. ఇచట 'పడి' యనగా ముప్పదిరెం డక్షరముల సముదాయము. ఇట్టి సముదాయమును సంస్కృతమున 'గ్రంథ'మని వ్యవహరించుట పరిపాటి.

'ఈడు'అను బిరుదము సార్థకమై యమరినది. 'ఈడు' అను శబ్దమునకు - 'లిఖిత రూపమున ప్రస్తుతించుట' అని యర్థము. దివ్య ప్రబంధములపై వెలువడిన భాష్యము లన్నింటిలో - ఈ 'ఈడు ముప్పత్తారాయిర ప్పడి'యే అగ్రగణ్యమైనది. కనుకనే ఆళ్వారుల భావనా పరంపరలను - సిద్ధాంతములను వ్యాఖ్యానించు సందర్భమున, ఈ భాష్యము విశేషముగా నుపకరింపఁగల్గెను. ఇది - 'భగవ ద్విషయము' అను పేర విఖ్యాతి గాంచియున్నది.

'నమ్బిళ్ళై' శిష్యులగు 'పెరియవాచ్చాన్ పిళ్ళై' అను వారు - దివ్య ప్రబంధములలోఁ గల నాల్గు వేల పాశురములకును ఒక గొప్ప భాష్యమును రచించిరి. ఇందు - 'తిరువాయిమొళి'కి సంబంధించిన భాష్య భాగము - ఇరువత్తు నాలాయిరప్పడి (24,000 పరిచ్ఛేదములు గల భాష్యము) అను పేర వ్యవహరింపఁబడుచున్నది.

ఈ రీతిగా - 'తిరువాయిమొళి' పై ప్రత్యేకముగా అయిదు భాష్యములు వెలువడియుండుటనుబట్టి, నాలాయిర దివ్య ప్రబంధములో - తిరువాయిమొళికిఁగల ప్రాముఖ్యమును మనము సులభముగా గ్రహింపఁవచ్చును.

ఇవి యిట్లుండ, శ్రీ వేదాంత దేశికులు - 'నిగమ పరిమళమ్' అను పేర 76,000 పరిచ్ఛేదములుగల ఒక గొప్ప భాష్యమును ద్రావిడ దివ్యప్రబంధములపై వ్రాసియుండిరి. వీరి యనంతరము మఱి యొకరు- 'పదినెట్టాయిరప్పడి'(18,000 పరిచ్ఛేదములుగలభాష్యము) అనుపేర, తిరువాయిమొళి పై భాష్యము నొకదానిని రచించియున్నట్లు తెలియవచ్చుచున్నది. కాని, ఇది నేఁటివఱకును లభించి యుండలేదు.

ఆళ్వారుల రచనలపై వెలువడిన భాష్యములలో - నమ్మాళ్వారుల తిరువాయిమొళికి సంబంధించిన భాష్యములే అధిక సంఖ్యలో నున్నవను విషయము మనకు స్మృతి పథములో నుండఁదగి యున్నది. భాష్యకర్తలు తిరువాయిమొళియందలి వేయి పాశురములను ఒక

భాగముగను, మిగిలిన మూడు వేల పాశురములను మఱియొక భాగముగను గ్రహించియున్నాడు. తిరువాయిమొళికి మాత్రమేగాక, మిగిలిన దివ్యప్రబంధము లన్నిటికిని ప్రత్యేకముగ టీకలు వెలువడియున్నవి.

'పెరియవాచ్చాన్ పిళ్ళ' అను మహనీయులు – కేవలము ఒక్క తిరువాయిమొళిపై మాత్రమె గాక, శేషించిన దివ్య ప్రబంధము లన్నింటిపైనను భాష్యములు వ్రాసిరి. కాని, కాలక్రమమున వారి భాష్యములలో కొన్ని వాక్యములు శిథిలము లాయెను. అందునను – 'పెరియ తిరుమొళి' దివ్యప్రబంధముపై వ్రాయబడిన భాష్యములో అధిక భాగము శిథిలమైన కారణముచే, శ్రీ మణవాళ మహామునులు ('పెరియ జీయర్') అను మహనీయులు మఱల పెరియతిరుమొళిపై భాష్యమును పూర్తిగా రచించిరి. మణవాళ మహామునుల ఆచార్యులగు 'తిరువాయిమొళి పిళ్ళై' (శ్రీశైలేశులు) కూడ, పెరియాళ్వారుల తిరుమొళిపై, తాత్త్విక దృక్పథముతో గూడిన ఒక గొప్ప భాష్యమును రచించిరి. ఇది – 'స్వాపదేశార్థము' అను పేర నొప్పారుచున్నది.

ఆండాళ్ రచించిన 'తిరుప్పావు'పై వ్యాఖ్యానము లనేకములు వెలువడియున్నవి. అట్టి వ్యాఖ్యానములలో – ఈరాయిరప్పడి (2,000 పరిచ్ఛేదములు గలది – పెరియవాచ్చాన్ పిళ్ళై కృతము), నాలాయిరప్పడి (4,000 పరిచ్ఛేదములు గలది – అళగియ మణవాళ పెరుమాన్ నాయనార్ కృతము) మున్నగునవి సుప్రసిద్ధములై యున్నవి.

తొండరడిప్పొడియాళ్వారుల 'తిరుప్పళ్ళియెళుచ్చి'పై కూడ నంజీయర్, పెరియవాచ్చాన్ పిళ్ళై అనువారలు ఇరువురును వేర్వేరుగా వాఖ్యానములను రచించియున్నారు.

తిరుప్పాణాళ్వారుల 'అమలనాది పిరాన్'పై పెరియవాచ్చాన్ పిళ్ళై, అళగియ మణవాళ పెరుమాళ్ నాయనార్ అనువారలచే

ప్రత్యేకముగా రెండు వ్యాఖ్యానములు రచింపఁబడినవి. శ్రీ వేదాంత దేశికులును - 'మునివాహన భోగమ్' అను పేర, సంస్కృత భాషలో నొక వ్యాఖ్యానమును రచించియున్నారు.

మధురకవి యాళ్వారుల 'కణ్ణినుణ్ శిఱుత్తాంబు'పై నంజీయర్, నంబిళ్ళై, పెరియవాచ్చాన్ పిళ్ళై మొదలగువారు వ్యాఖ్యానములు రచించిరి.

తిరుమంగై యాళ్వారుల 'పెరియ తిరుమొళి' పై లభించు వ్యాఖ్యానములలో నొకటి పెరియవాచ్చాన్పిళ్ళై రచించినదియు, మఱి యొకటి - నంజీయరు రచించినదియు. తిరుమంగై యాళ్వారుల రెండవ రచన యగు 'తిరునెడు న్దాణ్డకమ్' పై, పెరియవాచ్చాన్ పిళ్ళై రచించిన వ్యాఖ్యాన మొకటి సుప్రసిద్ధమై యున్నది. ఇది యునుఁగాక - 'తిరునెడు న్దాణ్డకమ్' పై శ్రీరంగమునకుఁ జెందిన 'తంపిరాన్' అను వా రొక వ్యాఖ్యానమును వ్రాసి యున్నట్లు ప్రతీతి యున్నది. కాని, ఈ వ్యాఖ్యాన మిపుడు లభించుట లేదు.

నమ్మాళ్వారుల 'తిరువిరుత్తమ్' పై - నంబిళ్ళై, పెరియవాచ్చాన్ పిళ్ళై, అళగియ మణవాళ జీయర్ మొదలగువారిచే వ్యాఖ్యానములు రచింపఁబడినవి.

తిరుమంగై యాళ్వారుల 'పెరియ తిరుమడల్' పై - పెరియవాచ్చాన్ పిళ్ళై, అళగియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ అను వారలు వ్యాఖ్యానములు రచించిరి. ఇందలి రెండవవారి వ్యాఖ్యానము - 'నాయనార్ వ్యాఖ్యానమ్' అను పేర వ్యవహరింపఁబడుచున్నది.

## భాష్యములలో భాషా విశేషములు

'తిరుక్కురుగై పిరాన్ పిళ్ళాన్' మొదలుకొని, మణవాళమహాముకుల వఱకును మధ్యగాఁ గల కాలము - అనగా, దాదాపు 12 - వ శతాబ్దమునుండి 15-వ శతాబ్దమువఱకు గల భాష్యకర్తలందఱును తమ

తమ భాష్యములలో - ఒకానొక విశిష్టమైన భాషను ఉపయోగించి యున్నారు. ఈ భాష్యకర్తలలో - 'నంజీయర్' అనువారు మైసూరు నివాసులు. 'పెరియవాచ్చాన్ పిళ్ళై' అనువారు - మద్రాసు ప్రాంతమునఁ గల కుంభకోణ క్షేత్రమునకుఁ జెందినవారు. ఇట్లే - మిగిలిన భాష్యకర్తలుకూడ దక్షిణ భారతమున వివిధ ప్రాంతములకుఁ జెందిన వారే. అయినను – ఈ భాష్యకర్త లందఱి భాషా శైలిలో, ఒకే విధమైన ప్రక్రియ మనకు స్పష్టముగాఁ గన్పట్టుచుండును. వీరు ప్రయోగించిన భాష 'మణి ప్రవాళ' మను పేర విఖ్యాతి గాంచియున్నది.[7] వీరు తమ తమ భాష్యములలో - తమ యుగమునందు ప్రజానీకమున ప్రచలిత మగుచున్న సమస్త శబ్దములను, ప్రయోగములను సందర్భోచితముగ ఆ యా తావులలో పొందుపఱచియున్నారు. భాష్యములలో వీరు చేసిన వచన రచన యందు - తమిళ శబ్దముల మధ్య మధ్య, తాత్త్విక విషయములను ప్రస్ఫుటింపఁజేయు సంస్కృత

7. సంస్కృత శబ్దములతో మిశ్రితమైన తమిళ భాషయొక్క శైలియే 'మణిప్రవాళము' అని వ్యవహరింపబడుచున్నది. ఆ శైలి - రెండు విధములైన భాషలలోఁగల శబ్దరూపము లగు ముత్యములతోడను, రత్నములతోడను గ్రుచ్చబడిన ఒక మాలవలె నుండునని భాషావేత్తల యభిప్రాయము. కావున, అట్టి మణి ప్రవాళశైలికి ఒక చిన్న ఉదాహరణ మిట చూపఁబడుచున్నది :-

"....చేతనన్ నిత్యనాయ్, అణువాయో ఙ్ఞానానంద లక్షణనాయ్, ఙ్ఞాన గుణకనాయ్, ఏకరూపనాయ్, భగవచ్ఛేష భూతనాయిరుక్కుమ్ ఇప్పడి యిరిక్కుఱ ఆత్మావినుడైయ వైలక్షణ్యత్తై యనుసన్ధిత్తు. "జరామరణ మోక్షాయ, ఎన్గిఱపడియే ఆత్మానుభవ మమైయుమెన్నిరుక్కు మవనుక్కుమ్ సర్వేశ్వరనై యుపాసిక్కైయు మన్నిమస్మృతియుమ్ వేణుమ్. ఆత్మానుభవత్తై నెకిళ్ న్దు సర్వేశ్వరనుడైయ గుణానుభవ మ్పణ్ణ వేణు మెన్నిరుక్కు మవనుక్కుమ్ ఆవన్నైయే ఉపాయమాకప్పత్త వేణుమ్ ఇవత్తిల్ నైయటియిలున్ "ఒణ్ణామలైయాళ్ కేళ్వనారువనై యేనోక్కు మునర్వు" ఎన్గిఱపడియే సర్వేశ్వరనళలిలే పర్యవసిత్తిన్నిల్లాతు, ఙ్ఞానమాకిల్ క్రియాపతియై వృత్తి యల్లతు నిల్లాతు."

— "ఈడు ముప్పత్తారాయిరప్పడి" - అను నంబిళ్ళై వ్యాఖ్యానమునుండి.

శబ్దములను, సంస్కృత శబ్దములతోఁగూడిన ప్రయోగములను కొన్ని చేర్చియున్నారు. ఈ టీకాకారుల యుగము, తమిళ వాఙ్మయ చరిత్రలో 'భాష్య గ్రంథ కాలము' అను పేర పరిగణింపఁబడుచున్నది. ఈ టీకాకారులు తమ తమ భాష్యములలో - మణి ప్రవాళ శైలిని అనుసరించియుండుటచే, తన్మూలమున తమిళ శబ్ద భాండారము విస్తృతి జెందెను. ఈ టీకా గ్రంథములలో ప్రయోగింపఁబడిన సంస్కృత శబ్దములు - మధుర మంజులములగా నుండుటచే, పాఠకులకు ఒకానొక విధమైన ఆనందమును ప్రసాదింపఁగల్గుచున్నవి.

పూర్వకాలమున, ఆచార్య సమాశ్రయణము వలననే ఈ భాష్యములలోని విశేషార్థములు బోధపడుచుండెడివి. కాని, మణవాళ మహాముని కాలమున - ఈ భాష్యములలోని యంశములను సుబోధకము గావించుచు, కొన్ని వ్యాఖ్యానములు వెలువడెను. ఇట్టి వ్యాఖ్యానములలో - 'అరుంపద విళక్కమ్' (కఠిన శబ్దార్థ దీపిక) అనునది ముఖ్యమైనది. అదియునుఁగాక, తిరువాయిమొపై వెలువడిన 'ఈడు' అను సుప్రసిద్ధ మగు భాష్యములో ప్రయోగింపఁబడిన శబ్దములకు అర్థములనువిపులీకరించు గ్రంథముగా 'జీయర్ అరుంపదమ్' అను పేరనొకటి వెలువడెను. ఈ రీతిగా శబ్దార్థములను విపులీకరించు వ్యాఖ్యానములు కాలక్రమమున వెలువడసాగెను.

ఆళ్వారుల దివ్య ప్రబంధములపై మణి ప్రవాళ శైలిలో తమిళమున వెలువడిన భాష్యములు నేఁటివఱకు లభించుచునే యున్నట్లును. ఏ యితర సంప్రదాయములందును తమిళమున ఇట్టి భాష్యములు వెలువడియుండ లేదనియు మనము ముఖ్యముగా గుర్తులో నుంచుకొనవలసిన యంశము.

ఇట్టి భాష్యములు - వ్యాఖ్యానములు మాత్రమే గాక, దివ్య ప్రబంధములలో సుప్రసిద్ధములుగాఁ గల పాశురములను కొన్నింటిని ఎన్నుకొని, దానిలోని విశేషములను విశదీకరించుచు, కొందఱు

స్వతంత్ర గ్రంథములనుగూడ రచించియున్నారు. ఇట్టి గ్రంథకర్తలలో నంజీయరు, పిళ్ళలోకాచార్యులు, వేదాంత దేశికులు మున్నగువారు ముఖ్యులు. వీరిచే రచింపబడిన గ్రంథములు - 'రహస్య గ్రంథములు' అను పేర సుప్రసిద్ధములై యున్నవి. ఈ ప్రక్రియలో 'నంజీయర్' అనువారు, 'ఆత్మ వివాహమ్' 'ముముక్షు దర్పణమ్' అను పేరులుగల రెండు గ్రంథములను రచించియున్నారు. ఇట్టి గ్రంథములే మఱి రెండు 'మాణిక్క మాలై' 'నిగమనప్పడి' అను పేరులు గలవి లభించుచున్నవి. పిళ్ళలోకాచార్యులు, వేదాంతదేశికులు అనువారిరువురును మిగిలిన వారికంటె అధికముగా నిట్టి రహస్య గ్రంథములను రచించియున్నారు. పిళ్ళలోకాచార్యులవారి రహస్య గ్రంథములలో 'అష్టాదశ రహస్యములు' అను గ్రంథము సుప్రసిద్ధమైనది. వేదాంతదేశికులచే రచింపబడిన పదునెనిమిది రహస్య గ్రంథములలో - 'రహస్య త్రయసారము' అనునది మిక్కిలి ప్రాముఖ్యము వహించియున్నది.

వేదములపైనను, ఉపనిషత్తులపైనను, బ్రహ్మసూత్రములపైనను సంస్కృత భాషలో అనేక భాష్యములు వెలువడియున్నవను విషయము జగద్విదితము. అట్టి భాష్యములకు లోకమున నెంతటి ప్రాముఖ్యము కలదో - అంతటి ప్రాముఖ్యమే ఆళ్వారుల దివ్య ప్రబంధములపై వెలువడిన భాష్యములకును కలదనియు, శ్రీరామానుజ సంప్రదాయులు ఈ రెండు భాషలలోఁగల భాష్యములను సమానమైన దృష్టితో ప్రమాణ గ్రంథములుగా భావించి, అధ్యయనము చేయుచుందురనియు, ఈ కారణమువలననే శ్రీరామానుజ సంప్రదాయులు 'ఉభయవేదాంత ప్రవర్తకులు' అను పేర వ్యవహరింపఁబడుచుండిరనియు సర్వులును గ్రహింపవలసిన యంశము.

## ఉ ప సం హా ర ము

ఆళ్వారులు కారణ జన్ములు. భక్తి సిద్ధాంతమును ప్రతిష్ఠించుటకును - తమిళ భాషను సజీవమైన భాషగా తీర్చిదిద్దుటకును భగవ

ప్రేరణచే దక్షిణ భారతములో నుద్భవించిన మహానుభావులు. వా రందఱును దైవాంశ సంభూతులే. ఒక్కొక్కరిలో ఒక్కొక్క అంశ ఉన్నది.

| ఆళ్వారులు :- | | అంశలు :- |
|---|---|---|
| పొయిగయాళ్వారులు | .......... | పాంచజన్యాంశ |
| పూదత్తాళ్వారులు | .......... | గదాంశ |
| పేయాళ్వారులు | .......... | నందకాంశ |
| తిరుమళిశై యాళ్వారులు | .......... | సుదర్శనాంశ |
| నమ్మాళ్వారులు | .......... | విష్వక్సేనాంశ |
| మధురకవి యాళ్వారులు | .......... | కుముదాంశ |
| కులశేఖరాళ్వారులు | .......... | కౌస్తుభాంశ |
| పెరియాళ్వారులు | .......... | గరుడాంశ |
| ఆండాళ్ | .......... | భూదేవ్యంశ |
| తొండరడిప్పొడియాళ్వారులు | .......... | వనమాలాంశ |
| తిరుప్పాణాళ్వారులు | .......... | శ్రీవత్సాంశ |
| తిరుమంగై యాళ్వారులు | .......... | కార్ముకాంశ |

ఈ రీతిగా భగవదంశలతో నవతరించిన పన్నిద్దరాళ్వారులు - మహాభక్తులై, భగవద్భక్తిలో తన్మయులై, బాహ్యాభ్యంతరములను మఱచి, అంతటను పరమ తత్త్వమునే ఆలోకించుచు, అప్రాకృతమైన ఆనందము ననుభవించిరి.

పవిత్రాంతఃకరణులై, పండిత ప్రకాండులై, తాత్త్విక రహస్య గ్రహణపారీణులై విరాజిల్లిన ఆ మహనీయుల భావనాపరంపరలు ముముక్షువులకు మార్గదర్శకములైనవి. వారి హృదయ తంత్రులనుండి స్పందించిన భక్తిగీతములు భావమధురము లగుటచే, పఠితలను, శ్రోతలను తన్మయుల గావించివైచినవి. వారి దివ్య ప్రబంధములు అనంతర భక్తి సంప్రదాయములకు ఆత్మతుల్యములై విలసిల్లినవి.

సంస్కృత భాషాస్పర్శచే సౌరభమును సంతరించుకొనిన ఆ మహనీయుల దివ్యప్రబంధ కుసుమములు - ఆర్యావర్తమం దంతటను అమర కావ్యములుగా కీర్తి నార్జించుకొని రాణించుచున్నవి.

నాల్గు వేదములలోఁగల రహస్యములను తేటతెల్లము గావించిన ఆళ్వారుల నాలాయిర దివ్యప్రబంధము ద్రావిడ వేదముగా పరిగణింపఁ బడి, లోకమున ప్రకాశించుచున్నది.

వివిధ వర్ణములలో నుద్భవించిన పన్నిద్దరాళ్వారులు భక్తి రాజ్యమునను, ప్రపత్తి పాలనమునను సమానాధికారులు కా గల్గిరి. ఆ మహనీయులు వేంచేసియున్న దేవాలయములే దివ్య దేశములుగా సంభావింపఁబడినవి. అట్టి దివ్యదేశములందే తీర్థ ప్రసాద స్వీకారము విశేష ఫలప్రదముగా విశ్వసింపఁబడినది.

శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత స్థాపనాచార్యులుగా ప్రసిద్ధి గాంచిన నాథ, యామున, రామానుజాది ఆచార్యవర్యు లందఱును ఆళ్వారుల దివ్యప్రబంధములను సమాదరించుటయేగాక, ఆ మహనీయుల అడుగు జాడలందే పయనించుచు, వారి దివ్యప్రబంధములను లోకమున స్పష్టముగా వెల్లడించి, ప్రజలను భక్తిపయస్వినీ తరంగములలో నోల లాడించిరి.



# భగవద్విషయము - తద్విశేషములు

'ఉభయ వేదాంత శిరోమణి'

శ్రీమాన్ కిడాంబి శఠకోప రామానుజాచార్యులు, ఎం. ఏ.



"భక్తామృతం విశ్వజనానుమోదనం సర్వార్థదం శ్రీశఠకోపవాఙ్మయమ్
సహస్రశాఖోపనిష త్సమాగమం నమా మ్యహం ద్రావిడ వేదసాగరమ్.''

## పరిచయము

ప్రపన్న జనకూటస్థులైన శ్రీ నమ్మాళ్వారులు అనుగ్రహించిన 'తిరువాయిమొళి' యను దివ్యప్రబంధమునకు గల అనేక వ్యాఖ్యానములలో - 'ఈడు ముప్పత్తాఱాయిరప్పడి' యను వ్యాఖ్యానము ప్రచుర ప్రచారము కలిగి యున్నది. దీనికి 'భగవద్విషయము' అని ప్రసిద్ధి. 'వడక్కు తిరువీధిపిళ్ళై' అను మహనీయులు ఈ వ్యాఖ్యానమును సంకలన మొనర్చి, శ్రీ వైష్ణవ సంప్రదాయమునకు మహోపకారము గావించిరి.

## ఉభయ వేదాంతములు

శ్రీ వైష్ణవ సంప్రదాయమున ఉభయ వేదాంతములు ప్రసిద్ధములు. ఉభయ వేదాంతము లనగా - సంస్కృత వేదాంతము, ద్రవిడ వేదాంతము అని యర్థము. శ్రుతి స్మృతీతిహాస పురాణ బ్రహ్మ సూత్రాదులచే ప్రతిపాదితమైన వేదాంతము సంస్కృత వేదాంతము. ద్రావిడ భాషలో నిబద్ధములై, ఆళ్వారుల దివ్యప్రబంధములచే ప్రతిపాదితమైన వేదాంతము ద్రావిడ వేదాంతము. ఈ ఉభయ వేదాంత పావన తరంగిణీ సమాగమమే శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రయాగ. సంస్కృత వేదాంతము అధికృతాధికారమును ప్రతిపాదించగా, ద్రావిడ వేదాంతము సర్వాధికారము, విశేషించి - అకించనాధికారము నగు ప్రపత్తి మార్గమును ప్రతిపాదించుచున్నది.

కావుననే శ్రీ వేదాంత దేశికులు ద్రావిడ వేదాంతమును 'సర్వీయ శాఖ'గా ప్రస్తుతించిరి. వీనిలో - ఒకటి సిద్ధాంతము, రెండవది అనుభవాత్మకము. ఒకటి మార్గము. మఱి యొకటి దేశి.

## నాథోపజ్ఞము

శ్రీ వైష్ణవ సంప్రదాయమున ఉభయ వేదాంతములకును సమ ప్రాధాన్యమొసగి, ప్రచారమునకు దెచ్చినవారు శ్రీమన్నాథమునులు. వీరు శ్రీ యామునాచార్యుల వారికి పితామహులు. శ్రీ యామున మునులు తమ స్తోత్రరత్నమున -

''మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమ త్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా.''

అని, ప్రపన్న జన కూటస్థులైన శ్రీ నమ్మాళ్వారులను ప్రస్తుతించుచున్నారు. శ్రీయామునాచార్యులవారి ప్రియ శిష్యులు శ్రీరామానుజాచార్యుల వారు. వీరికి ఆళ్వారులయందును, వారి దివ్యప్రభంధముల యందును గల భక్తి భావము అనన్య సామాన్యమైనది. ఇది శ్రీయామునుల ద్వారా వీరికి సంక్రమించినది. వీరు ఆళ్వారుల శ్రీ సూక్తులను మనస్సున నుంచుకొని, శ్రీభాష్యమును అనుగ్రహించిరని ఆచార్య హృదయము చెప్పుచున్నది.

## దివ్యప్రబంధములు - వేదములు

శ్రీ నమ్మాళ్వారులు కృప జేసిన నాలుగు దివ్యప్రబంధములను నాలుగు వేదములనుగ పెద్దలు సంభావింతురు. వానిలో - నూఱు పాశురములుకల తిరువిరుత్తము ఋగ్వేదమనియు, ఏడు పాశురములుగల తిరువాశిరియము యజుర్వేద మనియు, ఎనుబది రెండు పాశురములు గల పెరియ తిరువందాది అథర్వవేద మనియు, వేయిన్ని నూట రెండు

పాశురములుగల తిరువాయిమొళి సామవేద మనియు సాంప్రదాయము. ఈ నాలుగు ద్రావిడ వేదములకు తిరుమంగై యాళ్వారుల దివ్య ప్రబంధములు ఆఱును వేదములకు శిక్షాదులవలె ఆఱు అంగములు. తక్కిన ఆళ్వారుల దివ్యప్రబంధములు - మీమాంసా, పురాణాదులవలె ఉపాంగము లగుచున్నవి.

## తిరువాయిమొళి ప్రాశస్త్యము

ద్రవిడ వేదవ్యాసులైన శ్రీమన్నాథమునులు ఆళ్వారుల పాశురములను నాలుగు సహస్రములుగ వర్గీకరించుచు, తిరువాయిమొళిని నాల్గవ సహస్రముగ పరిగణించిరి. భగవానుడు - 'వేదానాం సామవేదో ఽ స్మి' అనుచు సామవేద ప్రాశస్త్యమును తెలిపెను. అట్టిసామవేదము సహస్రశాఖాత్మకము. దానివలెనే తిరువాయిమొళియు సహస్ర గీతికలతో నొప్పుచు, భగవన్ముఖోల్లాసకరమై యున్నది. కావుననే, ఇది మిగిలిన దివ్యప్రబంధముల కంటెను అభ్యర్హితమైనది. మొదటి మూడు వేల పాశురములను ఉత్సవ వేళలందు తిరువీథులలో అధ్యయనము గావింతురు. కాని, తిరువాయిమొళిని అట్లు తిరువీథులలో అధ్యయనము చేయు సంప్రదాయము లేదు. నియత సమయములలో దేవాలయములందు మాత్రమే అధ్యయనము గావించుట పరిపాటి. ఇదియు దీని వైలక్షణ్యమును తెలుపుచున్నది.

ఋగ్వేదమే గాన విశేషాశ్రయణ వశమున సామవేదమై పరగు రీతిని, వీరి తొలి ప్రబంధమైన తిరువిరుత్తమే ప్రతిపాద్యార్థ విశేషములచే,మలి ప్రబంధమగు తిరువాయిమొళిగ విస్తరించి, మిగులభోగ్యమైనది. నిత్యముక్తులు - 'ఏతత్సామగాయన్నాస్తే'అను శ్రుతివాక్యము చొప్పున, సామగానముతో - పరమపదమున ఆనందపరవశు లగుచుండు విధమున ప్రపన్నులు లీలావిభూతియందు ఈ తిరువాయిమొళిని అనుసంధించి, ఆనంద పరవశు లగుచుందురు. వేదవేద్యుడగు పరాత్పరుడు దాశరథిగ అవతరించినంతనే, తద్వైభవప్రతిపాదకమగు వేదము

శ్రీ వాల్మీకి భగవానుని వదనారవిందమున శ్రీమద్రామాయణముగ అవతరించిన రీతిగా - సర్వేశ్వరుడు అర్చారూపమున అవతరించగనే వేదములు ఆళ్వారుల ముఖారవిందముల నుండి ద్రావిడ దివ్య ప్రబంధములుగ అవతరించినవి.

"వేదైకవేద్యవిభవే త్వయ్యర్చామూర్తి సుస్థితే జగతి
వేదాః కి లావిరాసన్ ద్రావిడమూర్త్యా పరాంకుశాదిముఖాత్."

### ఉద్గీథ ప్రణవము - తిరువాయిమొళి

దివ్య ప్రబంధములలో - 'తిరువాయిమొళి' - సామవేద ప్రతిరూపము. 'సామ్న ఉద్గీథో రసః' అని సామమున ఉద్గీథము సారభూతము. 'ఓమిత్యే తదక్షర ముపాసీత' అని ప్రణవమును ఉద్గీథముగ ఉపాసించ వలయును. 'తస్యోదితి నామ' అని ఆ ఉద్గీథ ప్రణవ ప్రతిపాద్యుడగు సర్వేశ్వరునికి 'ఉత్' అని పేరు. కావుననే తిరువాయిమొళి - 'ఉయర్వర' అను పాశురమున ఉకారముతో ప్రారంభమై, 'ఉయర్ న్తే' అని తకారముతో పూర్తియగుచున్నది. ఇట్లే,

"**ఉ**యర్వఱ వుయర్‌వల ముడైయవన్ యవనవన్
**మ**యర్వఱ మదినల మరుళినన్ యవనవన్
**అ**యర్వఱు మమరర్‌గళ్ అదిపతి యవనవన్"
తుయరఱు శ్రుడరడి తొళు తెళిళన్ మననే." (1-1-1)

అను మొదటి పాశురమున, మొదటి మూడు పాదముల, మొదట మొదటి అక్షరములు **అ ఉ మ** అనునవి. ప్రణవాక్షరములే ముందు వెనుకలుగ ప్రయుక్తములైనవి. కావున, ఇది సామవేద ప్రతికృతి యని నమ్మాళ్వారులే సూచించిరి.

### శాస్త్రాంతర సామ్య వైలక్షణ్యము

'భారతః పంచమో వేదః' అను రీతిని, తిరువాయిమొళిని వేదముగను పేర్కొనవచ్చును.

''యద్వై కించ మనురవదత్ త ద్భేషజమ్.''
''సహోవాచ వ్యాసః పారాశర్యః.''
''బ్రహ్మవాదినో వదన్తి.''

అనియు వేదము ఆప్తులను పేర్కొనుచున్నట్లు, ఆళ్వారులును తాము చెప్పిన విషయములకు సాక్షులనుగ -

1. ''పార్తన్ తిళం దొళింద.'' 2. ''మార్కండేయనుం కరియే.''

అని, పార్థ - మార్కండేయాదులను ప్రస్తావింతురు. భారత రామాయణాదులయందువలె, ఇతర వృత్తాంతముల ప్రస్తావము లేక, కేవల భగవద్గుణానుభవమే ఇందు ప్రస్తుతింపబడుచుండును. మీమాంసాది శాస్త్రములయందువలె ఇందు గురుశిష్య గ్రంథ విరోధములు లేవు. కావున, భగవద్గుణానుభవమున వానికంటె ఇది ఉపయుక్తమై యున్నది.

మేఘము క్షారములగు సముద్ర జలములను గ్రహించి, మధుర జలములను వర్షించు రీతిని, నియతాధికారము లగు వేదార్థములను వీరు సర్వ భోగ్యముగ ప్రవచింతురు. వేదార్థములను ఉదాత్తాది స్వరములతో, ఉపనీతులైన వారు మాత్రమే అధ్యయన మొనర్ప వలయునని యున్నది. ఇట్టి నియమము లేవియు దివ్యప్రబంధాధ్యయన మునకు లేవు.

## భగవద్గీత - తిరువాయిమొళి

జీవపరభేద - జీవపరస్పరభేద - జీవ ప్రకృతిభేద - ప్రకృతీశ్వర భేద - ఆత్మనిత్యత్వ - దేహాదిత్యత్వ - సర్వశరీరత్వ - సర్వాంతర్యామిత్వ - నియంతృత్వ - సౌలభ్య - సర్వ సమత్వ - అహంకార దోష - ఇంద్రియ ప్రాబల్య - మనః ప్రాధాన్య - కరణ నియమన - సుకృతి భేద - దేవాసుర విభూతియోగ - విశ్వరూప దర్శన - సాంగభక్తి - ప్రపత్తిద్వైవిధ్యములను ప్రవచించుటచే, తిరువాయిమొళి భగవద్గీతను పోలియున్నది. గమనింపనగును.

**1. తత్త్వ వివేకము :-**

"నత్వే వాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామః సర్వే వయ మతఃపరమ్."
"దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతర ప్రాప్తిః ధీర స్తత్ర న ముహ్యతి."
— (భగవద్గీత 2-12,13)

ఈ శ్లోకములలో - జీవపర భేదము, జీవ పరస్పర భేదము, జీవ ప్రకృతి భేదము చెప్పబడినవి.

"అడియే నుళ్ళా నుడలుళ్ళాన్ అణ్డత్తగత్తాన్ పురత్తుళ్ళాన్." (8-8-2)
అండముల లోపల, వెలుపల వ్యాపించియున్న సర్వేశ్వరుడు నా ఆత్మ యందును, శరీరమునందును వ్యాపించియున్నాడు."

"శెన్ను శెన్ను పరం పరమాయ్ యాదుమిన్ఱి తేయ్న్దఱ్." (8-8-6)
అన్నమయాది కోశములను అతిక్రమించి, ప్రకృతి సంబంధమును సవాసనగ వీడి ..."

అను ఈ పాశురములలో పై విషయములు బోధింపబడినవి.

**2. నిత్యత్వానిత్యత్వములు :-**

"అన్తవన్త ఇమే దేహాః నిత్య స్యోక్తా శ్శరీరిణః." (2-18)
ఇత్యాది శ్లోకములయందు - ఆత్మనిత్యత్వ, దేహాఽనిత్యత్వములు బోధింపబడినవి. నమ్మాళ్వారులును -

"మిన్నిన్నిలై యిల మన్నుయిరాక్కై కళ్." (I - 2 - 2)
స్థిరమైన ఆత్మకు ఆవాసములైన శరీరములు మెరపుకంటెను అస్థిరములు."

ఈ పాశురమున — దేహములు విద్యుచ్చంచలము లనియు, ఆత్మ స్థిరమైన దనియు ప్రవచించిరి.

**3. నియంతృత్వము :-**

"భూమి రాపో ఽనలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా." (7 - 4)

"అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం
జీవ భూతాం మహాబాహో య యేదం ధార్యతే జగత్." (7-5)

అను శ్లోకములలో - భగవంతుడు చేతనాచేతన శరీరుడనియు -

"సర్వస్య చాహం హృది సన్నివిష్టః." (15 - 15)

ఇత్యాది శ్లోకములలో అతడు సర్వాంతర్యామియై, సర్వ నియంత యగుచున్నాడనియు తెలుపబడగా, నమ్మాళ్వారులును -

"ఉడన్మిశై యుయిరెన కరన్దెఙ్గుం పరన్దుళన్." (1 - 1 - 7)

"నిన్ఱనర్ ఇరున్దనర్ కిడన్దనర్ తిరిన్దనర్." (1 - 1 - 6)

శరీరమున జీవాత్మవలె సర్వేశ్వరుడు అంతట కనుపింపక వ్యాపించి యున్నాడు. - - నిల్చున్నవారు, కూర్చున్నవారు, పరుండినవారు, సంచరించువారు అను వీ రందరి స్థిత్యాదులు సర్వేశ్వరుని అధీనములు."

ఇత్యాది పాశురములలో - సర్వేశ్వరుని నియంతృత్వ, సర్వాంతర్యామిత్వములను విశదపరచిరి.

### 4. సౌలభ్యము :

"తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః." (8 - 14)

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే." (4 - 8)

అను శ్లోకములలో - భక్త వాత్సల్యతను, అవతార సౌలభ్యమును గీత బోధింపగా, తిరువాయిమొళియు -

"పత్తుడై యడియవర్ క్కెళియవన్ పిఱర్ కళుక్కరియ విత్తకన్.(1-3-)

"ఎళివరు మియల్వినన్ నిలై కరమ్బిల పల పిఱప్పాయ్." (1 - 3-2)

భక్తులను సులభుడు, భక్తిహీనులకు దుర్లభుడు అయిన ఆశ్చర్యభూతుడును అనంతావతార కందమై, సర్వసులభుడైన సర్వేశ్వరుడు, అనియు - పై యంశములనే వివరించినది.

### 5. సర్వ సమత్వము :-

"సమోహం సర్వభూతేషు మే ద్వేషోఽస్తి నమే ప్రియః." (9- 29)

అనుచు భగవంతుడు ఆశ్రయణీయత్వమున తాను సర్వసముడనని అనుగ్రహించియున్నాడు. నమ్మాళ్వారులును -

"పత్తిల నీశనుమ్ ముత్తవుమ్ న్నిన్నన్." (1 - 2 - 6)

ప్రీతితో సర్వేశ్వరుడు అంతట వ్యాపించియున్నాడు, అని ఉగ్గడించి నారు.

### 6. అహంకార దోషము :-

"అహంకార విమూఢాత్మా కర్తార మితి మన్యతే." (3 - 27)

అను గీతాశ్లోకము - అహంకారము దుష్టమైన దని తెలుపుచున్నది. ఇట్లే తిరువాయిమొళియు -

"నీర్ నుమదెన్నివై వేర్ ముదల్ మాయిత్తు." (1 - 2 - 3)

అను పాశురమున, అహంకార - మమకారములను సమూలముగ ఉన్మూలము గావింపవలసినదని ఉపదేశించినది.

### 7. ఇంద్రియ బలము :-

"ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః." (2 - 60)

అని, గీతలో ఇంద్రియ ప్రాబల్యము చెప్పబడినది.

"విణ్ణుళార్ పెరుమాఱ్కడిమై శెయ్‌వారై యమ్‌శెఱుం ఐమ్బులనివై." (1 - 7 - 6)

అను పాశురమున, పంచేంద్రియములు భగవ దంతరంగులను సైతము బాధించునని తిరువాయిమొళిలో తెలుపబడినది. కావున, ఇంద్రియ జయమున ఏమరుపాటు తగదని భావము.

### 8. మనః ప్రాధాన్యము :-

"చంచలం హి మనః కృష్ణ ! ప్రమాథి బలవద్దృఢమ్
తస్యాహం నిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరమ్." (7 - 34)

కృష్ణా ! మనస్సు చంచలము, బలత్కారముగ హరించునట్టిది. అది బలము గలది గనుక, దానిని త్రిప్పుట, గాలిని త్రిప్పుటవలె అసాధ్యమని నేను తలచెదను' అని గీతలో అర్జును డనగా, అపుడు కృష్ణ భగవానుడు పార్థునితో -

"అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే." (7 - 35)

ఓ మహాబాహూ! మనస్సు నిలుపగూడనిది అనుటకు సంశయము లేదు. ఓ కుంతీపుత్రుడా! అభ్యాసముచేతను, వైరాగ్యము చేతను మనసు నిలుపబడును' అని, మనో నిగ్రహ దుశ్శకత్వమును, మనో నిగ్రహ ప్రకాశమును తెలిపియున్నాడు. నమ్మాళ్వారులును -

"వన్నక్వనేన్ మనత్తై వలిత్తు కణ్ణనీరే కరన్దు." (5 - 2 - 4)

దృఢమైన కాపట్యముగల నేను మనస్సును మరల్చి' అను పాశుర భాగమున, మనస్సును దృఢముగ స్వాధీన మొనర్చుకొనవలెనని ప్రబోధించినారు.

### 9. కరణ నియమము :-

"వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా." (2 - 61)

కరణములను వశమున నుంచుకొనదగునని గీత బోధింప, తిరువాయిమొళియు -

"ఉళ్ళవలరై శెయల్ ఉళ్ళ విమ్మూనిన్ఱైయుమ్." (1 - 2 - 8)

మనస్సు, వాక్కు, క్రియ అను కరణత్రయమును' - అనుచు కరణత్రయ నియమనమును ప్రస్తుతించినది.

### 10. సుకృతి భేదము :-

"చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ।." (7 - 16)

అను శ్లోకము భగవంతుని ఆశ్రయించి, కార్యమును సాధించుకొను వారిని సుకృతులనుగ పేర్కొనుచు, వారిని ఆర్తాది భేదమున నాలుగు విధములుగ వర్గీకరింప, నమ్మాళ్వారులును -

"ఒరునాయకమాయ్ ఓడవులకుడనాణ్డవర్." (4 - 1 - -)

అను పాశురమున ఆర్తులను -

"కుఱుక మిక పుణర్వత్తొదు నోక్కి యెల్లామ్ విట్ట." (4 - 1 - 10)

అను పాశురమున జిజ్ఞాసువును -

"కుణఙ్గొళ్ నిఱై వుగళ్ మన్నర్‌కొడై కడన్ పూణ్డమును."

అను పాశురమున అర్థార్థిని -

"తిరునారణన్ తాళ్ కాలమ్పెఱ చ్చిన్దిత్తుయ్‌మినో." (4 - 1 - 1)

అను పాశుర భాగమున జ్ఞానిని పేర్కొనియున్నారు.

## 11. దేవాసుర విభాగము :-

"ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ! మే శృణు." (16 - 6)

అనుచు గీతా వచనము దేవాసుర విభాగమును ప్రదర్శించినది

తిరువాయిమొళియు -

"నణ్ణా వశురర్ నలివెయ్‌ద నల్ల వమరర్ పొలివెయ్‌ద." (10 - 7 - 5 .)

సర్వేశ్వరుని ఆశ్రయింపని అసురవర్గము నశింపగా, ఆశ్రయించిన దేవ వర్గము ఉజ్జీవించినది' అను ఇత్యాది పాశురములలో ఈ యంశములను ప్రస్తావించినది.

## 12. విభూతి యోగము :-

"హన్త తే కథయిష్యామి దివ్యాహ్యాత్మ విభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే." (10 - 19)

అనుచు, భగవానుడు గీతలలో తన విభూతిని విస్తరించి వర్ణించి యున్నాడు. నమ్మాళ్వారులును -

"పుగళ నల్లొరువనెన్గో పొరువిల్ శీర్ పూమియెన్గో." (3 - 4 - 1)

మున్నగు పాశురములలో భగవద్విభూతిని విశేషముగ వర్ణించి యున్నారు.

## 13. విశ్వరూప దర్శనము :-

"పశ్యామి దేవాం స్తవ దేవ దేహే, సర్వాం స్తథా భూత విశేష సంఘాన్
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం, ఋషీం శ్చ సర్వా నురగాశ్చ దివ్యాన్."
(11 - 15)

ఇత్యాది గీతా శ్లోకములు అర్జునుని భగవ ద్విశ్వరూప సందర్శనమును ప్రస్తుతించుచుండ, నమ్మాళ్వారులును -

"నీరాయ్ నిలవాయ్ తీయాయ్ క్కాలాయ్ నెడువానాయ్" (6 - 9 - 1) నీరు, భూమి, అగ్ని, కాలము, ఆకాశము ఈ రూపములలోనున్నవాడు' ఇత్యాది పాశురములలో భగవ ద్విశ్వరూపమును సందర్శించి ప్రస్తుతించిరి.

**14. సాంగ భక్తి :-**

"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి యుక్త్వై వ మాత్మానం మత్పరాయణః." (9 - 34)

అనుచు, గీత - సాంగోపాంగ భక్తిని ఉపదేశించినది. నమ్మాళ్వారులును -

"మేవిత్తొళుదుయ్మ్మినీర్గళ్ వేదప్పునిద విరుక్కై." (5 - 2 - 9) వైదికములు, పవిత్రములు అయిన పురుషసూక్తాది ఋక్కులతో సర్వేశ్వరుని స్తుతించి ఉజ్జీవించుడు" అని, అట్టి భక్తిని ఉపదేశించిరి.

**15. అంగ ప్రపత్తి :**

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే." (7 - 14)

అను గీతాశ్లోకము మాయా తదంగాంగముగ ప్రపత్తిని బోధించినది తిరువాయిమొళియు -

"ఉణక్కుమిన్ పశైయఱ అవనుడై యుణర్వు కొణ్డుణర్న్దే." (1 - 3 - 5) ఆ సర్వేశ్వరుడు అనుగ్రహించిన శాస్త్రజ్ఞాన దీపముచే తత్త్వమును ఎఱింగి, సమూలముగ దుర్మత శాఖల ఖండించుడు' అనుచు అంగ ప్రపత్తిని ఉపదేశించిరి.

**16. అంగి ప్రపత్తి :**

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః." (18 - 66)

అని భగవంతుడు గీతలలో సిద్ధాంతముగ అంగి ప్రపత్తిని బోధించి యున్నాడు. నమ్మాళ్వారులును -

"శరణమాగుమ్ తనతాళడైన్దార్కెల్లామ్." (9 - 10 - 5)

ఇత్యాది పాశురములలో అంగి ప్రపత్తిని ఉపదేశించినారు. మరియు గీతలలో సర్వేశ్వరుడు -

"త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున!" (4 - 9)

అను శ్లోకమున అవతార రహస్యమును -

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః." (9 - 26)

అను శ్లోకమున స్వారాధనను తెలిపినాడు. నమ్మాళ్వారులును -

''ఇవై పత్తుం వల్లార్ అమరరోడు యర్విత్తెప్పడ్డ
ఉఱువర్ తమ్ పిఱవి యఱుత్తెయే." (1 - 3 - 11)

ఈ పది పాశురములను అనుసంధించినవారు జన్మ పరంపర యనెడి చెఱను ఛేదించుకొని, పరమపదమును చేరి, నిత్య సూరులతో కలియుదురు' అనుటలో - భగవదవతార రహస్య మెఱింగినవారు - సంసార బంధమునుండి తొలగి, నిత్యసూరుల గోష్ఠిలో జేరెద రని అవతార రహస్య జ్ఞాన ఫలమును వివరించిరి. మఱియు -

''పిరవగై యిన్ది నన్నీర్ తూయ్ పురివదువుమ్ పుగై పూవే.'' (1-6-1)

ఎల్లప్పుడు సర్వేశ్వరునికి మనము సమర్పించవలసినవి - జలమును, పుష్పమును, ధూపమును మాత్రమే (పత్రం పుష్పం ఫలం తోయం.)' అనుచు భగవంతుని స్వారాధతను వర్ణించిరి.

ఈ రీతిగా నమ్మాళ్వారులు తమ 'తిరువాయిమొళి' దివ్య ప్రబంధముద్వారా గీతాచార్యుని ఉపదేశములను స్వానుభవపూర్వకముగ ప్రవచించుటచే, తిరువాయిమొళి గీతోపనిష త్సమమని పెద్దలు సంభావించిరి.

## తిరువాయిమొళి వైభవము

'తత్త్వమేకో మహాయోగీ' అని పరతత్త్వముగ కీర్తింపబడిన వాసుదేవుడే –

"అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా" (7 - 6)
"మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ!" (7 - 7)
"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః." (18-66)

అనుచు, తన మహిమను తానే గీతలలో తెలుపుకొనవలసి వచ్చినది. తిరువాయిమొళి యన్ననో –

"ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః." (4 - 34)

అని జ్ఞానోపదేష్టలుగా ప్రశంసింపబడిన తత్త్వదర్శులలో అగ్రేసరులైన నమ్మాళ్వారులు –

"కణ్ణ లిల్లావిల్లై కణ్డీర్ శరణ దునిఅఃఌ వష్టు ....
తిణ్ణమానుమ్మడై మెయుణ్డేల్ అవసడి శేర్ త్తుయ్‌మినో." (9 - 1 - 10)

శ్రీకృష్ణునకు మించిన రక్షకుడు లేడు. మీది అని భ్రమించినవాని నన్నింటిని అతనికి సమర్పించి ఉజ్జీవించుడు.'

"మణ్ణుమ్ విణ్ణు మెల్లామ్ ఉడసుణ్డ, నమ్
కణ్ణన్ కణ్ణల్లతు ఇల్లై యోర్ కణ్ణే." (2 - 2 - 1)

అని సర్వేశ్వరుని వైభవమును ఉపదేశించుటచే, అట్టి దోషము లేక, అందరును విశ్వసింప నవకాశము కలిగించుచున్నది.

"శిష్య స్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్." (2 - 7)

నీకు నేను శిష్యుడను. నిన్నాశ్రయించిన నాకు ఉపదేశింపుము), అను అర్జునుని ప్రార్థనను విని, గీతోపదేశము కావింపబడినది. కాని,

"నూన మశ్రద్దధానోఽపి దుర్మేధాశ్చాపి పాండవ!
అబుధ్వా యన్నజానషే తన్మే సుమహదప్రియమ్."

అని, కాలాంతరమున అది భగవంతునికి, అప్రీతిని కలిగించినది. కాని తిరువాయిమొళి –

"ఎపావమ్బరమే యేళులకుమ్
ఈ పావణ్ణయ్‌తు అరుళాలళ ప్పారార్." (2 - 2 - 2)

శ్రీ కృష్ణుడు తప్ప లోకములను రక్షించువారు ఎవరని నేను చెప్పవలెనా ? ఏమి పాపము ?' అని అప్రీతితో ప్రారంభమైనను -

"ఉత్తన్ ఉగన్దు పణిశెయిదు ఉనపాదమ్
పెత్తేన్, ఈదే యిన్నమ్ వేణ్డువ దెన్దాయ్" (10 - 8 - 10)

ప్రీతితో కైంకర్యమును చేసి, నీ పాదారవిందములను చేరితిని' అని ప్రీతితో ఉపసంహరింపబడినది.

మోహనశాస్త్ర ప్రవర్తకుడైన సర్వేశ్వరుడే గీతను సైతము ఉపదేశింపగా, పరమ ఆప్తులైన నమ్మాళ్వారులు ఈ దివ్యప్రబంధమును అనుగ్రహించిరి భగవద్గీత మోక్ష శాస్త్రమైనను, యుద్ధ ప్రోత్సాహమునకై అది ఉపదేశింపబడినది. తిరువాయిమొళి అట్లుగాక, ఐహిక - ఆముష్మిక భోగములయందు వైరాగ్యమును కలిగించి,

"ముడిప్పాన్ శొన్న వాయిరత్తు" (6 - 10 - 11)

సంసార బంధము నశించుటకుగా చెప్పిన వేయి పాశురములలో మోక్షార్థము ప్రవృత్తమై, పరమ పురుషార్థమును ప్రబోధించినది.

భగవద్గీత - 'మా మేకం శరణం వ్రజ' అని సిద్ధ ధర్మమును విధించినది. నమ్మాళ్వారులు —

"తిరునారణన్ తాళ్ కాలమ్పెఱచ్చిన్దిత్తుయ్యమినో." (4 - 1 - 4)

ఆలసింపక శ్రియఃపతి పాదారవిందములను ఆశ్రయించి ఉజ్జీవించిరి' అని ఆ సిద్ధ ధర్మమును ఉపదేశించుట మాత్రమేగాక,

"ఉన్నడిక్కీళ్ అమర్న్దు పుగున్దేనే." (6 10 - 10)

దేవరవారి పాదపద్మములక్రింద ప్రవేశించితి (ఆశ్రయించితి)' అని, స్వయముగ అనుష్ఠించి చూపిరి. కావున - విధి, అనుష్ఠానము అను రెండును ఇందు చూపట్టుచున్నవి.

ఆళ్వారులు పరిగ్రహించుటచేతనే గీతకు ప్రామాణ్యము సిద్ధించినది. సాంఖ్య, బౌద్ధాది శాస్త్రములను భగవంతుడే బోధించినను, శిష్ట పరిగ్రహము లేనందున, అవి ప్రామాణికములుగ పరిగణింపబడుట లేదు. పెద్దలు గీతాశాస్త్రమును పరిగ్రహించుటకు మూలము - అది శిష్ట పరిగృహీత మగుటయే. శిష్టులలో అగ్రేసరులు ఆళ్వారులు. వీరు - "పండే పరమన్ పణిత్త పణి వకైయే" (10 - 4 - 9) అని గీతోపదేశము ప్రకారము అనుష్ఠించి, తాము సంసార బంధమును పోగొట్టుకొనినట్లు సాయించినారు. కావుననే గీతాశాస్త్రము మనకు పరమప్రమాణ మగుచున్నది. ఈ విధముగ భగవంతుడు ఉపదేశించిన గీతాశాస్త్రముకంటెను విలక్షణమైన వైభవము గలది తిరువాయిమొళి అని సిద్ధించుచున్నది.

## ప్రమేయ చరమము - ప్రమాణ చరమము

మహాసముద్రమువలె అపరిచ్ఛిన్నమైన సర్వేశ్వరుని పరత్వమును వర్ణించినది వేదము. ఉత్తరంగిత సముద్రమువంటి సంకర్షణాది వ్యూహ మూర్తుల వైభవమును వర్ణించునది పాంచరాత్రము. అగాధమైన సముద్ర మధ్య భాగమువలె దుర్విజ్ఞేయమైన అంతర్యామి విషయమున ప్రవృత్తములు మన్వాదిస్మృతులు - మహాప్రవాహములవలె కదాతనములైన రామకృష్ణాది విభవావతారముల వైభవమును ప్రతిపాదించునవి శ్రీ మద్రామాయణ భారతాది ఇతిహాసములు. మహా సముద్రములలోని నీటి మడుగులవలె సర్వకాలములయందును ఆశ్రయించి అనుభవింపదగిన అర్చావతార విషయకము తిరువాయిమొళి. ఈ రీతిని ప్రమేయ చరమము అర్చావతారము కాగా, తిరువాయిమొళి ప్రమాణ చరమ మగుచున్నది.

ఆళ్వారులు పదునారు సంవత్సరములకు పదునారు కళలతో నిండిన పూర్ణిమా చంద్రునివలె విలసిల్లిరి. చంద్రునిలోని అమృతము కేవలము దేవభోగ్యము కాగా, ఆళ్వారుల శ్రీసూక్తి సారమైన

తిరువాయిమొళి - 'పాలోడముదన్న = పాలు - అమృతముల వలె అన్న రీతిని ఉభయ విభూతి వాసులకును సర్వేశ్వరునికిని భోగ్యమై యలరారుచున్నది. అట్టి ఈ తిరువాయిమొళియందు ప్రధాన ప్రతిపాద్య మగు అర్థ పంచకమును ఇందలి మొదటి పాశురము సంగ్రహముగ తెలుపుచున్నది.

1. 'అమరర్ కళాధిపతి = నిత్యసూరినాథుడు' అనుటచే, పరస్వరూపము --

2. 'విన్ మననే = ఓ నా మనస్సా ! ' అనుటచే, స్వస్వరూపము -

3. 'మయఱ్వు = అజ్ఞానము' అనుటచే విరోధిస్వరూపము -

4. 'మతినల మరుళినన్ = భక్తిరూపాపన్న జ్ఞానమును అనుగ్రహించినాడు' అనుటచే ఉపాయస్వరూపము -

5. 'తొళుదెళు = నమస్కరించి ఉజ్జీవించు' అనుటచే, ఫలస్వరూపము ప్రతిపాదితములైనవి.

మరియును ఈ పాశురమునందు - 'తుయరఱు శుడరడి = దుఃఖమును తొలగించు ప్రకాశవంతమైన చరణము' అనుటచే వస్తునిర్దేశము - 'తొళుదు = నమస్కరించి' అనుటచే, నమస్కారము - 'ఎళు = ఉద్యమింపుమా' అనుటచే, ఆశీస్సు ప్రస్తుతములైనవి. కావున, కావ్యారంభమున నుండదగిన ఆశీ ర్నమస్క్రియా వస్తునిర్దేశములు మూడును ఇందు అప్రయత్నముగ సిద్ధించినవి.

ఇట్టి తిరువాయిమొళియందు - తిరుమంత్ర ద్వయ చరమ శ్లోకార్థములు విశదముగ ప్రతిపాదింపబడి యున్నను, ద్వయార్థమే ప్రధాన ప్రతిపాద్యమని పూర్వాచార్యుల సిద్ధాంతము. కావుననే దీనికి 'దీర్ఘ శరణాగతి' ప్రబంధ మని ప్రసిద్ధి.

— o —

# శ్రీ రామానుజ దర్శనము

'సాహిత్య విద్యా ప్రవీణ'

**శ్రీమాన్ తట్టా విజయరాఘవాచార్యులు,** ఎం. ఏ.



"వందే వేదాంత కర్పూర చామీకర కరండకమ్

రామానుజార్య మార్యాణాం చూడామణి మహర్నిశమ్"

## పరిచయము

అనాదిగా వేదమునందు అంతర్లీనమై, వేదాన్తములందలి సంభావణముల ద్వారా, ఉపదేశముల ద్వారా, వాదముల ద్వారా, ఒక రూపము దాల్చిన తత్త్వము – పురాణములందును, ఇతిహాసములందును మెరుగులు దిద్దుకొని, కథారూపమున కథిత మగుచు, కలియుగారంభమున భక్తాగ్రేసరులుగా ప్రసిద్ధిగాంచిన ఆళ్వారులచే పాశురరూపములతో ప్రకటింపబడుచు, నాథ-యామునులద్వారా ఒక మార్గమునకు వచ్చి, భగవద్రామానుజుల యందు విస్తృత రూపము దాల్చి, విశ్వవ్యాప్తి చెందినది విశిష్టాద్వైతము. అందువలననే విశిష్టాద్వైతము 'రామానుజ దర్శనము' అని ప్రసిద్ధి గాంచినది.

## తత్త్వత్రయము

నవ నిధులవంటి నవ గ్రంథరత్నముల కాంతులతో తేజరిల్లినది రామానుజ దర్శనము. అట్టి రామానుజ గ్రంథరత్నమాలలోని రత్నములు - వేదార్థ సంగ్రహము, వేదాంతసారము, వేదాంత దీపము, గద్యత్రయము, నిత్యగ్రంథము, గీతాభాష్యము, శ్రీభాష్యము అనునవియే. వీనిలో ప్రథమ రత్నము వేదార్థసంగ్రహము. నాయక రత్నము శ్రీభాష్యము. శ్రీభాష్యమునకు ప్రధాన జ్యోతులు - శ్రుత ప్రకాశిక, శ్రుత ప్రదీపిక, నయ ప్రకాశిక, భావ ప్రకాశిక, శ్రీభాష్య ప్రకాశిక, తత్త్వటీక, గూఢార్థ సంగ్రహము. రామానుజ దర్శన మంతటికి గ్రంథరాజరత్నము శ్రీభాష్యము.



శ్రీ రామానుజ యతిసార్వభౌములు

బోధాయనమహర్షి విరచితమగు 'బ్రహ్మసూత్రవృత్తి'ని పరిశీలించి, కపర్ది - భారుచి - గుహదేవ - ద్రమిడ - టంకాచార్యులచే ప్రతిపాదింపబడిన సిద్ధాంతమునకు రూపరేఖలు దిద్దుచు శ్రీభాష్యమును రచించినారు రామానుజులు.

రామానుజ దర్శనమునందు - సర్వాత్మయైన శ్రీ మన్నారాయణుడే ముఖ్య తత్త్వము. అతడు అశేష విశేషములతో గూడినవాడు. అపృథక్సిద్ధ సంబంధములో ఎల్లప్పుడు కూడి యుండునవి - చిత్తు, అచిత్తు. 'చిత్తు' అనగా – జీవాత్మ. 'అచిత్తు' అనగా - ప్రకృతి లేక జగత్తు. చిదచిత్తులతో గూడిన పరమాత్మ నారాయణుడు. చిదచిత్తు లెల్లప్పుడు పరమాత్మాధీనములో నుండి, పరమాత్మ వలననే ప్రవర్తించుచుండును. అందువలన, ఈ తత్త్వత్రయము ముఖ్యము.

జీవ జగత్తులు పరమాత్మనుండి ఉద్భవించి, పరమాత్మయందే పరిణత చెంది, పరమాత్మయందే లయ మగును. పరమాత్మకు - బ్రహ్మ, సత్, ఈశ్వరుడు - అని నామాంతరములు. సర్వము శేషము. పరమాత్మ శేషి.

సృష్టికి పూర్వము సూక్ష్మ రూపముతోనున్న చిదచిత్తులు - సృష్ట్యనంతరము స్థూల రూపము నంది, ప్రళయ కాలమందు సూక్ష్మ రూపములోనున్న చిదచిత్తులు సృష్ట్యనంతరము స్థూల రూపము నంది, ప్రళయకాలమందు మరల సూక్ష్మరూపమున పరమాత్మతో ఏకీభావము నందును.

ఈ రీతిగా స్థూల చిదచిద్విశిష్టుడైన బ్రహ్మకు, సూక్ష్మ చిదచిద్విష్టుడైన బ్రహ్మకు అద్వైతము ప్రతిపాదింపబడుచున్నది. కావున నిది విశిష్టాద్వైత మనబడును. విశిష్టంచ 'విశిష్టం చ విశిష్టే. విశిష్టయో రద్వైతమ్ = విశిష్టాద్వైతమ్' అని విగ్రహ వాక్యము.

---

1. అపృథక్సిద్ధ సంబంధము — విడిదీయుటకు వీలు లేనిది.

## విశిష్టాద్వైత దర్శన వైశిష్ట్యము

శ్రీ విశిష్టాద్వైత దర్శనము - శ్రుతి స్మృతీతిహాస పురాణాది ప్రమాణ వాక్యములచే ప్రతిపాదింపబడినది. జీవాత్మకు, పరమాత్మకు 'తత్త్వమసి' అని అద్వైతము ప్రతిపాదింపబడినది. ఈ విధముగా ఏకత్వమును బోధించుచున్న 'తత్త్వమసి' యను వాక్యము విశిష్టాద్వైతమున చక్కగా వ్యాఖ్యానింపబడినది.

'ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్' అను ఏకత్వప్రతిపాదక వాక్య వివరణము, తత్త్వత్రయ స్వరూప నిరూపణము, పరమాత్మ ప్రాప్త్యుపాయములు, అందలి భక్తిప్రపత్తుల స్వరూపసంధాన విధానము, జీవాత్మ పరమాత్మల శరీర శరీరి భావ సంబంధము, పరమాత్మయొక్క అశేష విశేష గుణ నిరూపణము, జగత్సత్యత్వము, సత్కార్య - పరిణామవాదముల ప్రతిపాదనము మున్నగునవి ఈ విశిష్టాద్వైత దర్శనమున ముఖ్యములుగా పేర్కొనదగినవి.

### చిత్తత్త్వ స్వరూప నిరూపణము

దేహేంద్రియ మనఃప్రాణములకంటెను అతిరిక్తమై, అణురూపముగా అవ్యక్తమైనది, అచిన్త్యమైనది చిత్తు. అనగా - జీవాత్మ పరమాత్మ నియామకుడు. పరమాత్మ శేషి, జీవాత్మ శేషము. జీవాత్మ శరీరము, పరమాత్మ శరీరి. దేహమే ఆత్మ యనియు, ఇంద్రియమే ఆత్మ యనియు, మనస్సే ఆత్మ యనియు, ప్రాణమే ఆత్మ యనియు వాదించు ఇతరాత్మవాదుల వాదము లసత్యములు. దేహేంద్రియ మనఃప్రాణములకంటెను అతిరిక్తమైనది ఆత్మ. 'నేను' అను వ్యవహారమునకు లక్ష్యమైన వస్తువే జీవాత్మ. 'నా దేహము' 'నా ఇంద్రియము' 'నా మనస్సు' 'నా ప్రాణము' అను విధముగా - 'నా యొక్క' అను బుద్ధికి వ్యవహారములయిన విషయములుగా దేహాదులు స్మరింపబడుచున్నవి. 'ఆత్మ' యనగా నేను. 'నేను' అను పదమున కర్థ మేమి? అదియే దేహ మనుటకు వీలు లేదు. 'నేను దేహమును' 'నేను

ఇంద్రియమును' అను వ్యవహారము లేదు. 'నా దేహము' 'నా ఇంద్రియము' అని వ్యవహారమునందున్నది. కనుక, దేహాదులు 'నేను' అను శబ్దమునకు అర్థములు కావు. దానికంటెను అతిరిక్తములు. ఈ విధముగా దేహాదులకంటెను విలక్షణమైన, అజడమైన, అణువైన, అవ్యక్తమైన, అచింత్యమైన, అచ్ఛేద్యమైన, అదాహ్యమైన, అశోష్యమైన, అక్లేద్యమైన, ఆనందరూపమైనదానిని 'ఆత్మ' అని తెలిసికొనవలెను. పరమాత్మకు శరీరము జీవాత్మ. జీవాత్మకు శరీరము ప్రకృతి. అనగా - ప్రకృతిరూపమైన శరీరములో జీవాత్మ నిగూఢమై యున్నాడు. జీవాత్మ పరమాత్మ కధీనుడు.

జీవాత్మ సుఖస్వరూపుడైనను సంసార దశయందు దుఃఖము నొందుచున్నాడు. జీవాత్మకు గల కర్తృత్వము ఈశ్వరాధీనము. జీవాత్మ యొక్క ధర్మములైన జ్ఞానము, ఇచ్ఛ, ప్రయత్నము భగవదధీనములు. ప్రత్యక్త్వము, చేతనత్వము, ఆత్మత్వము, కర్తృత్వము జీవాత్మ సామాన్య లక్షణములు. ప్రత్యక్త్వ మనగా - శరీరప్రతిసంబంధిత్వము. కర్తృత్వ మనగా - సంకల్పజ్ఞానాశ్రయత్వము. పరమాత్మచే జీవుడు స్వేచ్ఛానుసారము వినియోగింపబడుచున్నాడు. జీవాత్మ - పరమాత్మకు ఆధేయుడు, విధేయుడు.

జీవాత్మ అణుపరిమాణుడు. జీవాత్మ స్వతస్సిద్ధముగ సుఖియైనను, ఉపాధివశమువలనను, ప్రకృతి సంబంధమువలనను సంసారములో పడుచున్నాడు. ప్రకృతి వికారమైన పాంచభౌతిక శరీరమునకు శరీరి యగుచున్నాడు. తనయందు పరమాత్మ యుండుటచే, పరమాత్మకు తాను శరీర మగుచున్నాడు. 'ఎవరికి ఆత్మ శరీరమో?' (యస్యాత్మా శరీరమ్ ?) అను శ్రుతి ప్రమాణమువలన, పరమాత్మకు ఆత్మ శరీర మని స్పష్టమగుచున్నది. 'అత్రాయం పురుషః స్వయం జ్యోతిర్భవతి' అను శ్రుతివలన, జీవాత్మకు స్వయంప్రకాశత్వము సిద్ధించుచున్నది.

స్వయంప్రకాశత్వ మనగా - అనన్యాధీన ప్రకాశత్వము. ఇదియే అజడత్వము. జ్ఞానత్వము, అణుత్వము, అమలత్వము జీవాత్మయొక్క స్వరూప నిరూపక ధర్మములు.

జీవాత్మ భగవంతుని కౌస్తుభమణివలె పరిశుద్ధుడైనను, కర్మ సంబంధమువలన, సర్వజ్ఞత్వము కోల్పోవుటవలన, భగవంతునకు శేషభూతుడనను జ్ఞాన రాహిత్యముచేత, కాలాంతరమందు కర్మనాశానంతరము, భగవత్కృపచే కటాక్షితుడై, సదాచార్యు నాశ్రయించి, ఆచార్య కృపచే జ్ఞానము నంది, ఉపాయానుష్ఠానముచేత స్వస్వరూపము నందుచున్నాడు. నిత్యసూరి నిర్వాహకుడైన, అవిచ్ఛిన్న జ్ఞానానందమయుడైన, సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణుని కౌస్తుభ స్థానీయుడు, హృదయస్థుడు, కుమారుడు, శిష్యుడు, శేషభూతుడు, దాసభూతుడు జీవాత్మ. 'జీవాత్మ పురుషాకారుడు కాడు. దేవాకారుడు కాడు. మానవాకారుడు కాడు. పశువృక్షాద్యాకారుడు కాడు. కర్మసంబంధమువలన శరీరాకారాది భేదముల నందుచున్నాడు' అని శ్రుతులు బోధించుచున్నవి. [2]

జ్ఞానసంకోచకర సత్త్వ రజ స్తమో గుణాత్మకమైన ప్రకృతి సంబంధముచే, ప్రకృతి పరిణామ రూపమైన, శరీరేంద్రియముల సంయోగముచే, పాపరూపమైన బంధములచే బంధితుడై, దేహేంద్రియాది పరితంత్రుడగుచున్నాడు జీవాత్మ. ఆ యవస్థలలో మూల ప్రకృతిరూపమోహముచే, అజ్ఞాన, విపరీతజ్ఞాన మనోవ్యాకులముచే పంచేంద్రియ క్రీడాసక్తు డగుచున్నాడు జీవాత్మ.

---

2. "పుమా న్న దేవో ననరో, న పశు ర్నచ పాదపః
శరీరాకృతిభేదా స్తు, భూపైతే కర్మయోనయః."
"నోఽహం దేవో న మర్త్యో వా న తిర్యక్ స్థావరోఽపి వా
జ్ఞానానందమయస్త్వాత్మా శేషో హి పరమాత్మనః."

"పాపం ప్రజ్ఞాం నాశయతి క్రియమాణం పునః పునః
నష్ట ప్రజ్ఞః పాప మేవ పునరారభమేఽర్జున,"

అను రీతిగా - అపరాధ పరంపరలో పరిభ్రమించుచు, గర్భ, జన్మ, జరా, మరణ, నరకాది సంసార చక్రములో పడుచున్నాడు జీవాత్మ.

'నేహాఽభిక్రమ నాశోఽస్తి' అను రీతిగా - కర్మయోగ పరిపక్వ ఫలముచే కల్పాంతర - మన్వంతర - యుగాంతర - జన్మాంతరము లందు, ఒకానొక సమయమున మోక్షమున కనుకూలత నంది, ఆతని వశీకరణము ఆతని శరణాగతియే యని యెరిగి, భగవత్కృపచే విముక్తుడగుచున్నాడు జీవాత్మ.

"స్వయం మృత్పింప భూతస్య పరతంత్రస్య దేహినః
అజ్ఞో జంతు రనీశోఽయం ఆత్మన స్సుఖదుఃఖయోః."

అని శ్రుతి. ఈ జీవాత్మ మృత్పిండమువలె పరతంత్రుడు. అజ్ఞుడైన యితడు తన సుఖ దుఃఖములకు నియామకుడు కాడు' అని భావము. భగవంతునిచే ప్రేరితుడయిన యీ జీవాత్మ - తన కర్మాను గుణముగా స్వర్గ నరకాదులను పొందుచున్నాడు. బాలు డెట్లు బొమ్మ లతో ఆడుకొనుచున్నాడో, అట్లే అప్రమేయుడు, అనియామకుడు, సర్వజ్ఞుడు, సర్వమున కీశానుడునైన సర్వేశ్వరుడు- జీవాత్మ, ప్రకృతి, భూతములతో క్రీడించుచున్నాడు. అందువలన జీవాత్మ, పరతంత్రు డని, ఈతని కర్మానుగుణముగా భగవంతుడు ఇతనిని ప్రవర్తింప చేయుచున్నాడని స్పష్ట మగుచున్నది.

పవిత్రమూర్తియైన పరమాత్మను పొంది, జీవాత్మ పవిత్రు డగుచున్నాడు. విమలుడైన సర్వేశ్వరుని పొంది, విమలు డగు చున్నాడు. ఈ ప్రకారముగా పరమాత్మను పొంది, పరమాత్మయొక్క ధర్మములను జీవాత్మ పొందుచున్నాడు. పరమాత్మ నందుటకు జీవాత్మకు అవిద్యా కర్మ వాసనాదులు ప్రతిబంధకములు. సర్వజ్ఞ

డయిన పరమాత్మ నెరిగి జీవుడు, జ్ఞాని యగుచున్నాడని శ్రుతులు తెలుపుచున్నవి.[3]

## జీవాత్మ భేదములు

ఈ విధమైన జీవాత్మ రామానుజ దర్శనానుసారము మూడు విధములు. నిత్యులు, ముక్తులు, బద్ధులు అని. బద్ధు లనగా అనాది కర్మపరంపరా ప్రభావముచే ఎల్లప్పుడు సంసార సాగరమందు నిబద్ధులయిన బ్రహ్మాది స్తంబ పర్యంతము[4] విభక్తులయిన చేతనులు. బద్ధులు దేవ, మనుష్య, తిర్యక్, స్థావరము లని నాల్గువిధములు అని యొక పక్షము. జరాయుజ, అండజ, ఉద్భిజ్జ స్వేదజములని నాల్గు విధములు అని మరియొక పక్షము. దేవతలు, మనుష్యులు, జరాయుజులు. వారిలో, బ్రహ్మ - రుద్ర - సనకాదులు అయోనిజులు. సామాన్య మానవులు తిర్యగాదులు యోనిజులు. అండజు లనగా - గ్రుడ్డు నుండి జనించు పక్షులు, పాములు మొదలగునవి. ఉద్భిజ్జము లనగా - భూమిని ఛేదించుకొని జనించు చెట్లు మొదలగునవి. స్వేదజము లనగా - చెమట మొదలగు దుర్గంధమువలన జనించు క్రిమికీటకాదులు. ఈ విధముగా బద్ధులు అనాదిగా కర్మవాసనా, ప్రకృతి సంబంధములచే చక్రమువలె పరిభ్రమించుచు, జన్మ మరణా ద్యవస్థలచే పీడితుడగు చున్నారు. ఈవిధమైన బద్ధులు శాస్త్ర వశ్యులు, శాస్త్ర అవశ్యులు అని రెండు విధములు. జితేంద్రియులైన, జ్ఞానులైన బద్ధులకు శాస్త్ర వశ్యత్వ ముండును. తిర్యక్ స్థావరాదులకు శాస్త్రవశ్యము లేదు. శాస్త్ర వశ్యులు కూడ రెండు విధములు. బుభుక్షువులు, ముముక్షువులు అని. బుభువులందు - అర్థకామాసక్తులు, ధర్మకామాసక్తులు అని రెండు

---

3. "పరేణ పరధర్మీ చ భవత్యేష సమేత్యవై
   విశుద్ధ ధర్మ శుద్ధేన బుద్ధేన చ న బుద్ధిమాన్."
   "బ్రహ్మవిదాప్నోతి పరమ్."

4. 'స్తంబము' అనగా - సూక్ష్మ కీటకము.

విధములు. ధర్మార్థకామపురుషార్థాసక్తులు బుభుక్షువులు. మోక్షపురుపురుషార్థాసక్తులుముముక్షువులు. అర్థకామ పురుషార్థాసక్తులు అర్థకామాసక్తులు. ధర్మపురుషార్థాసక్తులు ధర్మాసక్తులు. అర్థకామాసక్తులు దేహాత్మాభిమానులు. ధర్మాసక్తులు యజ్ఞ దాన తపో తీర్థయాత్రాదిఅలౌకిక పుణ్యకార్యాసక్తులు. 'అలౌకిక శ్రేయస్సాధనం ధర్మః' 'చోదనాల్లక్షణోఽర్థో ధర్మః'' అను లక్షణలక్షితమైనజ్ఞానముచే దేహాతిరిక్తమైన ఆత్మయున్నదనియు పరలోకమున్నదనియు యెరిగిన జ్ఞానులైనధర్మాసక్తులు - దేవతాంతరపరులు, భగవత్పరులు అని రెండు విధములు. బ్రహ్మ, రుద్ర, ఇంద్రాది దేవతాంతరారాధనపరులు దేవతాంతగపరులు. 'ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ'' అనునట్లు భగవత్పరులు మూడు విధములు. ఆర్తుడనగా - భ్రష్టైశ్వర్యకాముడు. అర్థార్థియనగా - అపూర్వైశ్వర్య కాముడు. జిజ్ఞాసు వనగా - ప్రకృతివియుక్తాత్మ స్వరూపకాముడు. భగవత్ప్రాప్తికాములు భగవత్పరులు.

మోక్షపరులు, కైవల్యపరులు అని ముముక్షువులు రెండు విధములు. జ్ఞానయోగ మవలంబించి, ప్రకృతిసంబంధమునుండి విముక్తుడైన ఆత్మస్వరూపానుభవము కైవల్యము. ఆ యనుభవజ్ఞులు కైవల్యపరులు. అర్చిరాది మార్గమున పరమపదము నంది, అచ్చటొకచోట పతి విడచిన పత్నివలె ఆత్మానుభవము నందినవారు కైవల్యపరులు.

మోక్షపరులు రెండు విధములు. భక్తులు, ప్రపన్నులు అని. వేద వేదాంగ వేదాంతాధ్యయనానంతరము,పూర్వోత్తరమీమాంసా జ్ఞానముచే చిదచిత్తుల విలక్షణత్వమును, అత్యంతానందస్వరూపుడును, నిఖిల హేయప్రత్యనీకుడును, అనంత కల్యాణగుణాత్మకుడైన పరమాత్మస్వరూపము నెరిగి, పరమాత్మను పొందుటకు ఉపాయమైన భక్తితో మోక్షమును కోరువారు భక్తులు.

## ప్రపన్నులు

మరియొక సాధనము లేదని 'మరియొక రక్షకుడు లే' డను ఆత్మ విశ్వాసముతో పరమాత్మ నాశ్రయించినవారు ప్రపన్నులు. ప్రపన్నులుకూడ రెండువిధములు. త్రైవర్ణికపరులు, మోక్షపరులు అని. భగవంతునినుండి ధర్మార్థకామము లభిలషించువారు త్రైవర్ణిక పరులు, సజ్జన సహవాసమువలన నిత్యానిత్య, పరాపరవస్తువివేకవంతులై, మోక్షేచ్ఛచేత దాని నందుటకు సదాచార్యు నాశ్రయించి, భక్త్యాద్యుపాయానుష్ఠానాశక్తుడై, భగవచ్చరణారవిందము లాశ్రయించిన వారు మోక్షేచ్ఛాపరులు. వారలే ప్రపన్నులు. సర్వవర్ణ స్త్రీపురుషులకు ప్రపత్తియం దధికారము కలదు. రామాయణ, భారత, వత,భాగ పుణ్యపురాణాదులందు ప్రపత్తి యనబడుశరణాగతి - విభీషణ, అర్జున, గజేంద్ర, ప్రహ్లాదాది పరమభాగవతోత్తముల పవిత్ర చరిత్రముల మూలమున స్పష్టమగు చున్నది. ప్రపన్నులు కూడ రెండు విధములు. ఏకాంతులు, పరమైకాంతులు అని. ఎవరు మోక్షఫలముతో కూడ ఫలాంతరములను భగవంతునినుండి ఆశింతురో, వారు ఏకాంతులు. భక్తిజ్ఞానాదులకంటెను మరియొక ఫలమును భగవంతునినుండి ఎవ రాశింపరో, వారు పరమైకాంతులు. దృప్తులు, ఆర్తులు, అని పరమైకాంతులు రెండు విధములు. ప్రారబ్ధకర్మల ననుభవించుచు, దేహావసాన సమయమందు మోక్ష మపేక్షించువారు దృప్తులు. జాజ్వల్యమానమైన అగ్నిమధ్యలోవలె సంసార స్థితిని తలచి, అతి దుస్సహముతో అవశ్యము మోక్షము కోరువారు ఆర్తులు.

## మోక్షము

మోక్ష మనగా - సాయుజ్యము. సాయుజ్య మనగా - పరమాత్మతో సమానమైన భోగముల ననుభవించుట. యని యర్థము.

'సమానో యుక్ యోగో యస్య సః స యుక్, తస్య భావః సాయుజ్యమ్...' అని దీని వ్యుత్పత్తి. సాలోక్య,సామీప్య,సారూప్యములు ఫలాంతరములు. సాయుజ్యమే మోక్షము. 'మమ సాధర్మ్యమాగతాః' అను దాని కిదియే అర్థము.

"లోకేషు విష్ణో ర్నివసంతి కేచిత్, సమీప మృచ్ఛ న్తి చ కేచి దన్యే
అన్యే తు రూపం సదృశం భజ న్తే సాయుజ్య మన్యే స తు మోక్ష ఉ క్తః."

అను శ్రుతివలన, సాయుజ్యమే మోక్షమని స్పష్టమగుచున్నది. ము క్తులు భగవత్సంకల్పానుసారము స్వేచ్ఛగా అంతటను సంచరింతురు,

నిత్యులనగా-సవయస ఇవ యే 'నిత్యనిర్దోషగంధాః' అనునట్లు. అనాదికాలముగా జ్ఞానసంకోచరహితులై, సంసారానుజ్ఞానులై యున్న అనంత, గరుడ, విష్వక్సేనాదులు. ఈ విధముగా - బద్ధ, ము క్త, నిత్యులుగా నున్న జీవాత్మ యను చి త్తత్వ స్వరూపము నిరూపింపబడినది.

## అచి త్త త్త్వ స్వరూప నిరూపణము

అచి త్తనగా - చిద్భిన్నమైన ప్రకృతి. ప్రకృతికి ప్రధానమని నామాంతరము. చి త్తును జీవాత్మకు శరీరము ప్రకృతి. ప్రకృతికి శరీరి జీవుడు. జ్ఞానశూన్య వికారస్పదమైనది ప్రకృతి. వికారములను కల్గించునుగాన ప్రకృతి యనబడును. 'వికారాన్ ప్రకరోతీతి ప్రకృతిః' అని. స త్త్వ రజ స్తమోగుణత్రయాశ్రయమైనది ప్రకృతి. స త్త్వ రజ స్తమస్సులు మూడును కలసి అవ్య క్త మనబడుచున్నది. మహదహంకార, మనో, ఇంద్రియ, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ ములు, పృథివ్య ప్తేజో వాయ్వాకాశము లని బహు విధములుగా పరిణమించినది ప్రకృతి. బద్ధజీవుల విపరీత జ్ఞానోత్ప త్తికి భగవంతుని సాధనము ప్రకృతి. నిత్యా, అక్షరా, అవిద్యా, మాయా మొదలగు శబ్దములచే వ్యవహరింపబడుచున్నది ప్రకృతి. 'మమ మాయా దురత్యయా' అని భగవంతునిచే గీతలో స్వయముగా చెప్పబడినది. అందు వలననే ప్రకృతికి వశ్యుడగుచున్నాడు జీవుడు.

ప్రకృతియందలి గుణములు భగవత్సంకల్పమువలన వైషమ్యమును, సృష్ట్యనుకూలముగా అవస్థను పొందుచున్నవి. ఆ అవస్థయే అవ్యక్త మనబడుచున్నది. ఆ అవ్యక్తమునుండి మహత్తత్త్వము ఉత్పత్తి యగుచున్నది. మహత్తత్త్వము - సాత్త్విక, రాజస, తామసములనిమూడువిధములు. గుణత్రయాశ్రయమైనఅవ్యక్తమందు సత్త్వాది గుణోన్మేషమువలన సాత్త్వికాది మహత్తత్త్వము పుట్టుచున్నదని భావము. మహత్తత్త్వమునే బుద్ధియందురు. మహత్తునుండి అహంకారము పుట్టును. అహంకారముకూడ సాత్త్వికాహంకారము, రాజసాహంకారము, తామసాహంకారము అని మూడు విధములు. దేహాత్మాభిమానము మొదలగునవి అహంకారముచేతనే కలుగును. దాని నుద్దేశించి గీతలో భగవంతునిచే నిట్లు చెప్పబడినది :-

"త్రివిధా భవతి శ్రద్ధా, దేహినాం సా స్వభావజా ।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు."(గీత :17-2)

దేహధారు లందరికినిమూడు విధములైన శ్రద్ధ కలుగుచున్నది. అది స్వభావముగనే కలుగును. సాత్త్వికీ, రాజసీ, తామసీ,యని శ్రద్ధ మూడు విధములు. సాత్త్వికాహంకారమునకు వైకారికమనియు, రాజసాహంకారమునకు తైజసమనియు, తామసాహంకారమునకు భూతాదు లనియునామాంతరములు. అహంకారములలో-రాజసాహంకారముతో కూడిన సాత్త్వికాహంకారమువలన జ్ఞానేంద్రియ పంచకము,కర్మేంద్రియ పంచకము, మనస్సు అని పదునొకండు ఇంద్రియములు కలుగుచున్నవి.

సాత్త్వికాహంకార ఉపాదాన ద్రవ్యకత్వము ఇంద్రియ లక్షణము. ఇంద్రియోత్పత్తికి రాజసాహంకారము సహకారి కారణమే కాని, ఉపాదాన కారణము కాదు. జ్ఞాన ప్రసరణ శక్తి కల్గిన ఇంద్రియము, జ్ఞానేంద్రియము. కళ్లు, నాలుక, ముక్కు, చర్మము, చెవి

మనస్సు, ఇవి యారును జ్ఞానేంద్రియములు. వాక్కు, పాణి, పాదము, పాయువు ఉపస్థ - ఇవి యారును కర్మేంద్రియములు.

రాజసాహంకార సహాయముతో కూడిన తామసాహంకారము నుండి పంచ తన్మాత్రలు, పంచ భూతములు ఉత్పత్తి యగుచున్నవి. తామసాహంకారమునుండి భూతముల కుపాదానమైన, అవ్యవహిత మైన, సూక్ష్మమైన విశిష్ట ద్రవ్య మొకటి ఉద్భవించును. అదియే తన్మాత్ర. అయ్యదియే భూతముగా పరిణమించును. కనుకనే, క్షరణ శీలత్వము చేతను, ప్రతి క్షణము పరిణామమును చెందుట చేతను ప్రకృతి - క్షర మనబడుచున్నది. విశిష్టమైన శబ్దాది విషయముల కాధారమైనది భూత మనబడును. శబ్దతన్మాత్రము, స్పర్శతన్మాత్రము, రూపతన్మాత్రము, రసతన్మాత్రము, గంధతన్మాత్రము అను పంచతన్మాత్రలు పంచ భూతములుగా పరిణమించుచున్నవి. పృథివ్యప్తేజో వాయ్వాకాశ ములు పంచభూతములు.

ప్రకృతి, మహత్తు, అహంకారము, ఏకాదశేంద్రియములు, పంచ తన్మాత్రలు, పంచభూతములు అని ఇరువది నాల్గు తత్త్వములతో కూడి నది అచిత్తు. ఈ విధముగా విడదీయుటకు వీలులేని విధముగా ప్రకృతి యను అచిత్తు, చిత్తను జీవాత్మకు శరీర మనబడుచున్నది. అచిత్తునకు శరీరి చిత్తు. ఇరువదినాల్గు తత్త్వములు సృష్టి, సమష్టి సృష్టియే. సమష్టి సృష్టి యనంతరము పంచీకృత పంచభూతములచే బ్రహ్మాండ సృష్టి యారంభ మగును. ప్రకృతి వలన మహదాదుల ఉత్పత్తి. అనగా - అవస్థాంతరము నొందుటయే. పాలు ఎట్లు పెరుగుగా పరిణ మించునో - అట్లే, పూర్వావస్థ సంబంధముచేత కారణ మనియు, ఉత్తరావస్థ సంబంధముచేత కార్య మనియు, కార్య కారణ భావము వ్యవహృత మగుచున్నది.

పరమాత్మకు భోగ్యము, భోగోపకరణము, భోగస్థానము, ప్రకృతి. 'భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా' ఇత్యాది ప్రమాణ

ముల వలన, చిత్తను జీవాత్మ పరమాత్మచే ప్రేరేపింపబడినవాడై భోగ్యభూతమైన ప్రకృతిని భుజించుచున్నాడనియు, ఆ భోజనము వలన బంధింపబడుచున్నాడనియు, స్పష్టమగుచున్నది.

"అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్, తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః."
"మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్."

అను ప్రమాణముల వలన, మాయీ అనగా - పరమాత్మ యనియు, మాయ యనగా - ప్రకృతి యనియు, స్పష్టమగుచున్నది. 'అన్యః' అనగా - జీవుడు. అందువలన, చిదచిదీశ్వర తత్త్వత్రయ మచ్చట పేర్కొనబడినది. పరమాత్మ, ప్రకృతి యను సాధనముచే జగత్తును సృజించుచున్నాడు. పరమాత్మకంటెను అన్యుడైన జీవుడు ప్రకృతి యను సాధనముచే బంధింపబడుచున్నాడు అని స్పష్టము. ఇచట పరమాత్మయొక్క బంధకత్వము, జీవుని బంధితత్వము (బధ్యత్వము) ముఖ్యాంశములు. ప్రకృతియొక్క సృష్టివిస్తరము విష్ణుపురాణమునందు చక్కగా వివరింపబడినది. ఆ విషయ విధానమే భగవద్రామానుజులచే స్పష్టముగా చెప్పబడినది.

## అచిత్తు భేదములు

ఈ విధమగు అచిత్తను ప్రకృతి - శుద్ధసత్త్వము, మిశ్రసత్త్వము, సత్త్వశూన్యము అని మూడు విధములు. శుద్ధసత్త్వమనగా రజస్తమశ్శూన్యమైన ద్రవ్యవృత్తి సత్త్వము. రజస్తమో రహితమైన సత్త్వాశ్రయము. శుద్ధసత్త్వము అప్రాకృత మండలము. అదియే నిత్యవిభూతి, పరమపదము శ్రీవైకుంఠము.

శుద్ధసత్త్వము కోటిసూర్యప్రతీకాశ జ్యోతిర్మయమై, భగవత్సంకల్పానుసారముగా - రథ, గోపుర, మంటప, విమాన, ఉద్యాన, పద్మిన్యాదులుగా పరిణమించుచున్నది. శుద్ధసత్త్వమును చేరినవారికి పునరావృత్తి లేదని - 'న చ పునరావర్తతే' అను శ్రుతి చెప్ప

చున్నది. శుద్ధసత్త్వము నందుటకు అర్చిరాది మార్గము సాధన మని అభియుక్తాగ్రేసరులచే ఈవిధముగా స్పష్టము చేయబడినది.

"సత్సంగాద్భవ నిస్స్పృహో గురుముఖా చ్ఛ్రీశంప్రపద్యాత్మవాన్
ప్రారబ్ధం పరిభుజ్య కర్మ శకలం ప్రక్షీణకర్మాంతరః
న్యాసాదేవ నిరంకుశేశ్వర దయానిర్లూన మాయాన్వయో
హార్దానుగ్రహ లబ్ధ మధ్య ధమని ద్వారా బహి ర్నిర్గతః."

"ముక్తోర్చిర్దిన పూర్వపక్ష షడు ఙ్మాసాబ్ద వాతాంశుమత్
గ్లౌ విద్యు ద్వరుణేంద్ర ధాతృమ.హితః సీమ స్త సింధ్వా ప్లుతః
శ్రీ వైకుంఠ ముపేత్య నిత్య మజడం తస్మిన్ పరబ్రహ్మణః
సాయుజ్యం సమవాప్య నందతి సమం తే నైవ ధన్యః పుమాన్."

ఈ శ్లోకములందు తత్త్వహిత పురుషార్థ నిరూపణము, అర్చిరాది మార్గము చక్కగా నిరూపింపబడినది.

అర్చావతారము లనగా – భగవంతుడు ఆవహించిన, స్వయముగా వెలసిన, మహర్షి ప్రతిష్ఠితములైన విగ్రహములు. అర్చిరాదిమార్గము ననుసరించియే ముక్తపురుషుడు విష్ణు నివాస స్థానమైన పరమపదము నందుచున్నాడని కార్యాధికరణావసానమందు - శ్రుత ప్రకాశికలో, సుదర్శనాచార్యులవారిచే బాగుగా వివరింపబడినది. ఛాందోగ్య, కౌషీతకి, బృహదారణ్యకోపనిషత్తులందు అర్చిరాది మార్గము వినబడుచున్నది. 'అగ్నిర్జ్యోతి రహశ్శుక్లః' 'తత్ర ప్రయాత గచ్ఛన్తి' అని భగవద్గీతయందును అర్చిరాదిమార్గము చెప్పబడుచున్నది. అర్చిరాది మార్గముద్వారా, పరమాత్మ సాన్నిధ్యము నందినచో, పునరావృత్తి లేదని తెలుపుచు, వైకుంఠ గద్యమందు పరమపదము మనోహరముగా వర్ణింపబడినది. అది - కవితాత్మక వర్ణనము కాదు. శ్రుతి స్మృతి, తిహాస, పురాణ, ప్రమాణ వాక్యములచే చెప్పబడినది. అది అపరాదిశేషులైన భగవద్రామానుజులచే దర్శింపబడి, సంస్తుతింపబడినది.

మిశ్రసత్త్వము ప్రాకృత మండలము. జగత్సృష్టికి మూలము సాంఖ్య దర్శనములో చెప్పిన రీతిగా మహదాదిభూత పర్యంతము తత్త్వసృష్టి. సర్వమును మిశ్రసత్త్వమువల్లనే సంభవించుచున్నది.

సత్త్వశూన్యము కాలము. పరమపదమందు సత్త్వశూన్యము లేదనికొందరి యభిప్రాయము. ఉన్నను, భగవత్సంకల్పానుసారముగ ప్రవర్తించుచుండునని మరి కొందరి మతము.

## ఈశ్వర తత్త్వ నిరూపణము

శ్రీ రామానుజ దర్శనమున ప్రధానమయిన తత్త్వము ఈశ్వర తత్త్వము. ఈశ్వరు డనగా - పరమాత్మ. ప్రశాసన పూర్వక వ్యాప్త్యాధారుడు, సర్వ నియామకుడు, స్వతంత్రుడు, చేతనుడు, శక్తిమంతుడు, నియంత, పరమాత్మ. సర్వేశ్వరత్వము, సర్వశేషిత్వము, సర్వకర్మ సమారాధ్యత్వము, సర్వఫలప్రదత్వము, సర్వాధారత్వము, సర్వకార్యోత్పాదకత్వము, సర్వశబ్దవాచ్యత్వము, సర్వజ్ఞానవిషయత్వము మొదలగునవి ఈశ్వరుని లక్షణములు. జగత్తున కుపాదాన కారణము, నిమిత్త కారణము ఈశ్వరుడే.

సృష్టికి పూర్వము-'నేను బహువిధములుగా నయ్యెద' నని, ఈశ్వరుడు సంకల్పించి, ఆ సంకల్పమాత్రముచేతనే సర్వము సృజించి, నామ రూపములతో వ్యవహరించెదనని, దానిలో తాను ప్రవేశించి, బహు విధములుగా మారెను. అ విధముగా సంకల్పించుటవలన, నిమిత్త కారణము, తానే సృజించుకొని - తానే ప్రవేశించుటచేత, ఉపాదానకారణము కూడ తానే యగుచున్నాడు. అంతటను ఆవహించి. ప్రవర్తింపజేయుటచేత, అంతర్యామి యనబడుచున్నాడు. ఈశ్వరుడు, బ్రహ్మ, విష్ణువు మొదలగు బహు నామములు కల్గిన పరమాత్మ ఎవ రనగా? శ్రుతులు ఈ విధముగా వివరించుచున్నవి :- 'దేనినుండి ఈ భూత

ములు పుట్టుచున్నవో, దేనివలన లయ మగుచున్నవో - అది బ్రహ్మ, దానిని తెలుసుకొనుము. ఈ సర్వభూతములందలి యంతరాత్మ అపహత పాప్మత్వముకల దివ్యుడైన, దేవుడయిన ఒక్కడే నారాయణుడు' అని.

ఎవరి కాత్మ శరీరమో, ఎవరికి పృథివ్యప్తేజో వాయ్వాకాశ మనస్సులు శరీరములో, వీని అన్నిటికిని శరీరి ఎవరో - అతడే బ్రహ్మ, పరమాత్మ, నారాయణుడు. అట్టి నారాయణుడు - సచ్ఛబ్దవాచ్యుడు, సర్వశబ్దవాచ్యుడు' అని శ్రుతులు బోధించుచున్నవి.

"ఏకోహవై నారాయణ ఆసీత్, న బ్రహ్మ నేశానో నేమే ద్యావా పృథివీ."

ఇత్యాది శ్రుతులచేత - సత్, బ్రహ్మ, ఆత్మ మొదలగు పరమ కారణవాచ్య శబ్దములచే నారాయణుడే చెప్పబడుచున్నాడు. సర్వ శబ్దవాచ్యు డతడు.

"సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్
విశ్వం నారాయణం దేవం అక్షరం పరమం పదమ్."

అని, సర్వశాఖలయందును పరతత్త్వ ప్రతిపాదన పరములయిన అక్షర, శివ, శంభు, పరబ్రహ్మ, పరంజ్యోతి, పరతత్త్వ, పరాయణ, పర మాత్మాది శబ్దము లన్నియు ఆ యా గుణములచే నారాయణునియందే ప్రయుక్తము లగుచే ఆతని విభూతిత్వమును ప్రతిపాదించుచున్నవి.

సర్వ శబ్దములచేతను నారాయణుడే చెప్పబడుచున్నాడని ఈ శ్రుతులు స్పష్టము చేయుచున్నవి.

"అగ్నిర్వై దేవానా మవమః, విష్ణుః పరమః, తదంతరేణ సర్వే అన్యా దేవతాః."
అగ్ని రవమో దేవతానాం విష్ణుం పరమః."
"అస్యేశానా జగతో విష్ణుపత్నీ."
"సోఽధ్వనః పార మాప్నోతి, తద్విష్ణో పరమం పదమ్."
"యే త్వన్యదేవతా భక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః
తేఽపి మా మేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్." (గీత : 9-23)

అనుటచే, సర్వదేవతలంమును శ్రీమన్నారాయణుడే అంతరాత్మగా నుండెనని స్పష్టమగుచున్నది.

"నారాయణో ఒక్షరో ఒనంతః సర్వవ్యాపీ నిరంజనః
తేనేద మఖిలం వ్యాప్తం జగత్ స్థావర జంగమమ్."

అనుటచే, దేవత లందరిలో విష్ణువు ప్రథము డనియు, ఈ విష్ణువు యొక్క పత్నియగు లక్ష్మీదేవియే జగత్తునకు మహారాజ్ఞి యనియు, నారాయణునిగాక, ఇతర దేవతల నారాధించినను, అది పరోక్షముగ నారాయణారాధనయే యనియు, సర్వదేవతలంమును శ్రీమన్నారాయణుడే అంతరాత్మగా నుండెననియు స్పష్టమగు చున్నది.

"తత స్స్వయంభూ ర్భగవాన్ అవ్యక్తో వ్యంజయ న్నదన్
మహాభూతాది వృత్తౌజాః ప్రాదు రాసీ త్తమోనుదః."

భగవంతుడు స్వయంవ్యక్తుడని పై పంక్తులు వ్యక్తము చేయుచున్నవి.

"జగత్ప్రభుం దేవదేవం అనన్తం పురుషోత్తమమ్
స్తువ న్నామ సహస్రేణ పురుష స్సతతోత్థితః."
అనాదినిధనం విష్ణుం సర్వలోక మహేశ్వరమ్
లోకాధ్యక్షం స్తువ న్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్."

అని యుధిష్ఠిరునితో భీష్ముడు చెప్పెను. జగత్ప్రభువు, దేవదేవుడు, అనంతుడు, పురుషోత్తముడు అయిన శ్రీ మహావిష్ణువు అనాది పురుషుడు, లోకాధ్యక్షుడు, సర్వవ్యాపకుడు, అజాతుడు. అతని నామ స్మరణముచే సర్వ దుఃఖములు నశించును.

## పరమాత్మ కల్యాణ గుణములు

ఈ రీతిగా విష్ణువుయొక్క సర్వశబ్ద వాచ్యత్వము, సర్వాంతర్యామిత్వము, స్వేతర సమస్త వస్తు విలక్షణత్వము, సర్వకల్యాణ గుణాకరత్వము, సకల జగ దుదయ విభవ లయ లీలత్వము స్పష్ట

మగుచున్నవి. సత్యత్వ, జ్ఞానత్వ, అనంతత్వ, ఆనందత్వ, అమలత్వా దులు పరమాత్మయొక్క స్వరూప నిరూపక ధర్మములు.

"మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే స చరాచరమ్
హేతునానేన కౌంతేయ ! జగద్విపరివర్తతే ." (భ.గీ.9-10)

అను శ్లోకముచేత, భగవదాజ్ఞానుసారముగ జగత్సర్వము ప్రవర్తించు నని స్పష్టమగుచున్నది. అతని యాజ్ఞచే వాయువు వీచుచున్నది. నదులు ప్రవహించుచున్నవి. సూర్యు డుదయించుచున్నాడు. అగ్ని, ఇంద్రుడు, మృత్యువు తమ తమ కృత్యములను భగవదాజ్ఞాబద్ధులై నిర్వహించుచున్నారు. అందువలన, జగదాధారుడు పరమాత్మ యని -

"విశ్వతః పరమం నిత్యం విశ్వం నారాయణం హరిమ్."
"తద్విష్ణోః పరమం పదమ్".

అనుటవలన, ఆ పరమాత్మ - పరమపురుషుడు అయిన శ్రీమన్నారాయణుడే యని స్పష్ట మగుచున్నది. పై జెప్పబడిన ఈశ్వర లక్షణము లన్నియు శ్రీమన్నారాయణునియం దుండుటవలన, ఆ భగవానుడు - అపరిచ్ఛేద్య జ్ఞానానందామలత్వ స్వరూప జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజ స్సౌశీల్యా ద్యనవధికాతిశయాసంఖ్యేయ విశేష విశిష్టు డనియు, నిరతిశయ కల్యాణ వివిధ అనంత దివ్యభూషణు డనియు, రూప, గుణ, విభవ, ఐశ్వర్య, శీలా ద్యనవధికాతిశయ అశేష విశేష విశిష్టుడనియు స్పష్టమగుచున్నది. భగవానుని ఈ రూప గుణ విశేషములు - శ్రుతి స్మృతీతిహాస పురాణ ప్రమాణ వాక్యములచే చెప్పబడుచున్నవి. వాని నన్నిటిని సమ్మేళితము చేసి, భగవత్స్వరూపమును లోకమునకు దర్శింపజేసిన శ్రీమద్రామానుజులు అపరాదిశేషులగుటచేతనే సంభవ మయిన దనుట అతిశయోక్తి కానేరదు. వేదార్థ సంగ్రహ, గద్యత్రయ, పంచస్తవములందు భగవత్స్వరూపము బాగుగా వివరింపబడినది.

## పరమాత్మ ప్రభేదములు

ఈ విధమయిన పరమాత్మ నారాయణుడు - పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారము లను పేర్లతో ఐదు విధములుగాఅవతరించి, అజ్ఞుల ననుగ్రహించుచున్నాడు.

**1) పరత్వము :-** త్రిపాద్విభూతి యనబడు శ్రీ వైకుంఠము నందుదివ్యాలయమున, దివ్యమహామణి మండపమున, శేషశాయి యయిన నారాయణుడు పరతత్త్వము. ఆ వైకుంఠధామము - కుముద, కుముదాక్ష, పుండరీక, వామన, శంకుకర్ణ, సర్పనేత్ర, సుముఖ, సుప్రతిష్ఠాదులచే, దివ్యాయుధ - దివ్యభూషణ దివ్య పరిజన - దివ్యపరిచ్ఛేదములతో కూడిన నగరపాలకులచే రక్షింపబడుచుండును. అందలి దివ్యాలయము చండ, ప్రచండ, భద్ర, సుభద్ర, జయ, విజయ, ధాతృ, విధాతృ లగు ద్వారపాలకు లచే రక్షిత మగుచుండును. అందలి నారాయణుడు దివ్యమంగళ విగ్రహ విశిష్టుడు, చతుర్భుజుడు, శ్రీ భూ నీళా సమేతుడు, శంఖ, చక్ర, గదా, శార్ఙ్గ, కౌమోదకీ దివ్యాయుధ సముపేతుడు, కౌస్తుభ మణి కాంతి విరాజిత విశాల వక్షస్స్థలుడు, చారు పీతాంబర ధరుడు, అనంత - గరుడ - విష్వక్సేనాదులచేత స్తోత్రము చేయబడుచుండును. ఈ విధమయిన పరమాత్మ - పరబ్రహ్మ, పరంజ్యోతి యయిన నారాయణుడే పరతత్త్వము.

**2) వ్యూహము :-** వ్యూహ మనగా - ఉపాసనార్థము, జగత్సృష్ట్యర్థము వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ లనబడు నాల్గు విధములుగా నున్న నారాయణుడు. మొదటి వ్యూహము వాసుదేవ వ్యూహము. సర్వభూతములందును వసించుచుండును. జ్ఞాన, శక్తి, బల. ఐశ్వర్య, వీర్య, తేజోరూప షాడ్గుణ్య పరిపూర్ణుడు వాసుదేవుడు. ముక్త పురుషులకు అనుభావ్యుడు.

రెండవది సంకర్షణ వ్యూహము. సంకర్షణుడు పాతాళమునం దుండి, లోక సంహారకులయిన రుద్ర, యమ, మృత్యు ప్రభృతులను నియమించుచు, మోక్షసాధనమైన జ్ఞానమును ప్రబోధించు చుండును.

మూడవది ప్రద్యుమ్న వ్యూహము. ప్రద్యుమ్నుడు జగత్సృష్టి నిమిత్త ముండును. వీర్యైశ్వర్య గుణములతో బ్రహ్మలోకమునం దుండి, బ్రహ్మ ప్రజాపతులను సృష్టికర్మలయందు ప్రవర్తింప జేయుటయే ప్రద్యుమ్నుని కర్తవ్యము.

నాల్గవది అనిరుద్ధ వ్యూహము. శక్తి తేజో గుణ పరిపూర్ణుడు. అనిరుద్ధుడు. తత్త్వజ్ఞాన రక్షణము అనిరుద్ధుని కర్తవ్యము.

*4) **అంతర్యామి** :-* అంతర్యామి యనగా - జీవునియందు స్వర్గ నరకాదులందు కర్మానుభవమును పొందుచున్నట్టివాడు. సూక్ష్మ ధర్మముతో యోగులకు మాత్రము చూడతగియుండు రూపముతో హృదయమున వసించు భగవద్రూపము అంతర్యామి. జీవునిలో నున్నను, జీవగత దోషములు అంతర్యామిని స్పృశించవు.

*5) **అర్చావతారము** :-* ఆశ్రితుల కభీష్టమైన లోహము, శిలా, దారు విగ్రహములందు అప్రాకృత రూపములతో ఆవేశించియుండి, అజ్ఞ జనుల ననుగ్రహించుచుండు అర్చావతారములు ఆలయము లందలి ప్రతిమలు. షడ్గుణ పరిపూర్ణమయిన అర్చావతారము - స్వయంవ్యక్త, సైద్ధ, దైవ, మానుషములని నాల్గు విధములు.

ఈ విధముగా పర, వ్యూహాది పంచ రూపములతో లక్ష్మీ సహితుడయిన శ్రీమన్నారాయణుడు అంతర్యామిగా నుండి, జనుల ననుగ్రహించుచున్నాడు. ఈ రీతిగా ఈశ్వర తత్త్వము నిరూపింప బడినది.

## మోక్షము - ఉపాయము

జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజ, సౌశీల్య, స్థైర్య, ధైర్య, సామ్య, కారుణ్య, మాధుర్య, గాంభీర్య, ఔదార్య, పరాక్రమము లవంటి అనంత కల్యాణ గుణాత్మకుడయిన భగవంతుని ప్రాప్తించుటయే మోక్షము. మోక్షమే పరమ పురుషార్థము. మోక్షమునకు సామాంతరమే ముక్తి. పరమాత్మానుభవమే మోక్షము. నిర్దుఃఖమయిన, నిరతిశయమయిన, ఆనందరూపమయిన భగవదనుభవము మోక్షము.

మోక్షము, ముక్తి, కైవల్యము అనబడు ఈ భగవత్ప్రాప్తికి - కర్మ, జ్ఞాన, భక్తి యోగములు ఉపాయములు. అయినను, వానిలో - శ్రేష్ఠమైనది. భక్తి యోగము భక్త్యైక లభ్యుడు భగవానుడు. ఐకాంతిక, ఆత్యంతిక భక్తి యోగముచే భగవంతుని ప్రాప్తి కల్గును. 'భక్త్యా లభ్యస్త్వనన్యయా' అని భగవానుని చేత నేస్వయముగ చెప్పబడినది. జ్ఞానయోగ, కర్మయోగముల చే అంతఃకరణము సంస్కృతీకరింపబడగా, భక్తి సాధ్యమగును అని రామానుజ భాష్యము. వర్ణాశ్రమ ధర్మ నిర్వహణము కర్మయోగము. ఆత్మానాత్మ వివేకము, పరమాత్మ యొక్క స్వరూపావగాహనము జ్ఞానయోగము. పరమపురుషుడైన, అనంత కల్యాణగుణాత్మకుడైన నారాయణు నెరింగి, ఇతరానాసక్తిచే అనవరతి నిరతిశయ ధ్యానము చేయుటయే భక్తియోగము. కర్మ, జ్ఞాన యోగములు భక్తిమూలముననే మోక్షసాధనము లగుచున్నవి.

### భక్తియోగము

యోగ మనగా - యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి యను ఎనిమిది అంగములతో కూడిన తైలధారవలె అవిచ్ఛిన్నమైన స్మృతికి సంతానము వంటిది. యమము లనగా-అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము మొదలగునవి.

స్థిర సుఖకరములయిన పద్మాసనాదులు ఆసనములు. శ్వాస బంధనము ప్రాణాయామము. ఇంద్రియ నిగ్రహము ప్రత్యాహారము. ధ్యేయమునందు స్థిరచిత్తముండుట ధారణము. ధ్యేయమునందు నిరంతర జ్ఞానోత్పత్తి చేయుట ధ్యానము. ధ్యేయమునందు చిత్తైకాగ్రతను పొందుట సమాధి.

## ప్రపత్తి

మోక్షమునకు మరియొక యుపాయము ప్రపత్తి. ప్రపత్తి నవలంబించినవారే ప్రపన్నులు. ఈ విధముగా - పరవ్యూహాది పంచ రూపములతో లక్ష్మీసహితుడైన శ్రీమన్నారాయణుడు అంతర్యామిగా నుండి, జీవ జగత్తుల ననుగ్రహించుచున్నాడు. జీవ జగ ద్విశిష్టమగు పరమాత్మైకత్వప్రతిపాదకమే రామానుజ దర్శనము. స్థూల సూక్ష్మ చేతనాచేతన విశిష్టమగు పరబ్రహ్మయే రామానుజ దర్శనమున ముఖ్య తత్త్వము.

## ప్రమాణములు

రామానుజ దర్శనమునందు సర్వపదార్థములును ప్రమాణము, ప్రమేయము అని రెండు విధములు. ప్రత్యక్ష, అనుమాన, శబ్దములని; ప్రమాణములు మూడు విధములు. ఉపమాన, అర్థాపత్తి, అనుపలబ్ధి అను ఇతరులచే చెప్పబడు ప్రమాణములు వీనియందే అంతర్లీన మగును. సాక్షాత్కారి యగు ప్రమాత్మక జ్ఞానమునకు కరణము ప్రత్యక్షము. అనుమాన శబ్దములు సాక్షాత్కారి జ్ఞాన జనకములు కావు. ఇంద్రియ దోషమువలన కలుగుఅన్యథాజ్ఞానము ప్రమాత్మకము కాదు. కావున, అనుమానాది ప్రమాణములును, దుష్టేంద్రియములును ప్రత్యక్షప్రమాణము లక్షణమునకు విషయములు కావు. సాక్షాత్కారి యనగా - ఇంద్రియ జన్యమగు ప్రమ కాదు. ముక్తుల, నిత్యుల, పరమాత్మునియొక్క జ్ఞానము ఇంద్రియజన్యము కాదు. కావున, దానియందు వ్యాప్తి సంభవించును. కాబట్టి, లైంగికత్వ,

శాబ్దత్వ, స్మృతిత్వ విరహితమగు జ్ఞానము సాక్షాత్కారియని తెరుగ వలయును.

నిర్వికల్పకము, సవికల్పకము అని ప్రత్యక్షము రెండు విధములు. సప్రకారక జ్ఞానము సవికల్పకము. నిష్ప్రకారక జ్ఞానము నిర్వికల్పకము. ఆత్మ మనస్సుతోను మనస్సు ఇంద్రియముతోను, ఇంద్రియము విషయముతో సంయోగించగా, జ్ఞానము కలుగును. ఈ విధముగా ప్రత్యక్షము లన్నియు సన్నికర్ష జన్యములే. స్మృతికి అనుభవజనిత సంస్కారము మూలము కావున, స్మృతియు ప్రత్యక్ష మూలకమే. ఒక వస్తువును చూచినపుడు ఒక సంస్కారము కలుగును. దానివలన మరియొక సమయమున ఆ వస్తువు జ్ఞాన విషయము మగును. అట్టి జ్ఞానమే స్మృతి.

రెండవది అనుమాన ప్రమాణము. అనుమితికి[5] కరణ మగునది అనుమాన మగును. ఒక హేతువుచే ఒక సాధ్యము నూహించుట యనుమితి. వ్యాప్తమగు వస్తువునకు వ్యాప్తత్వము గలదని తెలిసి కొనుటవలన వ్యాపక విశేషమును తెలిసికొనుట యనుమితి యగును. ధూమముచే అగ్ని నూహించుట.

మూడవది శబ్ద ప్రమాణము. అనగా - అపౌరుషేయములైన వేద, వేదాంతములు, త్రికాలజ్ఞులైన మహర్షులచే స్మరింపబడిన వేదార్థప్రతిపాదక స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, శిక్షా, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తములు ధర్మశాస్త్రములు ప్రమాణ గ్రంథములు. వేదోపబృంహణ రూపము లగుటచే, పురాణములకు ప్రమాణ్యము స్వతస్సిద్ధమే. శ్రుతికి అవిరుద్ధముగా ఆచార. వ్యవహార ప్రాయశ్చిత్తాదులను బోధించు ఆప్తప్రణీతము లగుటచే స్మృతులు ప్రమాణములు. 'ఉపబృంహణము' అనగా - సకల వేద

---

5. 'అనుమితి' యనగా - అనుమాన ప్రమాణముచే కలుగునట్టి జ్ఞానము.

— సంపాదకుడు.

వేదార్థముల నెరింగి,తమ యోగ మాహాత్మ్యముచే వేదతత్త్వార్థ సాక్షా త్కారము నందిన ఋషుల వాక్యములచే, తా మెరింగిన వేదవాక్యార్థ ములను వ్యక్తీకరించుట. పురాణములు - సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము అను అయిదు విషయము లను ప్రతిపాదించును. సాత్త్వికములు, రాజసములు, తామసములు అని పురాణములు మూడు విధములు. వానిలో - అవిరుద్ధాంశములు ప్రమాణములు. విష్ణు, నారద, భాగవత, గారుడ, పద్మ, వరాహ పురాణములు ఆరును సాత్త్వికములు. బ్రహ్మాండ, బ్రహ్మకైవర్త, మార్కండేయ, భవిష్య, వామన, బ్రహ్మపురాణము లారును రాజస ములు. మత్స్య, కూర్మ, లింగ, శైవ, స్కాంద, అగ్నేయపురాణ ములు ఆరును తామసములు.

పాంచరాత్రాగమము వేదసారమే కనుక - ప్రామాణికము. సాక్షాత్ భగవదుక్తము లగుటచే, ఆ ఆగమ శాస్త్రములు పూర్ణ ప్రమాణములు. ధర్మశాస్త్రములును అట్లే ప్రమాణములు. శాండిల్య, పరాశర, భరద్వాజ, వశిష్ఠ, హారీతాదులు ధర్మశాస్త్రములను రచిం చినవారు. లోకమున శబ్దములు శరీరవాచకములుగా నున్నను, శరీరి పర్యంతము బోధించును. సర్వశరీరకుడు, సర్వశబ్దవాచ్యుడు నారాయణుడు కనుక, శబ్దము లన్నియు నారాయణునే ప్రతిపా దించును.

## ప్రమేయము

ద్రవ్యము, అద్రవ్యము - అని ప్రమేయము రెండు విధములు. గుణాశ్రయము ద్రవ్యము. ద్రవ్యము ఉపాదానము. అవస్థాశ్రయము ఉపాదానము. ఘటమునకు మట్టి ఉపాదానము. జగత్తునకు బ్రహ్మ ఉపాదానము. కర్మ, సామాన్య - సమవాయ - అజాతములు ప్రత్యేక పదార్థములు కావు. జడము, అజడము అని ద్రవ్యము రెండు విధ

ములు. ప్రకృతి, కాలము జడములు. శుద్ధసత్త్వము, ధర్మభూతజ్ఞానము, జీవుడు, ఈశ్వరుడు అజడములు. సత్త్వ, రజ, స్తమో గుణత్రయా శ్రయము ప్రకృతి. అట్టి ప్రకృతికి - నిత్య, అక్షర, అవిద్య, మాయ యని నామాంతరములు. అద్రవ్య మనగా - సంయోగ రహితమైనది. ఇది పది విధములు. సత్త్వ రజ స్తమస్సులు, శబ్ద, స్పర్శ, రూప రస, గంధములు, సంయోగము, శక్తి అనునవియే అద్రవ్యములు. వీనికే - 'గుణములు' అని వ్యవహారము. ఇట్టి విశేషము లనేకములు రామానుజ దర్శనమున - చక్కగా వివరింపబడినవి.

## జగత్సత్యత్వ నిరూపణము

జగజ్జీవులు - పరమాత్మకు విడదీయ వీలులేని సంబంధముతో నుండును. జగత్తంతయు పరమాత్మయొక్క శరీర మనియు, పరమాత్మ శరీరి యనియు శ్రుతులు స్పష్టము చేయుచున్నవి. పరమాత్మ సత్యము కనుక, జగత్తుకూడ సత్యమని స్పష్ట మగుచున్నది.

జగద్బ్రహ్మల అనన్యత్వమువలన, సర్వము సత్య మని తెలియు చున్నది. జగత్తుకు బ్రహ్మ ఉపాదాన కారణము, నిమిత్త కారణము కనుక, అనన్యత్వము జగత్సత్యత్వము వలననే, ఏకవిజ్ఞానముచే సర్వ విజ్ఞానము సంభవించుచున్నది. మృదాత్మకములగు ఘట శరావాదుల వలె, బ్రహ్మాత్మకమైన జగత్తు సత్యమని దృష్టాంతముచే స్పష్ట మగు చున్నది.

ఒక సత్యమైన దానికి, ఒక మిథ్యయైన దానికి ఏకత్వము కుదు రదు. కావున, బ్రహ్మ సత్య మగుటచే, జగద్బ్రహ్మలకు ఏకత్వము సిద్ధించుటచే, జగత్సత్యత్వము స్పష్టము.

సర్పరజ్జు న్యాయముచేకూడ, వేదార్థ సంగ్రహ, వేదాంత దీప - వేదాంతసార - శ్రీభాష్యములందు రామానుజులచే జగత్సత్య

త్వము నిరూపింపబడినది. అట్లే, శుక్తి - రజత జ్ఞానముచేకూడ జగత్సత్యము స్పష్టము చేయబడినది. బ్రహ్మ సత్యము కనుక, బ్రహ్మాత్మకమైన జగత్తుకూడ సత్యమే. బ్రహ్మమే జగత్తుగా పరిణమించినదని -

"తదైక్షత తత్సృష్ట్వా, తదేవాను ప్రావిశత్"

"తస్మిన్ ప్రవిశ్య సత్యచ్చత్యా భవత్."

"అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య, నామరూపే వ్యాకరవాణీతి."

ఇత్యాది శ్రుతులు బోధించుచున్నవి.

'జగత్సర్వము పరమాత్మాధీనము. అందు ప్రవేశించినాడు పరమాత్మ' అను శ్రుత్యర్థము వలన, ఆధారాధేయభావముచే, జగత్సత్యము స్పష్టము.

"య ఈశో౽స్య జగతో నిత్య మేవ, నాన్యో హేమ ద్విద్యతే ఈశనాయ."

అని, రామానుజ దర్శనమున జగదీశ్వర నిత్యత్వము చెప్పబడినది.

ఇట్టి విశిష్ట విషయ విరాజితమైన శ్రీరామానుజ దర్శనము విశ్వవిఖ్యాతి గాంచి యున్నది.



# శ్రీ రామానుజ నవరత్నములు

'కవిశేఖర'

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల వేంకట రాఘవాచార్యులు



శ్రీ పెరుంబూదూ ర్పుర
మే పున్నె మొనర్చెనో మహీమండల సం
దీపక హరి తేజమె శిశు
రూపున నట బుట్టి యతివరుండయి వెలసెన్.

ఎవఁ డుర్వీసురు లింట గాంతిమతి నా యిల్లాలి కాసూరి కే
శవ భట్టార్యునకున్ సుతుండయి, శ్రుతి స్మార్తార్థముల్ నేర్చి, యీ
భవ వృత్తిన్ ద్యజియించి, వేదపద గుప్తంబైన భావంబు వై
ష్ణవుడై కన్గొనె నా జగద్గురుఁ, బ్రపన్నజ్యేష్ఠు భావించెదన్.

అవనీభార ధురంధరంబగు ననంతాంశావతారంబుగా
భువనఖ్యాతి రహించి, ప్రాంచిత మహా భోగమ్ములన్ వీడి, శ్రీ
ధవ నిత్యావసథాత్ముఁడైన శ్రుతివేత్తన్ బండితం మన్య మా
నవ మండూక సుభీకరున్, దపసి పున్నాగున్ బ్రశంసించెదన్.

తత కాలోదధి మగ్నమైన శ్రుతి యాథాతథ్యమున్ దెల్పి, శ్రీ
పతి కారుణ్య సుధాపయోధి ప్లవనాభ్యాసంబునన్ జేసి, మా
యతిరాడ్వర్యున కయ్యెఁ దార్కికులు దీర్ఘాలాప వంశంబులన్
గెతుకన్ దాకునె ? యంతరార్థములు తద్గీర్వాణ గాంభీర్యముల్.

ఎంచ సుబోధ్యమా చిదచిదీశ్వర తత్త్వ విశేషముల్ సమ
ర్థించిన తర్కవాఙ్మణులు తీర్చిన భాష్యము భూమికిన్ బ్రసా
దించి, బహూపదేశములఁ దెల్పె ముముక్షులకున్ - బ్రపత్తికిన్
మించిన దారి లేదని ; నమించెద న య్యతిరాజమౌళికిన్.

అంతేవాసులు తోడురా నడకమై నాసేతు కాశ్మీర ప
ర్యంతానంతఁ బవిత్ర జేసి, భువి జీర్ణంబైన యార్షేయ వే
దాంతార్థంబు లుపన్యసించి, హరిదాస్యంబున్ ప్రబోధించె, దు
ర్భ్రాంతుల్ దీరిచె నే మహా మనుజుఁ డా రామానుజుం గొల్చెదన్.

నూటిర్వదేండ్ల యాయుః
పాటవమున ద్రవిడ భూ తపః ఫల రూపుం
డోటువడని తార్కిక వా
గ్ధాటిని హరిమతము భరతధాత్రిని బఱచెన్.

ఘన రామానుజ పుణ్యవాఙ్మయ బృహత్కావేరి యుప్పొంగి, చు
ట్టును నిస్సార మతోష రక్షితుల కొండున్ నించగా ముంచఁ, బా
వన నారాయణ భక్తిబీజములు పై పై మొసు లెత్తంగ, జీ
వన సాంగత్యముఁ గంద్రుగాత! భవతాపక్షామ సీమ ప్రజల్.

ఆ రామానుజ చందనాగజ విశిష్టాద్వైత సిద్ధాంత గం
ధీరామోదము జన్మవాసనల నుద్భేదింప, శ్రీభాష్య గం
గా రంగద్రసపాన శుద్ధు లయి, శ్రీ నారాయణాంఘ్రిద్వయీ
నీరేజంబుల గాంత్రుగాత! భగవన్నిష్ఠాజనుల్ ధీ ధనుల్.



# శ్రీమద్రామానుజులు - యోగవిద్యా రహస్యము

'విశిష్టాద్వైత వేదాంత విశారద'

డాక్టర్ : చించాపట్టణం శ్రీరంగాచార్యులు, ఎం.ఏ;పి. హెచ్.డి.



"యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ
వ్యామోహిత స్తదితరాణి తృణాయమేనే
అస్మద్గురో ర్భగవతో ఽస్య దయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే."

## 1. ప్రవేశిక

పుణ్యభూమి యని ప్రసిద్ధి గాంచిన భరత ఖండమున - ఎందరెందరో వేద ఋషులు, మహాత్ములు, సిద్ధి పురుషులు ఉదయించి, సంసార సాగర నిమగ్నులగు చేతనుల నుద్ధరించుటకై, బహువిధ మార్గముల గనుగొనిరి. అట్టి వారిలో - శ్రుతిస్మృతీతిహాస పురాణములను, ఉపనిషత్తులను, భగవద్గీతాశాస్త్రమును ప్రమాణముగా నొసగి, విశిష్టాద్వైత సిద్ధాంతమును స్థాపించిన మహనీయులు శ్రీమద్రామానుజులు. శ్రీభాష్యకారు లని ప్రసిద్ధి గాంచిన శ్రీమద్రామానుజులు - (1017 - 1137) యావద్భారతమున విశిష్టాద్వైత వేదాంతమును ప్రబోధించి, ఆస్తిక మత వికాసమునకు ముఖ్యకారకు లయిరి. వీరు ఆత్మకు శరీరమువలె, సమస్త కల్యాణ గుణోపేతు డగు పరమాత్మ, అసంఖ్యేయము లగు జీవులకు, మూల ప్రకృతికి ఆధారభూతమై యున్నాడను పరతత్త్వమును స్థాపించిరి. జీవాత్మ - పరమాత్మల యీ శేష - శేషి, శరీర - శరీరి సంబంధమును గూర్చి, ఆళ్వారాచార్యు లందరకు పూర్వమే వివేచించి చెప్పియున్న వారైనను, శ్రీమద్రామానుజులు దీనిని వేద ప్రామాణ్యమున క్రమబద్ధ మొనర్చిరి.

శ్రీమద్రామానుజులు - గొప్ప వేదాంత వేత్తలు. గీర్వాణ వాణిలో వ్రాయబడిన వారి రచనలలో - వేదములనుండి, విశేషించి

ఉపనిషత్తులనుండి ప్రమాణ వాక్యము లనేకము లుదాహరింపబడినవి. వారు భగవద్గీత నొక ప్రధాన ప్రేరణముగ గ్రహించిరి. వారి రచనలలో ముఖ్యముగ పేర్కొన వలసిన మూడు ముఖ్య గ్రంథములు - 'శారీరక మీమాంసా భాష్య మను నామాంతరము గల శ్రీభాష్యము, వేదార్థ సంగ్రహము, గీతాభాష్యము' అనునవి. బాదరాయణుని బ్రహ్మ సూత్రములకు వ్రాయబడిన వ్యాఖ్యానమే శ్రీభాష్యము. అందు పరబ్రహ్మ పరమైన వేదాంత ప్రబోధముల తాత్పర్యము సంగ్రహముగా చెప్పబడినది. వేదార్థ సంగ్రహమున వేదములలోని ముఖ్యార్థ విశేషము సంక్షేపముగ చెప్పబడినది. భగవద్గీతలోని శ్లోకములకు వారు చేసిన వ్యాఖ్యానమే గీతాభాష్యము. ఇవియే గాక, వేదాంత సారము, వేదాంత దీపము, శరణాగతిగద్య, శ్రీరంగగద్య, శ్రీ వైకుంఠగద్య, నిత్య గ్రంథము అను ఆరు రచనలును శ్రీమద్రామానుజ విరచితములై విలసిల్లుచున్నవి. వేదాంత సారము, వేదాంత దీపము అనునవి - శ్రీమద్రామానుజుల శ్రీభాష్యమునకు సంక్షిప్త రూపములు. వేదాంత సారమున ప్రతి ప్రామాణ్యమునందును స్థాపింపబడిన విశిష్టాద్వైత సిద్ధాంత సారాంశమును, వేదాంత దీపమున వేద ప్రామాణ్య సహిత విశిష్టాద్వైత సిద్ధాంతము, దాని సారాంశమును వివరీకరించబడినవి. గద్యత్రయముని ప్రసిద్ధి గాంచిన శరణాగతి, శ్రీరంగ, శ్రీవైకుంఠ గద్యములు — భక్తి సంబంధమైన సంక్షేప ప్రార్థనారూప విశేష సంభరితములు. నిత్యగ్రంథమున శ్రీవైష్ణవుల కుద్దిష్టమైన ప్రతిదిన భగవదారాధనక్రమము సంక్షేపముగ వర్ణింపబడినది. శ్రీమద్రామానుజుల ప్రధాన గ్రంథములు మూడింటిలో గనుపట్టు యోగ విశేష వ్యాఖ్యానము లీ యారు రచనలలో గానరావు.

ధ్యానమే మోక్షోపాయమునకు ముఖ్యమైనదిగ శ్రీమద్రామానుజులు నియమించిరి. అట్లు విధించుటచేత, పతంజలి యోగము

వంటి సంప్రదాయ సిద్ధాంతముల పరిగణన, వారి దృష్టిలో లేకపోలేదు. అయినను, వారు నాస్తిక్యముపై కల్పింపబడిన ఉపదేశములను విమర్శనా రహితముగ వ్రాసిన వారు కారు. ఈయంశమును దృష్టియందుంచుకొనినపుడు, శ్రీమద్రామానుజుల మోక్షోపాయము కేవలము కర్మ జ్ఞాన భక్తి యోగములపై ఆధారపడియున్నదని చెప్పిన చాలదు. అందు వారి ప్రత్యేకాభిమాన విశేషము లేవో గ్రహింపవలయును. ఇది మతాధిక్యతయందా కాలమువారి అభిరుచిని దెలియజేయునట్టిది.

ఒకవంక భారతీయ హిందువులు మానసిక ప్రశాంతతకై ఆనందము నొసగు సులభ పద్ధతుల నవలంబించుచుండ, చాలమంది అమెరికనులు, యూరోపియనులు పతంజలి యోగముపై ఆధారపడిన సంప్రదాయ బద్ధమగు యోగములోని ఒక పద్ధతిని - హఠయోగమునో, రాజయోగమునో, కుండలినీయోగమునో - అత్యాతురతతో నభ్యసింపబూనుకొనుచున్నారు. పాశ్చాత్య దేశములకు యోగమును గూర్చి బోధించిన పండితులు, వారి వారి జీవిత తత్త్వ జ్ఞాన మేదైనను యోగము నొక క్రమశిక్షణగనే వచించిరి. వారు స్పష్టముగా చెప్పకపోయినను, వారి యోగాభ్యాసము మానవ స్వభావ గతుల శాలిక విలువలకు సంబంధించి, మధ్యస్థమైనదిగ భావించిరి. అయినను సాంప్రదాయ యోగ గ్రంథముల పై పై పరిశీలనము, క్రమశిక్షణ లోతుగా నాటుకొని యున్న దను ప్రత్యేకాంశ దృష్టియే సంగతముగా ప్రకటితమగుటను తెలియజేయగలదు.

లోతైన పరిశీలనమువలన - యోగాభ్యాసము సాధకునిలో ఆత్మవిమర్శ చేసికొను నొక ప్రత్యేక పద్ధతిని గలిగించునని తెలియును. మొత్తము మీద - యోగ మనునది వ్యక్తులలో - (సాధకులలో) ప్రాథమిక దశనుండి చివర వరకు, ఆధ్యాత్మిక క్రమశిక్షణను పరిపూర్ణముగా స్వీకరించునట్టిది. ఒకవేళ సాధకుని ప్రాథమిక దశయందిది

ప్రత్యేకముగ ఆలోచించి, సంభావించు పద్ధతిని గలిగింపనిచో దాని ఉద్దేశ్యము నెఱవేరదు.

'యోగశ్చిత్త నిరోధకః' (యోగము చిత్తవృత్తి నిరోధము) అని పతంజలి నిర్వచనము. భవ ప్రమాదముల సాధారణ మానసికానుభవములను నిర్మూలించి పరవశింపజేయునట్టిదనియు, ఇంద్రియాతీతమైనట్టి విశేషమైన బుద్ధి గల అనుభవమే యోగ మనియు పతంజలి ప్రవచించినట్లు పాశ్చాత్య విద్వాంసు లభిప్రాయపడిరి. ఈ యోగము - యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధు లను ఎనిమిది అంగములతో గూడియున్నందున, దీనికి అష్టాంగ మని లోక ప్రసిద్ధి.

సాంఖ్య తత్త్వమును ఆధారముగా గొని పతంజలి, యోగమును తత్త్వజ్ఞానముగ ప్రతిపాదించెను. నాస్తికమైన సాంఖ్యము రెండు ముఖ్య సూత్రముల నంగీకరించుచున్నది. అవి - 'ఆత్మ (జీవుడు), ప్రకృతి' అనునవి. ఆత్మ లసంఖ్యాకములు. మూలప్రకృతియొక్క శుద్ధచైతన్యము గలవి. ప్రకృతి యన్ననో, జడమైనది; పరిణామశీలమైనది; సృజనాత్మకమైనది; జడజగత్తుయొక్క మార్పు చేర్పుల కాధీనమైనట్టిది. పతంజలి సాంఖ్యమున నొక మెట్టు పై కెదిగి, ఈశ్వరుని ఉనికినిగూర్చి రూఢి యొనర్చెను. ఈశ్వరుని పాత్ర తారతమ్యమును బట్టి స్వల్పమైనదని చెప్పుచు, ఈశ్వరుడు వేరొక ఆత్మవంటివాడై నను ప్రకృతి వలలో చిక్కుకొని, స్వతంత్రుడని వక్కాణించెను. ఆయనకు జగత్సంబంధమైన అధికారము లేదు. ప్రపంచమున నిర్వహింపబడు సంకల్ప వికల్పములతో ఆయన కెట్టి సంబంధము లేదు. ఆ పని ప్రకృతిది. ఆయన దానికి ముఖ్య గురువు. ఈశ్వరోపాసనము సమాధి పొందుట కొక తోడ్పాటుమాత్రమేకాని, ఆయనలో స్వాభావికమైన ఏదో శక్తియున్నందున కాదు. అంతకంటెను 'భగవంతుని ఉపాసించుట' అనునది - ఆత్మవిచారమున కొక ఆలంబనయని చెప్పవచ్చును'

అని విశదీకరించెను. మొత్తముమీద పతంజలియొక్క యోగ లక్ష్యము - ఆత్మ ప్రకృతినుండి విడివడి, కైవల్యము నొందుట (ఆత్మానుభవమునకు దెచ్చుకొనుట) అని తెలియుచున్నది.

కొంచెము లోతుగ విచారించిన, పతంజలి యోగోద్దేశ్యము మానవ బాధా నివృత్తియే యని తెలియును. మొట్టమొదట మానసిక, శారీరకములగు తీరుతెన్నులను సమూలముగ మార్చివైచి, తుదకు మనస్సును, శరీరమును నియమబద్ధ మొనర్చిన, పరిపూర్ణముగా సర్వోత్కృష్టమైన చైతన్యమును గలిగించుటే అతని అభిలషితార్థము. ఆత్మ ఉనికిని సంభావించిన పతంజలి, అది శరీరమునుండి పూర్తిగ వేరైనదిగనే తలచెను. అంతే కాక, సాధారణ చైతన్యము భ్రాంతి కలుగఁజేయునట్టిదని, ఆధ్యాత్మిక భద్రత కది హానికరమని నిర్ధారించెను. అతడు లోకమునకు కాలానుగుణ్యముగ అవకాశము ననుసరించి, ప్రాపంచికమైన వ్యక్తిగత వ్యవహారమునుండి, దూరముగగాని, తటస్థముగగాని, ఉపసంహరించుకొనుటద్వారాగాని జీవితమును గడుపుకొనవలయునను నీతిశాస్త్ర సంబంధవిషయమును ప్రబోధించెను. అందువలన అతని పద్ధతి, పరమపురుషుని ఆవశ్యకతను గనుఁగొనియుండలేదు.

పై వాస్తవమును దృష్టియందుంచుకొనినపుడు, ఆస్తిక్య సంబంధమున పతంజలియోగము నభ్యసించుట, అను విషయము ప్రాధాన్యతను సంతరించుకొనును. శ్రీమద్రామానుజులును ఈ అభిప్రాయమునే కలిగి యుండిరి. వారు యోగమునే మోక్షోపాయముగ సమ్మతించి యుండిరి.

## 2. పరబ్రహ్మము - ఆత్మ - స్థూల జగత్తు

ఒక్కడేయైన పరబ్రహ్మము ఒక పదార్థమైయుండి, దేహాత్మయందారోపితమై యుండును. ఈ పరబ్రహ్మపదార్థము, దేహాత్మయు విడదీయరానివైనను, అవి ప్రత్యేకముగ వేరైనవి. పరబ్రహ్మము

స్థూలకారణము, సూక్ష్మకారణమును. ప్రత్యేకమైన ఆత్మలు, స్థూల జగత్తు పరబ్రహ్మము యొక్క శరీరముగ నేర్పడుచున్నవి. అందువలన, నవి బ్రహ్మాంశములుగ జెర్కొనబడినవి. పరబ్రహ్మమును గూర్చి శ్రీ భాష్యమున ఈ విధముగ వివరింపబడినది.

"చేతనాచేతనమయమైన సర్వమును ఆయన శరీరము. ఎవని స్వరూపము పరిపూర్ణ మంగళ ప్రదమై, కల్యాణ గుణముల కాకరమై, అపరిమితానందకరమో, ఎవడు నిఖిలహేయగుణప్రత్యనీకుడో, ఎవడు తన సంకల్పముచేతనే సమస్తమును నెఱవేర్చునో, ఎవడు తనపై ఆధారపడువా రందరికిని దయాసముద్రుడో, ఎవ డీ సమస్తమున కతీతమైనవాడో - ఆయన పరమపురుషుడని, పరబ్రహ్మమని - శ్రుతులవలన మనకు తెలియవచ్చుచున్నాడు."

— (శ్రీభాష్యము : 4 - 4 - 22.)

పరబ్రహ్మము శ్రీమన్నారాయణుడని, అయన పత్ని శ్రీదేవి యని, ఆయన సమస్త కల్యాణ గుణములను గలిగినవాడని, సమస్త దోష రహితుడని, ప్రపంచమునందలి ఆత్మలకు, ప్రకృతికి శరీరియై, శేషియై యున్నవా డని, లీలా విభూతి యను ఈ జగదుత్పత్తి స్థితి సంహార ములు తన లీలగా గలవాడని, ఈ జగత్తునకే కాక, తన నిత్య విభూతి కిని తానే ప్రభువై, అనంత, గరుడ, విష్వక్సేనాది ప్రముఖులచే నిరం తరము సేవింపబడువాడై, పరిపూర్ణుడై, ప్రశాంతతతో విరాజ మానుడై యుండునని, ఆయన స్వరూపము ఊహాతీతమై, వ్యక్తీకరింప రానిదై నను, భక్తులను గాపాడి రక్షించునట్టి పరమోద్దేశ్యము గలిగి యుండువా డగుటచేత, వారికి వేదమున తనంతట తానే వ్యక్తమగు చుండునని, శ్రీమద్రామానుజుల రచనలలో పరబ్రహ్మ యొక్క లక్షణములు తరచుగా వివరింపబడుట కాననగును. గీతాభాష్యమున -

"నిఖిల జగదుత్పత్తి స్థితి లయము లెవని లీలా విశేషమో, ఎవడు సమస్త దోషములకు ప్రత్యనీకుడో, ఎవని స్వరూప స్వభావము కల్యాణైక ప్రదమో, ఎవడు

అనవధికాతిశయ జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తి తేజః ప్రభృతి సమస్త కల్యాణ గుణ గణ మహార్ణవుడో, ఆయన పరబ్రహ్మాభిధానుడగు పరమ పురుషుడు."

— *(గీతాభాష్యము : 18 – 73.)*

అని వర్ణించియున్నారు.

ఇట్టి పరబ్రహ్మమునుండి, ప్రకృతినుండి వేరైన ఆత్మలు (జీవులు) అసంఖ్యాకములు. వాస్తవమైనవి, శాశ్వతమైనవి, అహమత్వములునైన ఈ ఆత్మలు, తమను తాము గుర్తించు శక్తి గలిగియుండుటే కాక, ప్రకృతిని, పరబ్రహ్మమును దెలిసికొనగల శక్తియును గలిగి యున్నట్టిది. ఆత్మ ఒక్కటే యనియు స్వచ్ఛమైనదియు, అనారోపిత జ్ఞానచైతన్య మనియు, అట్టి ఆత్మకు అజ్ఞానమువలన అహమత్వ మారోపింపబడు ననియు అది మోక్షకాలమున తొలగిపోవుననియు అద్వైతుల దృష్టి. శ్రీమద్రామానుజుల దృష్టిలో అహమత్వ మనునది ఆత్మసంబంధ పదార్థమే. జ్ఞానము దాని ముఖ్య గుణము. ఆత్మ ఒక ప్రత్యేకమైన 'జ్ఞాతృ' పదార్థము. అందువలన అది ముక్తావస్థయందును ఉండునని చెప్పిరి. ఆత్మయొక్క ఉద్దేశ్యములను పరిపూర్ణముగా స్వాధీనపరచుకొని, దానికై సంపూర్ణముగా లొంగియుండునట్టివియునైన ఆత్మలు భగవంతునకు శేషభూతములు. సర్వశేషియైన ఆ భగవంతుని సేవ కొఱకై సమస్త వస్తువులును వెలసియున్నవి. అవి యన్నియు తమ ఉనికికై, వ్యవహారమునకై స్వరూప స్వభావములకై పరబ్రహ్మముపై ఆధారపడి యున్నవి. ఆత్మ - పరమాత్మల సంబంధమునుగూర్చి శ్రీమద్రామానుజులీ క్రింది విధముగ విశదీకరించియున్నారు :-

"ఆత్మ పరమాత్మచే సృజింపబడి, ఆయన దేహమై వెలసి, ఆయనకు శేషభూతమై యుండి, ఆయనపై ఆధారపడి, ఆయనచేతనే పరిపాలింపబడి, చివరకాయనచేతనే సంహరింపబడును."

— *(శ్రీభాష్యము : 2 - 3 – 42.)*

అంతేకాక పరబ్రహ్మము తన అభిమతానుసారముగనే ఆత్మలను బంధించి, విముక్తి నొందించుచుండునని, ఆత్మ పరబ్రహ్మోపాసకుడై, ఆయన దయను పొంది చతుర్విధ పురుషార్థములగు ధర్మార్థకామ మోక్షములందు పాల్గొనుచుండుననియు చెప్పబడినది. అయినను, పర బ్రహ్మము చపలచిత్తుడు కాడట. ఆత్మను తమంతట తాము చేసి కొనిన కర్మానుగుణ్యముగనే, ఆయన వారిని సంసారమున బంధించుచు, ముక్తి నొందించునట. శేష - శేషి సంబంధమున నొప్పారు ఆత్మలకు పరబ్రహ్మమునకు గల సంబంధమును పరిపూర్ణముగా ధ్రువీక రించుచు శ్రీమద్రామానుజులు — 'ఆత్మ స్వతంత్రముగ వ్యవహరించు నట్టిదా ? లేక, పరమాత్మాయత్తమైనట్టిదా?' అను ప్రశ్న లేవనెత్తిరి. ఒకవేళ ఆత్మ పరబ్రహ్మముపై పరిపూర్ణముగ ఆధారపడి యున్నచో, శ్రుత్యానుగుణ్యమైన విధినిషేధముల కర్థము లేకపోవునని, ఆయనను ఆత్మ కర్మకు పరబ్రహ్మయే హేతువని శ్రుతులలో బోధించుచున్నట్లు వారు గమనించిరి. ముఖ్యముగ పరబ్రహ్మము ఆత్మకు అంతర్యామియై యుండి, అనుమతించుచుండునని యిట్లు సాయించిరి :-

"అంతర్యామియై వర్తించు పరబ్రహ్మము - ఎంతవరకు ఆత్మ చేయు కార్యము నసుచితమైనదని తలచునో, అంతవరకా కార్య ప్రయత్నమున దానికి సహకరించి, అనుమతించుచుండును పరబ్రహ్మముయొక్క అనుమతి లభింపని దే కార్యమును దుస్సాధ్యము. ఈ విధముగ శ్రుతిప్రతిపాదితమైన విధి నిషేధములు అర్థ రహితమై యెప్పుట లేదు. పరమ పురుషుని ప్రీతి నొందింపజేయుట కెవరు కృతనిశ్చయులై ప్రయత్నించుచుందురో, అట్టి వారి మనస్సులలో తనను పొందునట్టి పద్ధతులలో వారికి తీవ్ర వ్యాఘాతములు కలిగించి, అధఃపతిత మగు రీతిని గలుగ జేసి, వారి మనస్సులలో - ఆ యా నీచకృత్యములయందే వారికి సంతోషమును గలుగజేయుచుండును."

— (శ్రీభాష్యము : 2 - 3 - 41.)

ఈ అంశమును సమష్టి యాజమాన్యమున నొప్పు నొక విధి కనువర్తించి చెప్పవచ్చును. ఒక డా విధిని మూడవవానికి బదిలీ చేయవలయునని ఇచ్ఛగించుచుండినను, వే రొకని అనుమతిని పొంద వలసియే యున్నది. అయినను, బదిలీ చేయు కార్యక్రమము మొదటి వాని సొంతమే యని తెలియుచున్నదిగదా !

## 3. పరిజ్ఞానమునకు మూలాధారము

శ్రీమద్రామాజుల దృష్టియందు వేదాంత శాస్త్రపరమైన సిద్ధాంతముల కన్నిటికిని వేదమే ముఖ్యాధారము. ఈ వేదము రెండు విధములని చెప్పబడినది. కొందరు వేద ఋషులు పరంపరానుగత పద్ధతి ననుసరించి, ఒక శిష్యుని వాగ్రూపమున వినిపించుచు వచ్చిన శ్రుతులు, పరమార్థ ప్రబోధకులగు కొందరు దేశికులు, సమస్త పవిత్ర సాంప్రదాయ స్వరూప విశేషము నంతటిని అక్షరాకృతిన అందించిన స్మృతులు, వేదములను శ్రుతుల వర్గములో శ్రీమద్రామానుజులు వేదాంతములగు ఉపనిషత్తులకే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చి, వాని పరమార్థమునే నొక్కి చెప్పిరి. స్మృతులగు ధర్మశాస్త్ర, ఇతిహాస, పురాణములలో భగవద్గీతకు, విష్ణుపురాణమునకు గొప్పదైన ప్రాముఖ్యము నొసగిరి. (శ్రీభాష్యమునందు, గీతాభాష్యమునందు వేదార్థ సంగ్రహమునందును విష్ణుపురాణమునే ఉదాహరించిరి.) ఈ విధముగ శ్రుతుల, స్మృతుల యొక్క ప్రామాణ్యా మా పదములు రెండింటి యందు తిరుగులేనివిగ పేర్కొనబడినవి. శ్రుతులు అపౌరుషేయము లని, శాశ్వతమైనవని శ్రీమద్రామానుజులు వేదార్థ సంగ్రహమున ప్రతిపాదించియున్నారు. అంతే కాక, శ్రుత్యర్థమును వ్యాఖ్యానించు చున్నంతవరకు స్మృతి ప్రామాణికమైనదని వివరించుచు, వేదార్థ సంగ్రమున నిట్లానతిచ్చియున్నారు :-

"వేదములు అనంతములై, దురవగాహమై యున్నందున, అన్ని యుగము లందును, సమస్త లోకములకు సహకరించునట్లు వేదార్థముల నందించుటకై, పర బ్రహ్మము మహాఋషుల నాజ్ఞాపించియున్నాడు. పరమాత్మ ఆజ్ఞను శిరసా వహించి, మహాఋషులు ధర్మశాస్త్రములను, ఇతిహాసములను, పురాణములను రచించియున్నారు." (*వేదార్థ సంగ్రహము* : **139** *పుట.* **294**)

వేదములకు స్మృతులకు కొన్ని సందర్భములలో అభిప్రాయ సారూప్యత పొసగనిచో — దానికి వారే ఇట్లు సూచించియున్నారు :—

"ఒకవేళ వేదమునకు, స్మృతికి విభేదము కలుగుచో, దానిని పరిగణింప వలసిన యవసరము లేదు. ఎందుచేత ననగా, దానిని పూర్వమీమాంస నిర్ధారించియే యున్నది." -( **శ్రీ భాష్యము 1 - 1 - 1**)

(పూర్వ మీమాంస సంహితా బ్రాహ్మణములలోని కర్మమార్గమును, ఉత్తర మీమాంస ఆరణ్యక ఉపనిషత్తులలోని విజ్ఞానమార్గమును బోధించునని, భక్తి - ఉపాసనలు కర్మమార్గములోనివే యని తెలియ జేయబడినది)

భౌతిక రూపమును దాల్చిన జీవాత్మ, అవిద్యచేత అంతులేని సంసార చక్రమును బంధింపబడి యుండునని, బ్రహ్మవిద్య వలననే మోక్షము నొందునని, వేదము రూఢిగా జెప్పుచున్నట్లు, వేదాంత గ్రంథములద్వారా తెలియుచున్నది. శ్రీమద్రామానుజులు బ్రహ్మ విద్యకు సయుక్తికమైన మూలాధారములగు మూడు ప్రమాణములను సమ్మతించి యున్నను, ప్రత్యక్ష, అనుమానశబ్దములను మూడిటిలో కేవలము శబ్దమొక్కటే బ్రహ్మజ్ఞానమునకు మూలా ధారమని విశ్వసించిరి. పరబ్రహ్మము ఇంద్రియాతీతుడు కావున, ప్రత్యక్షమగు నొక వస్తువుగాని, నిదర్శనకు ప్రమాణముగాని కాదు. కాని, అద్వైతులు - పరబ్రహ్మము ఇతర ప్రమాణములద్వారా

తెలియబడవలసి యున్నదున, వేదము బ్రహ్మజ్ఞానమునకు మూలాధారము కాదని సూచించుదురు. ఎందుచేత ననగా, ఇతర ప్రమాణముల ద్వారా నిర్ధారింపబడనట్టిదానికే వేదార్థము కలదను నొక సిద్ధాంతము వారిచే సమ్మతింపబడినది. కాని, మొట్టమొదట ఇతర ప్రమాణము లేవి యను అభ్యంతరము రేకెత్తును. అది ప్రత్యక్ష ప్రమాణము కాదు. ప్రత్యక్షము రెండు విధములని చెప్పబడినది. ఇంద్రియావయవములపై ఆధారపడియున్న దొకటి, అసాధారణ మానసిక ఏకాగ్రత (యోగము) రెండు. మొదటి విధమున తిరిగి రెండంతర్భేదములు కలవు. ఈ ప్రత్యక్షజ్ఞాన మనునది బాహ్యేంద్రియములవలనగాని లేక - మనస్సువలనగాని కలుగును.

"ఏ పరబ్రహ్మము పరిపూర్ణముగ నెఱిగియుండి, సమస్త వస్తువులను సృష్టించి, కూడదీయుటయందు సమర్థమైనదో, అట్టి పరబ్రహ్మముచేత ప్రత్యేకముగ ఏర్పరుపబడిన పదార్థముయొక్క విజ్ఞానమును గలిగించుటలో - బాహ్యేంద్రియములు పూర్తిగ అసమర్థమైనవి. అట్టి జ్ఞానమును అంతరింద్రియమైన మనస్సైనను రేకెత్తింపజాలదు. ఏందుచేత ననగా - అట్టి జ్ఞానము తీవ్రమైన భావమునుండి అంకురించినదైనను, వస్తువుల స్పష్టమైన భావమును మాత్రమే కలిగించును. అది కేవలము ఇదివరకు సంభావించిన వస్తువులను తిరిగి తలపింపజేయుట తప్ప మరేమి కాదు. అందుచేత అది ప్రామాణ్యము కాదు. ఏందుకనగా- అది ఇంతవరకు సంభావింపబడిన వస్తువులను గాక. తదితరములగువానికి వర్తించు సాధనము కానందున, ఒకవేళ అది ఆవిధముగ వర్తించు సాధనమైన, అది జ్ఞానమునకు వర్తించు సాధనము కాక, ప్రమాదమున కుపకరించు సాధన మగును."

– ( శ్రీ భాష్యము : 1 - 1 - 3)

అనుమాన మనునది అనుభవ (బుద్ధ) జ్ఞానముపై ఆధారపడియున్నది. పరబ్రహ్మమును ఊహా చేయుటకు వీలు కల్పించు ప్రత్యక్ష ప్రపంచము యొక్క రూపమును ఎవడును కనుగొనజాలడు. అందువలన శబ్దము (వేదము) మాత్రమే బ్రహ్మజ్ఞానమునకు మూలాధారము.

పై విశేషములను దృష్టియం దుంచుకొనినపుడు, శ్రీమద్రామానుజులు యోగమునకనుమతించిన పరిధియెంతో తెలిసికొనవలయు నను కుతూహలము కలుగును. 'యౌగిక దృష్టి' అనునది కేవలము ప్రత్యక్ష ప్రమాణము యొక్క ఒక విధము మాత్రమే. అయినను, అది దివ్యజ్ఞానమునకు మూలాధా ముకాదు. యోగమును జ్ఞానమున కొక సాధన మనుటకంటె, ఒక విధమైన 'స్మృతి' అని, ఒక 'భావనా ప్రకర్ష' అని, ఇదివరకు గ్రహించిన దానిని మరింత యెక్కువగ గ్రహించుట కొక ఉపకరణమని చెప్పవచ్చును. శ్రీమద్రామానుజులు 'యౌగిక జ్ఞానము దివ్యజ్ఞానమున కొక మూల'మని గుర్తింపకుండుట అసాధారణ విశేష మేమియు కాదు. సంప్రదాయ సంపన్నమగు హైందవ సంస్థలలో న్యాయవేదాంత మొక్కటే యౌగిక జ్ఞానమును ప్రమాణముగా గుర్తించునట్టిది. ఏ దెట్లున్నను, శ్రీమద్రామానుజులు యోగమును నిర్వచించిన పద్ధతి జూడగా - యౌగిక జ్ఞానము ప్రమాణము కాదని నిర్ధారించుటలో వారు, అది దివ్యజ్ఞానమునకు మూలాధారము కాదని నొక్కి చెప్పుటయే కాక, అది యీ శాస్త్రసంబంధమైన జ్ఞానము కాదని సూచింపదలచినట్లు తెలియును. అంతకంటె, యౌగిక జ్ఞానము సాధారణ దృష్టికి భిన్నమైన కేవల మానసిక దృష్టియని ఒక వస్తువుపై గొప్పనైన ఏకాగ్రత గలిగిన అంతఃకరణ (మానసిక) జ్ఞానమని తలచబడినది.

శ్రీమద్రామానుజులు యౌగిక జ్ఞానము కేవలము అంతఃకరణ సంబంధమైనదిగ తలచియున్నను, లేకున్నను, వారు యోగమునకు చెప్పిన నిర్వచనము, పతంజలి చెప్పిన యోగమును సమూలముగ భేదించుచున్నది. అతడు రెండు విధములైన సమాధినిష్ఠను గూర్చి చెప్పెను. ఒక్కొక్క విధమునం దెన్నెన్నో దశలు గలవు. సంప్రజ్ఞాత సమాధియందు పదార్థమునకు ధారణ, ధ్యానముల గ్రహింపబడియున్న చైతన్యము కలదు. కాని నిర్వితర్క సమాధియందు జ్ఞాపకశక్తి పోవును. అసంప్రజ్ఞాత సమాధియందు చైతన్యము

అదృశ్యమై, మానసిక వ్యాపార సరణు లన్నియు అడ్డగింపబడును. ఇదివరకటి చిత్తవృత్తి సంస్కారము లేవియు కానరావు. శ్రీమద్రామానుజులు పైన నిర్వచించి చెప్పిన యోగము సంప్రజ్ఞాత సమాధికి కొంత సంబంధించినదని తెలియుచున్నది.

## 4. బ్రహ్మజ్ఞాన స్వభావము

పూర్వకర్మసంచితమైన అవిద్యను తొలగించుకొనుటకు, కేవలము శ్రుతులలోని పదములను దెలిసికొని, సత్యానుభవ బుద్ధిపరత చరించుట మాత్రమే చాలదనియు ఏ జ్ఞానము కర్మను నశింపజేసి అవిద్యను తొలగించునో, ఆ జ్ఞానము ఉపాసనకు - ధ్యానమునకు సమానమైనదనియు శ్రీమద్రామానుజులు సంభావించిరి. నిత్య, నైమిత్తిక, మత కార్యకలాపము లన్నియు, బ్రహ్మజ్ఞానోపాసనను ఉత్పాదించు సాధనములనియు సాయించిరి.

"అవిద్య తొలగుటవల్లనే ముక్తి కలుగునని మనము సమ్మతించెదముగాక! ఈ తొలగింపు కేవలము బ్రహ్మజ్ఞానము వలననే సాధ్య మగును. కాని, ఈ అవిద్య నంతము చేయు జ్ఞానస్వరూపమును గూర్చి వేదాంత గ్రంథములలో నేమి ఉద్దేశించి చెప్పిరో వివరింపవలసియున్నది. ఇది కేవలము వాక్యాద్వాక్యార్థజ్ఞానమేనా ?"

— (శ్రీభాష్యము : 1 - 1 - 1)

అని ప్రశ్న వేసి, ఈ క్రిందివిధముగ సమాధానమిచ్చిరి :-

"అందువలన, వాక్యార్థ జ్ఞానముకంటె వేరైన వేదాంత వాక్యములలో విధింపబడిన ధ్యానోపాసనాది శబ్దవాచ్యమైన జ్ఞాన విశేషమే జ్ఞానము."

— (శ్రీభాష్యము : 1 - 1 - 1.)

అని స్వాయముగ శ్రీమద్రామానుజులు, వేదము ధ్యానమునే విధించుచున్నదని, ప్రత్యేకించి యోగముగ చెప్పబడిన సందర్భమున ఆ

ఆ విశేషమే అర్థవంతమై యొప్పుచున్నదని, జ్ఞానస్వరూపమును నిర్ధారించిరి. అంతేకాక -

"ఆత్మను కనుగొని, అతడు దానిని తెలిసికొనును."

— (ఛాందోగ్యోపనిషత్తు : 8 - 7 - 1.)

"దానిని తెలిసికొని, అతడు ధ్యానము నభ్యసించుగాక."

— (బృహదారణ్యకోపనిషత్తు : 4 - 4 - 21.)

అను వేదాంత వాక్యములును ధ్యానమునే విధించి యున్నవి. అందునను వాక్యార్థ జ్ఞానము పూర్వాకాంక్షితమైనను, దానికి రెండవ స్థానమే నిర్ణయింపబడినది.

ధ్యాన మను పదమునకు శ్రీమద్రామానుజ నిర్వచనము ఇట్లున్నది :-

"ధ్యాన మనునది - ధ్రువానుస్మృతి. అది తైలధారవలె అవిచ్ఛిన్నమై, నిరంతరము కొనసాగునట్టి స్మృతి. అంతే కాక, ఆ స్మృతి - దర్శన సమాకారమైనట్టిదయును." — (శ్రీభాష్యము : 1 - 1 - 1.)

దీనివలన, ధ్యాన మనగా-'ఒక పదార్థము కనులముందు చక్కగ గోచరించినట్లుగ, ఆ పదార్థమును మనస్సునందును కేంద్రీకరింపజేసి, తీవ్రముగా, అవిచ్ఛిన్నముగా, స్పష్టముగా గోచరించునట్లు చేయుట' అని తెలియుచున్నది. 'ధ్రువానుస్మృతి' అనునది నిజమైన స్మృతివలె గాక, అనగా - అపరోక్ష వస్తుజ్ఞానమువలె గాక, నిజమైన స్మృతి నిర్ధారించునట్టి దానితో సమానముగా, యౌగికజ్ఞాన సంబంధముతో మనము దర్శించునట్టిదని సూచింపబడినది. శ్రీమద్రామానుజులు ధ్రువానుస్మృతివలన గలుగునట్టి దృష్టినిగూర్చి ఉపయోగించియున్న 'సమాన' మను పదము సంగతముగా సమర్థతను గలుగజేయుచుండుట లేదు. దానికి సాదృశ్యముగ వా రా సందర్భమున -

"అ స్మృతి - దర్శనరూపా ప్రతిపాదితా' అని తెలియజేయబడినది. ఆ దర్శన రూపముకూడ, ప్రత్యక్షజ్ఞానమువంటిదని వివరింపబడినది."

— (శ్రీభాష్యము : 1 - 1 - 1.)

అని విశదీకరించిరి. అంతే కాక, ఆ స్మృతి 'భావనా ప్రకర్షము'గాన దర్శన రూపమునగూడ కలుగునని తెలియజేసిరి. ఈ వివరణమునుబట్టి, 'ధ్రువానుస్మృతి' వలన కలుగునట్టి దృష్టి - వాస్తవమైన దృష్టి కాదనియు, భావనాప్రకర్ష మను పదముచేత తెలియజేయబడిన దర్శన రూపమగు స్మృతియే ధ్యాన మనియు, తెలియుచున్నది. ముండకో పనిషత్తులోని ఒక పరిచ్ఛేదమునకు శ్రీమద్రామానుజులు చేసిన వ్యాఖ్యానములో, ధ్యానమును యోగముతో సమాన మొనర్చి చెప్పుట కానుపించును. ముండకోపనిష ద్వాక్యము రెండు విధములైన జ్ఞానమునకు సంబంధించి యుండును. అవి 1. అపరోక్ష జ్ఞానము 2. పరోక్ష జ్ఞానము. ఈ రెండు విధములైన జ్ఞానములను పరబ్రహ్మము నుగలిగియుండి, ఆయన నుద్దేశించి చెప్పునట్టివే. వాని విశదీకరణ మిట్లున్నది :-

"యోగజన్యమైనది అపరోక్ష జ్ఞానము వేదశాస్త్రజన్యమైనది పరోక్ష జ్ఞానము. ఈ రెండింటిలో - అపరోక్ష జ్ఞానమే పరబ్రహ్మప్రాప్తికి ఉపాయభూతమైనది. ఏ జ్ఞానము ఆగమ జన్యమో, దానికి అది ఉపాయము. ఏజ్ఞానము ఋగ్వేద, యజుర్వేద, ధర్మశాస్త్రాది మూల గ్రంథములయందు వివరింపబడినదో, అది పరోక్షజ్ఞానము. వేదములోనుండి ఉత్పన్నమైన ఈ జ్ఞానమే పరబ్రహ్మ సాక్షాత్కారమునకు హేతు భూతము. ఎందుచేత ననగా - వేదము, తత్సంబంధిత ఇతిహాస, పురాణ, ధర్మశాస్త్ర, మీమాంస మొదలగు గ్రంథములు కూడి, బ్రహ్మజ్ఞానమునకు మూలకారణము. ఈ విధముగ దీనివలన అక్షర మధిగమ్య మగుచున్నదో అదే 'పరత్వము' అని తెలియు నట్టి జ్ఞానము - 'ఉపాసనము' అని పిలువబడును అది పరబ్రహ్మ సాక్షాత్కార రూపమగు భక్తి రూపాపన్నమైన జ్ఞానము."

— (శ్రీభాష్యము : 1 - 2 - 23.)

ఇచ్చట 'ఉపాసనము' అనునది – 'న్యాసమునకు, స్మృతికి సమానమైనదిగా చెప్పబడినట్టిది 'యోగము'గా గుర్తింపబడియున్నది. శ్రీమద్రామానుజులు బ్రహ్మజ్ఞాన సంబంధమగు మరొక ముఖ్యమైన భేదము - భక్తిరూపమైన ఉపాసనను పేర్కొనియున్నారు.

ముక్తి నొందుటకు శ్రుతులనుండి బ్రహ్మజ్ఞానము నొంది' మనోనేత్రము ముందు స్పష్టముగా ఏర్పాటు గావించుకొనునంతవరకు ధ్యానమొనర్చినంతమాత్రమున సరిపోదు. జీవుడు పరబ్రహ్మముచేతనే ఎన్నుకొనబడ (అనుగ్రహింపబడ) వలయునని తెలియజెప్పబడినది. అందులకు దృష్టాంతముగ కఠోపనిషత్తులో ఇట్లు చెప్ప బడినది: –

"ఈ (ఆత్మ) బ్రహ్మము, (ప్రవచనము) వేదాధ్యయనము వలనగాని' (మేధా। ధ్యానమువలనగాని, (శ్రుతేన) గొప్పనైన వినికిడివలనగాని, పొందరానట్టిది. ఆ పరమాత్మ ఎవరి నెన్నుకొనునో, (అనుగ్రహించునో) అతడే ఆయనను పొందును. వానికే ఆయన తన రూపమును సువ్యక్త మొనర్చును."

**(కఠోపనిషత్తు : 2 - 23)**

శ్రీమద్రామానుజులు 'ప్రవచనము'ను మననముగ 'మేధా' అనుదానిని నిది ధ్యాసనముగ వివరించిరి. బ్రహ్మము చింతనచేతగాని, యోగము (ధ్యానము) చేతగాని పొందబడగలవాడు కాడని, ఎవడు పరమాత్మ చేత ఎన్నుకొనబడునో (అనుగ్రహింపబడునో) అతడే ఆయనను పొందునని పైన ఉదాహరింపబడిన ఉపనిషత్సూక్తి సారాంశము. ఏది ఎట్లున్నను, శ్రీమద్రామానుజులు, 'మోక్షము కేవలము పరమాత్మ అనుగ్రహమువలననే' అని ఉపనిషత్సూక్తిని అన్వయించి చెప్పుటలేదు. వారు, పరమాత్మ తనకు ప్రియమైనవాడెవ్వడో, వానినే మోక్ష మిచ్చుటకై ఎన్నుకొనుననియు, ఎవనికి పరమాత్మయందు అనవధికాతిశయప్రీతి గలదో, అతడే పరమాత్మకు ప్రియతమమైనవాడనియు, వేదార్థసంగ్రహమున [1] వివరించియున్నారు. అందు

1. వేదార్థ సంగ్రహము : 444. పుట 173.

వలన, యోగ మనునది పరబ్రహ్మము నెడ పరిణతి చెందిన భక్తిగా వ్యక్తీకరింపబడునదై యుండవలయునని, చెప్పబడినది. అంతే కాక, ఎవని భక్తి ప్రత్యేకమైనదై, అచంచల మైనదై, పరము పురుషుని యొగికోపాసనారూపమై, ఆయనకు అత్యంత ప్రీతికర మగునో, ఆ యోగి మాత్రమే పరమాత్మునిచే (ఎన్నుకొనబడి) ముక్తి నొందింప బడునని వివరింపబడినది.

శ్రీభాష్యమున :-

"బ్రహ్మజ్ఞానముయొక్క స్పష్టమైన రూపమును గలిగియుండి - ఎవనికి స్మృతి మిక్కిలి ప్రియమైనదో, తద్ద్వారా - స్మృతి యొక నను వగు పరబ్రహ్మము ప్రియమైనవాడో, అతడుమాత్రమే పరమాత్మ చేతఎన్నుకొనబడునని ముక్తినొందింప బడునని, ఇంకను విస్తరించి చెప్పబడినట్లు - అతని చేతనే పరమాత్మ పొందబడును. అట్టి రూపము గల ధ్రువానుస్మృతియు 'భక్తి' అనబడును. ఎందుచేత ననగా - 'భక్తి' అను పదమును 'ఉపాసన' అను పదమువలె సమానార్థమును గలిగియున్నది."

— (శ్రీ భాష్యము : 1 - 1 - 1)

వేదార్థ సంగ్రహమున :-

"భక్తియును నిరతిశయ ప్రియావహమైనది. అనన్య ప్రయోజనమైనది. సకలేతరములందును ఉత్సాహము లేనట్టిది. ఈ భక్తిని పొందినవాడే పరమాత్మ చేత స్వీకరింపబడును. అతడే ఆయనను పొందును."

— (వేదార్థ సంగ్రహము : పుట 128)

గీతాభాష్యమునందు -

"ఏ స్మృతి సంతానము (నిరంతర ధ్యానము) ధ్రువానుస్మృతి గలిగి, మిక్కిలి ప్రియమైనదో, ఏది పరమాత్మునిచే స్వీకరింపబడుటకు హేతుభూతమో - అదియే 'ఉపాసన' అని పిలువబడును."

— (గీతాభాష్యము : 7. ఉపోద్ఘాతము)

అందువలన, యొగిక ధ్యానోద్దేశ్యము భక్తిని ఉత్పాదింపజేయుటయే అని తెలియుచున్నది. బ్రహ్మోపాసన మైనట్టిదైన బ్రహ్మాను

గూర్చిన ధ్రువానుస్మృతి, బ్రహ్మమును చక్కగా భావించు ప్రయోజనమును కలిగియుండుటే కాక, ఆ భావము భక్తిని రేకెత్తింపజేయును. ఆ భక్తి తిరిగి ధ్యానమును, అ ధ్యానము యౌగిక దృష్టిని, ఆ దృష్టి గొప్పనైన భక్తిని కలిగించును. ఈ విధముగ యోగమువలన కలుగునట్టి దృష్టి నిజమైన దృష్టి కాదనియు, కానక్కరలేదనియు, ఆ దృష్టి పరమోద్దేశ్యము. కేవలము భక్తిని ఉలత్పాదింపజేయుటయే యనియు, శ్రీమద్రామానుజులు అభిప్రాయపడినట్లు తెలియుచున్నది. అంతే కాక, యోగ మనునది - ఒక్కసారి మాత్రమే ఆచరించు కార్యముకాదు. మోక్షమనునది ఆత్మావగాహనకు, బ్రహ్మమును తెలిసికొనుటకు కారణమైన యౌగికజ్ఞాన ఫలితము గాదు. అంతకంటె అది భక్తి ఫలితమనియే చెప్పవలయును. యోగ మనునది ప్రతిదినము - అనగా దేహత్యాగమువరకు మరల మరల అభ్యసింపవలసినట్టిదని అభిప్రాయపడిరి. అందులకు శ్రీమద్రామానుజుల యీ క్రింది వాక్యములు ప్రోద్బలకములు :-

"ధ్యానము జీవిత ప్రాధమిక వ్యవహారమున ప్రారంభింపబడినప్పటినుండి, మరణ పర్యంతము నిర్వహింపవలయునని వేదము ప్రకటించుచున్నది."

- (శ్రీభాష్యము : 4 - 1 - 12)

"వేదార్థము తిరిగి తిరిగి ఆచరించు విద్యలచేతనే (జ్ఞాన కర్మం చేతనే) నెఱవేర్చబడును. ఎందుచేత ననగా, వేదోపదేశము - 'ధ్యానము, ఉపాసనము' అను పదములకు ఏకార్థముగల 'వేదన' అను పదముద్వారా తెలియజేయబడుచున్నది."

- (శ్రీభాష్యము : 4 - 1 - 1)

"ధ్యానమే చిన్తనము. చిన్తనము స్మృతి సంతతి రూపము. స్మృతిమాత్రము గాదు"

- (శ్రీభాష్యము : 3 - 4 - 30)

"ఏ జ్ఞానము ముక్తి సాధనమో, అది వాక్యార్థజ్ఞానేతరమైనది. అది ధ్యానోపాసనాది శబ్దములచే చెప్పబడినది. విశదతను ప్రత్యక్షతాపన్న స్మృతిరూపమైనది. నిరతిశయ ప్రియమైనది. అహరహము అభ్యాసాధ్యేయాతిశయమై, ఆమరణాంతము అనువర్తమానమైనది."

- (శ్రీభాష్యము : 3 - 4 - 26)

శ్రీమద్రామానుజులు మోక్షోపాయముగ యోగమును ఏ విధముగ అంగీకరించి నిర్వచించియున్నను, యోగమునుగూర్చి వారు ఉదాహరించునప్పుడు, పతంజలి క్రమబద్ధ మొనర్చిన యోగము, వారి మనస్సునందు నిర్దుష్టముగ నెలకొనియే యున్నది. వారు ఇతరుల దృక్పథములను ఖండించు సందర్భమున, తమ అభిప్రాయములను శ్రీభాష్యమున విశదీకరించిరి. అంతే కాక, వారు కపిలుని సాంఖ్యమునందు తమకు సమ్మతముకాని అంశములను ఖండించి, యోగాంశములను పరిశీలింప బూనుకొనిరి. యోగమునుగూర్చి వారు -

''వేదాంతము యోగస్మృతిచేత బలపరుపబడుచున్నట్లు కనుపించవచ్చును. ఎందుచేతననగా, 1. యోగస్మృతి భగవంతుని ఉనికిని సమ్మతించుచున్నది 2. వేదాంత గ్రంథములు అంతిమమున మోక్షమునకు యోగమే సాధనమని తెలియజేయుచున్నవి. 3. యోగస్మృతిని ప్రకటించుటకు యోగ్యతగలవాడు' అను వాదనలు - వానినవే క్రింది విధముగా ఖండించుకొనుచున్నవి. అవి - మొట్టమొదటిదే, బ్రహ్మమునుండి స్వతంత్రమైన ప్రధానము ప్రకృతి - సాధారణ కారణమై యున్నందున, భగవంతుడు వానిచేత కార్య కారణమైనవాడుగ నమ్మతింపబడియున్నాడని యోగము విశ్వసించుచున్నది. రెండవది - యోగమును గలిగియుండు ధ్యానరీతి, ధ్యానవస్తువు యొక్క పద్ధతి ననుసరించి నిర్ణయింపబడును. 'ఆత్మ, భగవంతుడు' అను రెండు పదార్థములలో - ఆత్మకు బ్రహ్మమునందు అస్తిత్వము లేదు. బ్రహ్మము ప్రపంచమునకు కారణభూతుడు కాకుండుటయే కాక, ఆయనయందు దెట్టి కల్యాణ గుణములు లేవు. యోగము వైదిక లక్షణములు కలిగినది కాదు' అనునవి."

**— (శ్రీభాష్యము : 2 - 1 - 3)**

అంతే కాక, శ్రీమద్రామానుజులు - హిరణ్యగర్భుడొక సాధారణమగు ఆత్మరూపమైనవాడని, అందువలన, అతని వేదాంత గ్రంథముల వ్యాఖ్యానములు విశ్వసింపదగినవి కావని భావించిరి. ఈ విధముగ వారు యోగ సిద్ధాంతమును ప్రత్యక్షముగ విమర్శించిన తీరుతెన్నులు కానవగును.

శ్రీమద్రామానుజులు యోగ సిద్ధాంతము చెప్పినట్టి ప్రపంచ దృష్టినిగూడ తిరస్కరించిరి. ఈ సిద్ధాంతము జీవబ్రహ్మలకు సంబంధము

లేదని భగవంతుడు ఈ సమస్త ప్రకృతి - సృష్టి స్థితి లయములతు కారణుడు కాడని, అందువలన ఆయన పరమాత్ముడు కాడని చెప్పుచున్నందున, వారికి సమ్మతము కాలేదు. అయినను, శ్రీమద్రామానుజులు యోగసిద్ధాంతమును పరిపూర్ణముగ తిరస్కరించిరని చెప్పుటకు వీలు లేదు. పాంచరాత్ర సారస్వతము వైదికమైనందున, ప్రామాణికమైనదని వారిట్లు వాక్రుచ్చిరి :-

"సాంఖ్యము, యోగము, వేదములు, అరణ్యకములు ఒకదాని కొకటి భాగములై, ఒకే సత్యమును (పరమాత్మ తత్త్వమును) ప్రతిపాదించుచున్నందున, అవి యన్నియును కలిసి 'పాంచరాత్రము' అని పిలువబడుచున్నవి. సాంఖ్యము 25 తత్త్వములను వివరించియున్నది. యోగము మానసిక ఏకాగ్రతకు సంబంధించిన కొన్ని సాధనములను (అభ్యాసములను), యమ - నియమాదులను బోధించుచున్నది. ఆరణ్యకములు సమస్తమైన ఉపమూలసూత్రములను, తమ అస్తిత్వమును బ్రహ్మము నందే కలిగియున్నవి. యోగమునం దనుభవించునట్టి మానసిక ఏకాగ్రత బ్రహ్మోపాసన ప్రకారత్వమని, వేదమునందు నిర్దేశింపబడిన నిత్య నైమిత్తికమైన కర్మలు బ్రహ్మానుగ్రహము నొందుటకు సాధనములు. శారీరక శాస్త్రములో - యోగమును గూర్చి విమర్శ చేయునపుడు, భగవంతుడు ఉపకార కారణ మను అభిప్రాయమును ఈరకే ఖండించును. అయినను, అది యోగమును తిరస్కరింపదు.......  ఈ సిద్ధాంతము లన్నిటియందలి అత్యవసరాంశములను స్వీకరింపబడవలయును. జినుని, సుగతుని బోధనలు కొట్టివేయబడినట్లు, వీనిని పూర్తిగ తిరస్కరింపరాదు."

— (శ్రీభాష్యము : 2 - 2 - 43.)

అందు చేత, శ్రీమద్రామానుజుల దృష్టిలో సాంఖ్యమునందును ఆరణ్యకములందును, సముచితమైనవిగా జెప్పబడిన శాస్త్ర భాగములు ప్రధానమైన సిద్ధాంతములుగా పరిగణింపవలయును. అంతే కాక, యోగమును గూర్చి ఉదాహరింపబడిన విశేషములును వారికి ముఖ్యమైనవని గ్రహించవలయును. తాము ఉద్దేశించిన మోక్షోపాయమును గూర్చి తెలియ జెప్పుటకు శ్రీమద్రామానుజులు - 'యోగస్య చ బ్రహ్మోపాసన ప్రకారత్వమ్' అను దానిని తిరిగి తిరిగి ప్రయోగించిరి.

శ్రీమద్రామానుజులచేత నిర్దేశింపబడిన 'ధ్యానము' పతంజలి చెప్పిన అష్టాంగములలో ఏడవది. బ్రహ్మజ్ఞానమును గూర్చి వివరించునప్పుడు శ్రీమద్రామానుజులు - 'ధ్యానము'నే మూల పదముగ గ్రహించి, దానిని - 'స్మృతి, ఉపాసన, భక్తి' అను పదములకు అనువర్తించి, నిర్వచించి చెప్పిరి. అంతే కాక, అష్టాంగయోగములోని ఆరు దశలను మాత్రమే గైకొని, పదపడి యగు ధ్యానమును పరిపూర్ణముగ క్రొత్త దృక్పథముతో నిర్వచించి, ఎనిమిదవదగు సమాధిని వదలివైచిరి.

## 4. బ్రహ్మజ్ఞానము - ఆచార కర్మలు

శ్రీమద్రామానుజులు అవిద్య (అజ్ఞాన) స్వభావమును గూర్చి తెలియజేయుచు, ధ్యానమునకు శ్రుత్యానుగుణ్యముగ విధింపబడిన ఆచార కర్మల ఆచరణకు గల సంబంధమును నిర్దేశింపబూనిరి. మోక్షము నందగోరువానికి, భక్తిరూపాపన్నమైన యౌగిక ధ్యానము మాత్రమే అభిలషణీయము గాదు. శ్రుతి విధించిన వర్ణాశ్రమ ధర్మానుగుణమైన నిత్య నైమిత్తిక కర్మలనుగూడ ఆచరించవలసియుండునని తెలియజేయబడినది. ఇవి కేవలము వేదమునందు వివరించబడియున్నందున, వేదము పరమ పురుషుని ఆజ్ఞారూపమై యున్నందున ఇవి తప్పనిసరిగా ఆచరింపవలయును. కాని, వాని నాచరించుటలో గల ముఖ్యకారణమే మనగా, అట్టి కర్మము యౌగిక ధ్యానమునకు పుష్టి నిచ్చునది.

"ముముక్షువునకు యజ్ఞ దాన తపఃప్రభృతి వైదిక కర్మలు ఎప్పుడును త్యజింప దగినవి కావు. అవి ఆమరణాంతము ఆచరింపబడవలసినవి. ఎందుచేత ననగా - యజ్ఞ దాన తపస్సాదిగా గల కర్మలు, వర్ణాశ్రమ ధర్మములతో ముడిపడి యుండి, మననశీలుడైన మనీషిని పవిత్ర మొనరించును. మనన మనగా - ఉపాసనము. ముముక్షువులైనవారు యావజ్జీవము ఉపాసన చేయవలయును.... .... ఉపసనా నిష్పత్తివలన, విరోధియైన ప్రాచీన కర్మ వినాశ మగును."

— (గీతాభాష్యము : 18 - 5)

శ్రీ భాష్యములలో -

"కర్మసంచితమైన అజ్ఞానముతొలగుటకు కేవలము వేదార్థ వివేకజ్ఞానముగాని, సత్యము నెఱుంగగల బుద్ధిగాని సరిపోదు. ఏ జ్ఞానమునకు కర్మను నశింపజేసి, తద్వారా అజ్ఞానమును తొలగించునట్టి శక్తి గలదో, అజ్ఞానమునకు సరియైనవి ధ్యానమును, భక్తియును. యజ్ఞ యాగాది క్రతువులేకాక, మతపరమైన నిత్య నైమిత్తిక కర్మ లన్నియు, భక్తియుతమైన బ్రహ్మజ్ఞానము నుత్పాదించుటకు సాధనములు. బ్రహ్మమును చేరుకొనుటకు సాధనమైన జ్ఞానమును బడయుటకు, జీవితమునందు వివిధ దశలలో విధింపబడిన కర్మలను, సక్రమముగ విచారించి విధి నిషేధములను దెలిసికొని, ఏ కర్మ లత్యావశ్యకమో, ఏ కర్మలు సామాన్యములో వివేచించి ఆచరించుట - బ్రహ్మజ్ఞానావాప్తికి హేతుభూత మగును."

— ( **శ్రీభాష్యము : *1 - 1 - 1*** )

జ్ఞానాభివృద్ధికై కర్మల నాచరించుచునే యుండవలయునని వేదములు ఆజ్ఞాపించుచున్నవి. కాని, శ్రీమద్రామానుజులు - జ్ఞానము ధ్యాన రూపమై యుండి, మరణ పర్యంతము ప్రతిదిన మభ్యాస మొనర్చ వలసియున్నందున, కర్మలును ఆ విధముగనే మరణము సంభవించునంత వరకు తప్పక అచరించుచు, ధ్యానమున కాధారమై నిలుపవలయునని సాయించిరి.

"గమన సాధన భూతమైన అశ్వమునకు జీను, కళ్ళెము మొదలైన బంధన పరికరము లెట్లవసరమో, మోక్షసాధనభూతుడైనవానికి ధ్యానము, నిత్యనైమిత్తి కాది కర్మపరికరముల సాహాయ్య మవసరమై యున్నది."

— ( **శ్రీభాష్యము : (*3 - 4 - 26*)** )

అందువలన, కర్మాచరణ మనస్సును ధ్యానమునకు సమాయత్త మొనర్చునని తెలియుచున్నది. అంతే కాక, శ్రుతులలోను, ఈ విషయమే ప్రతిపాదింపబడినట్లు క్రింది శ్రుతి వాక్యము సాక్ష్య మిచ్చుచున్నది :-

"బ్రాహ్మణులు వేదాధ్యయనమువలన, యజ్ఞములవలన, దానములవలన తపస్సులవలన, ఉపవాసములవలన బ్రహ్మమును తెలికొనబూనుదురు."

— ***( బృహదారణ్యక ఉపనిషత్తు : 4 - 4 - 22)***

ఇందలి విశేషమును విపులీకరించుచు శ్రీమద్రామానుజులు క్రింది విధముగా వ్రాయించిరి :-

"వారు యజ్ఞాచరణ సాధన ద్వారా తెలిసికొనబూనుదురు' అనునది - యజ్ఞములు జ్ఞానమును కలిగించు సాధనములని ఒకవేళ అవగాహన చేసికొనియున్నచో, చెప్పబడవలసినది. ఒకడు ఉత్తగా చెప్పవచ్చును. ఏమని ? 'అతడు కత్తితో చంపుట కభిలషించును' అని. ఎందుచేత ననగా - కత్తి చంపునట్టి సాధనముగా సమ్మతింపబడుటచేత." — (శ్రీభాష్యము : 3 - 4 - 26)

దీనివలన, ఇచ్చట చెప్పబడిన జ్ఞానము, కేవలము శ్రుతిసూత్రముల భావమువలన కలిగినట్టిది కాదని, పైన వివరింపబడిన ధ్యాన సంబంధమైనదని తెలియుచున్నది. వారు దాని నింకను విస్తరించుచు, ఈ సందర్భమున — జ్ఞానమును దానిని గూర్చి మన మేమి యవగాహన చేసికొనవలసియున్నదో తిరిగి తిరిగి వివరింపబూని :.

'అది కేవలము గ్రంథముల భావములను దెలిసికొను స్వభావము కాక, దానికంటెను ఇతరమైన 'మానసిక శక్తి' ప్రత్యేకముగ 'ధ్యానము' లేక 'ఉపాసనము' అను పదములద్వారా తెలియజేయుబడునట్టిది. అది స్మృతిస్వభావము గలది. ప్రత్యక్షముకన్న, ఏ మాత్రము తక్కువ కానిదైన, సహజ జ్ఞానమువలన సంభవించునట్టిది. అపరిమిత ప్రీతి గలది. అది ప్రతి దినము, ఎడతెగకుండ అభ్యాసమొనర్పబడి, మరింత సంపూర్ణమై, మరణ పర్యంతము చక్కగా కొనసాగింపబడి, చివరకు మోక్షము నొందించును." — (శ్రీభాష్యము : 3 - 4 - 26)

అని విశదీకరించిరి. ఈ విధమైన జ్ఞానము పరమపురుషుని దయవలననే ఉదయించుననియు, ప్రతిదినము నిత్యనైమిత్తికమైన కర్మాచరణచేత ఆయన సంతోషించినప్పుడే ఆయన కరుణ కలుగుననియు తెలియుచున్నది.

"భక్తునిచేత ప్రతిదిన మాచరింపబడు యజ్ఞము, ఆరాధనాది వివిధ కర్మలచేత సంతోషించి, సమాధానపడినవాడగు పురుషోత్తముని అనుగ్రహము ద్వారా వాని మనస్సునందు అట్టి ధ్యానము ఉద్భవింపబడుచున్నది."

— (శ్రీభాష్యము : 3 - 4 - 26)

శ్రీమద్రామానుజుల దృష్టిలో ప్రకృతి సంబంధ మనునది వాస్తవమైనది. ఒక్కొక్క ఆత్మ (జీవుడు) తా నాచరించిన కర్మాను గుణ్యముగ ప్రాకృత దేహమున బంధింపబడుననీ, ప్రకృతియందు బంధించు అవిద్య అనునది కేవలము తెలివితక్కువతనము కాదనియు, అది కర్మరూపమైనదియు ఆత్మయొక్క స్వాభావిక గుణమైన జ్ఞానము పూర్వకర్మచేత గప్పబడియుండుననియు, ఆ కర్మ, ఆత్మగ్రహణశక్తిని పరిమిత మొనర్చుననియు, తత్ఫలితమున ఆత్మ ప్రాకృత దేహమున ప్రవేశించినప్పుడు, తనది కానిదైన దేహము తనదని ప్రమాదపడి, ఈ దేహముయొక్క కోరికలను తృప్తినొందించుటకై, ఆ యా పనులు చేయుచుండుననియు, అట్టి శారీరక ప్రేరణ గలిగిన పనులు ఆత్మకు ప్రకృతిబంధమును స్థిరపరచుననియు, వారు స్పష్టీకరించిరి. అంతేకాదు - వేదార్థసంగ్రహమున -

"ఇదే సర్వశాస్త్రముల ప్రధాన సారము. ప్రత్యేకమైన ఆత్మలు (జీవులు) సంక్షేపముకాని, అపరిమితమైన, పరిపూర్ణజ్ఞానము కలవి. కాని, అవి కర్మ రూపమైన అజ్ఞానముచేత ఆవరింపబడి యుండును అందువలన, అవి కర్మయుక్తమైన జ్ఞాన సంక్షేపమునకు లోనై యుండి, బ్రహ్మనుండి గడ్డిపరకవరకు పెక్కు రకముల తరగతుల దేహములలో ప్రవేశించును. వాని నావరించుకొనియుండు వివిధ దేహములనుబట్టి, అప్పుడు వాని జ్ఞానశ్రేణి (ప్రాప్తి)కి పరిమితమై యుండును. అందుచేత, ఈ ఆత్మలు, వివిధములైన తమ శరీరములలో, తమను తాము గుర్తించుటకు దీసికొనిపోబడి, ఆ గుర్తింపువలన అనుసరించి వచ్చు పనులను చేయును కనుక, అవి సంసార తరంగమున ప్రవేశించును."

—(వేదార్థ సంగ్రహము : పుట 237.)

కేవలము వేద గ్రంథముల గ్రహించుటవలన కలిగిన జ్ఞానమే సంసార బంధమును తొలగించుటకు సమర్థము కాదు. పైన ఉదాహరించి నట్లుగ, కర్మ మాత్రమే ఆత్మను బంధించుటలేదు. అందులకు ●రవు

పురుషుని సంకల్పమే కారణమని, ఆత్మ నిర్వర్తించు కర్మలు పురుషోత్త మునికి తృప్తి కలిగించినచో, ప్రతిఫల మిచ్చునని, అసంతృప్తి కలిగించి నచో శిక్షించునని తెలియుచున్నది. దీనిని శ్రీమద్రామానుజులు శ్రీ భాష్యమున నిట్లు సాయించిరి :-

"వేదము ఏవి మంచి కర్మలో, ఏవి దుష్కర్మలో ఎఱుక పరచి, తద్ద్వారా ఏవి పరమ పురుషుని సంతృప్తి నొందించునో, ఏవి అసంతృప్తి నొందించునో తత్ఫలితముగ కలుగునట్టి తృప్తియో, బాధయో - భగవంతుని దయా దాక్షిణ్యము లపైగాని, కోప తాపములపైగాని ఆధారపడియుండునని వివరించును."

— (శ్రీ భాష్యము 3 - 2 - 37)

"సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, అపార కరుణా సముద్రుడునైన భగవంతుడు - యజ్ఞ, దాన, పూజాదికములచేత, ధర్మనిష్ఠగల ధ్యానముచేత, ఈ లోకము నందు పరలోకమునందును వివిధ రీతులుగ సుఖానుభవములను, తన నిత్యవిభూతిని పొందునట్టి మోక్షమును దయచేయు స్థితిని (శక్తిని) గలిగి యున్నాడు. కాని, సూక్ష్మబుద్ధిహీనమైనది, క్షణభంగురమైనదైన కర్మము, భవిష్యత్కాలముతో ముడిపడియున్న ఫలితమును గలిగించుటలో అసమానమైనది."

— (శ్రీభాష్యము : 3 - 2 - 37)

భగవంతుడు తన దయా దాక్షిణ్యములద్వారా సంసార బంధనము నిర్ణయించియున్నాడు. ఆత్మకు ఏ కర్మ స్వాభావికమైనదో, ఏ కర్మ చేయుటకు ఆత్మకు శక్తి గలదో, అట్టి పరిస్థితినే భగవంతుడు నిర్ధా రించియున్నాడు. ఆయన, ఏ విధమైన కర్మ చేయవలెనో, ఏ విధమైనది చేయరాదో వివరముగా విప్పి చెప్పి, సత్కర్మ సత్ఫల మివ్వగలదనియు వివరించియున్నాడు. అంతేకాక, తనను సంతోషపెట్టుట కెవడున్ముఖుడై యుండునో, వానికి సహాయ మొనర్చుట కనువుగా - తనకు తాను, వానికే అంతర్యామియై యుండును. ఆయన తన ఆజ్ఞోలంఘన నుపేక్షింపజాలడు. కాని, ఆయన ఆత్మకు క్షేమమును గలుగజేయుట కొఱకే, ఆ యా పద్ధతిలో శిక్షించును. ఈ విశేషమును ప్రతిపా

దించుచు శ్రీమద్రామానుజులు శ్రీభాష్యమున నిట్లు వివరించి యున్నారు :-

"భగవంతుడైన పరమపురుషుడు - తన మాహాత్మ్యమున కనుగుణముగ జీవులకు జ్ఞానమొసగియుండి, కొన్ని కర్మలు మంచివనియు, కొన్ని కర్మలు చెడువనియు నిర్ణయించి, ఆత్మలకు శరీరములను, ఇంద్రియములను, వాని నియమన శక్తి నిచ్చును. ఆయన ఆ ఆత్మలలో అంతరాత్మగ ప్రవేశించియుండి, అనుమంత్రించి, నియమన మొనరించుచుండును. ఎప్పుడీ ఆత్మలు తమ వాంఛానుగుణ్యముగ మంచి (పుణ్యమైన) లేక చెడు (పాపమైన) పను లొనర్చునో, అప్పుడు భగవంతుడు, ఎవడు తమ ఆజ్ఞానువర్తియై సత్కర్మ లొనరించుచున్నాడో గుర్తించి, అతడు చతుర్విధ పురుషార్థములగు ధర్మార్థ కామ మోక్షములందు అభివృద్ధి జెందునట్లు, జేసి, దీనికి వ్యతిరేకముగ తన ఆజ్ఞ నతిక్రమించు నితనికి విపరీతమగు (వ్యతిరిక్తమగు) ఫలితమును గలిగించును."

— (శ్రీ భాష్యము : 2 - 2 - 3)

కర్మలు మనస్సును పవిత్ర మొనర్చునవియై యుండి, ఫలాపేక్ష రహితముగ ఆచరింపబడవలయు నని అద్వైతులు చెప్పియున్నారు. శ్రీమద్రామానుజులు దీనితో ఏకీభవించిరి. వేదవిహితమైన నిత్య నైమిత్తిక కర్మలు ఫలాపేక్షదృష్టితో (ధన కనక వస్తువాహనములు, స్వర్గసౌఖ్యములు మున్నగునవి కావలయు నను దృష్టితో) ఆచరించిన, ప్రతిఫల మందింపబడును. కాని, దాని కొసగబడు ప్రతిఫల మెట్లో, అటులనే శిక్షయును బాధ్యత వహించును. భగవంతు డాజ్ఞాపించినది ఆచరించకుండుట ఆయనకు కోపమును తెప్పించును. ఐనను, ఫలాపేక్షతో చేయబడిన పుణ్య పాపకర్మలు రెండును బాధ్యత వహించును. అయినను, మొదటిదగు పుణ్యము, సంతోషదాయక మగుచుండ, రెండవదైన పాపము బాధాకర మగుచున్నది. అందువలన, మోక్షార్థియైనవాడు - పరిమిత ఫలితము నాశింపక, విధ్యుక్త కర్మలను తప్పక ఆచరించవలయునని తెలియుచున్నది. ఈ అంశమును నిర్ధారించుచు శ్రీమద్రామానుజు లీ విధముగ విశదీకరించియున్నారు :-

"పుణ్య పాప కర్మలన్నియు జ్ఞానమునకు విరోధులు. మీదు మిక్కిలి అవాంఛనీయ ఫలితమును సమానముగ రేకెత్తింపజేయునట్టివి. అవి రెండును దుష్టకర్మలనియే అనవచ్చును. అందువలన, జ్ఞానాభివృద్ధికిగాను దుష్టకర్మలనుండి తప్పించుకొనవలసియున్నది. నశ్వర ఫలితములపై దృష్టి మళ్ళింపక, భగవద్భక్తియుతమైన కర్మల నాచరించుట ద్వారా ఇది నెఱవేరును."

— (శ్రీభాష్యము : 1 - 1 - 1)

దీనివలన, విధ్యుక్త కర్మలు కేవలము పరమాత్ముని తృప్తి నొందించు కోరికతో మాత్రమే ఆరాధనా రూపమున ఆచరింపవలయునని విదితమగుచున్నది. వేరొకచోట -

"శాశ్వత కర్మప్రవాహరూపమైన అజ్ఞానమునుండి ప్రకృతిబంధమేర్పడుటవలన అది మనము అభివృద్ధి చెందించుకొను (పరిపోషించుకొను) జ్ఞానముద్వారా మాత్రమే నశింపజేయబడును. అట్టి జ్ఞానము - వర్ణాశ్రమ ధర్మయుతమైన మానవుని నిత్య నైమిత్తికమైన కర్మాచరణమువలననే పొందవలసినట్టిది. అట్టి కర్మాచరణ, పరమాత్మ స్వభావమును నిరంతరము తలపింపజేయుటద్వారా పవిత్రీకరించి, పరమాత్మ అనుగ్రహమును పొందు ప్రవృత్తిని కలిగించును. కేవల కర్మలు - పరిమితమైన, అశాశ్వతమైన ఫలితములను మాత్రమే ఉత్పాదించును. అటుల కాక, నశ్వర ఫలితము నుద్దేశించనివి, పరమపురుషుని తృప్తి నొందించుట కుద్దేశించిన కర్మలు, భక్తియుతమైన ధ్యానస్వభావముల జ్ఞానమును గలిగించి, తద్ద్వారా - అపరిమితమైనది, శాశ్వతమైనదియునైన సర్వాంతర్యామి - బ్రహ్మముయొక్క సహజ జ్ఞానమును గలిగించును"

— (శ్రీభాష్యము : 1 - 1 - 1.)

శ్రీమద్రామానుజులు ధ్యానమునకు ఆచార కర్మలకుగల ఈ సంబంధదృష్టిని, వాక్యకారుల వేదముయొక్క ఉదాహరణద్వారా బలపరచి. రివాక్యకారులు ధ్రువానుస్మృతిఅనునది వివేకము-అపరిశుభ్ర ఆహారమును మానివేయుటవలన విమోకము - కోరికలకు దూరముగ నుంగుటవలన అభ్యాసము - తిరిగి తిరిగి ఆచరించుటవలన క్రియ - యజ్ఞ యాగాది క్రియలవలన కల్యాణములు - కల్యాణ గుణముల

వలన అనవసాదము - నిర్విచారముగ నుండుటవలన, అనుద్ధర్షము - విజయానందము నొందకుండుటవలన కలుగునని చెప్పిరి. ఈశోపనిషత్తు నందు -

"ఎవడు విద్యను, అవిద్యను - రెండింటిని తెలిసికొనునో, అతడు అవిద్య చేత మృత్యువును దాటి, విద్యచేత అమృతమును (అమరత్వమును) పొందును."

*— (ఈశావాస్యోపనిషత్తు : 11)*

అని వివరింపబడినది. ఇట శ్రీమద్రామానుజులు జ్ఞానము (విద్య) అనగా - ధ్యానమని, జ్ఞానము లేకుండుటను (అవిద్య) విధ్యుక్త కర్మ లని శ్రీభాష్యమున వ్యాఖ్యానించిరి.

శ్రీమద్రామానుజుల మోక్షోపాయము వారి సిద్ధాంతము ననుస రించి, వాస్తవిక దృష్టిపై నిర్ధారింపబడినట్టిది. ఇది వైరాగ్యమైన ప్రపంచ పరిత్యాగపద్ధతి కాదు. ప్రాకృతజగత్తు నిజమైనది. బ్రహ్మము నకు శరీరభూతమైనది ప్రత్యేక ఆత్మల ముక్తి సాధనముగ బ్రహ్మము ఈ జడ జగత్తును సృజించియున్నాడు. తనను ధ్యానించి పూజించు నట్లుగ, కర్మాచరణకై ఆత్మకు శక్తి నొసంగియున్నాడు. ప్రత్యేక ముగ ఈ పూజాది సంసేవనము, సేవక - స్వామి సంబంధమున, అనగా శేష - శేషి సంబంధమున నొప్పారునట్టిది. ఆత్మలు జగత్కర్మలను త్యజించుట - భగవంతు డిష్టపడడు. ప్రాకృత వస్తు సంబంధమును త్యజించుటయే ఆయన కిష్టపడునది, ధ్యాన మనునది పరమపురుషుని కారుణ్యముచేతనే మనస్సున ఉదయించుచున్నదని శ్రీమద్రామానుజు లానతిచ్చిన శ్రీసూక్తి - తిరుగు లేనిది.

## 5. దైవ భక్తి - ధార్మిక జీవనము

శ్రీమద్రామానుజుల మోక్షోపాయము - జ్ఞాన, కర్మ, ధ్యాన ముల సమ్మేళనము. అనగా - వేదమునుండి పొందిన సహజమైన జ్ఞాన స్వరూపమును, ఫలాపేక్ష రహితమైన విధ్యుక్త కర్మల ఆచరణ

మును, బ్రహ్మమును గూర్చిన ధ్రువానుస్మృతి గలిగి, ఆయనయందు నిరంతరము వ్యక్తము చేయునట్టి, మహత్తర భక్తియుతమైన ధ్యానమును గలిగినట్టిది. వారు భగవద్గీతలోని, వివిధ యోగములందు వర్ణింపబడినవే కాక, ఉపనిషత్తులలో ఆజ్ఞాపింపబడిన (విద్యలనివారు పేర్కొనిన) ధ్యానములనుగూర్చి చక్కగ విపులీకరించియున్నారు. వేదార్థసంగ్రహములోని ఈ క్రింది పరిచ్ఛేదము - గీతాభాష్య, శ్రీభాష్యముల నుండి గ్రహింపబడు వివరణములను దారి చూపునదై, ఈ ఉపాయమునుగూర్చి తెలిసికొనుటకు కొంత తోడ్పడగలదు.

"పరబ్రహ్మభూతుడగు పురుషోత్తముడు - ధ్యానరూపమైనట్టిదియు, ఇతర వస్తువును గోరనట్టినదియు, అవిచ్ఛిన్నమైనట్టిదియు, అధికతమ ప్రియతమైనదియు, మిక్కిలి స్పష్టమైన జ్ఞాన స్థాయికి చేరినట్టినదియు, నిరతిశయ పుణ్యసంచయమువలన అశేష జన్మోపార్జిత పాపరాశిని క్షీణింపజేయునట్టిదియు, పరమపురుషుని చరణారవిందముల శరణాగతివలన జనితమైనదియు, శమ దమ తప శ్శౌచ క్షమార్జవ భయాభయ స్థాన వివేక దయా హింసాద్యాత్మగుణోపేతమైనదియు, వర్ణాశ్రమోచిత పరమ పురుషారాధనవేష నిత్య నైమిత్తిక కర్మోపాసన గలిగి నిషిద్ధ పరిహార నిష్ఠ గలదియు, పరమపురుష చరణారవిందయుగళమున తనను తాను సమర్పింపజేయునట్టిదియు, నిరంతర స్తుతి, స్మృతి, నమస్కృతి, వందన, యతన, కీర్తన, గుణ శ్రవణ వచన, ధ్యాన, అర్చన, ప్రణామములచేత పరమపురుషుని పరమ కారుణ్యము గలిగించునట్టిదియునైన భక్తిచేతనే పొందదగినవాడు."

– (వేదార్థ సంగ్రహము : 126 పుట.)

ఇట పరమ పురుషుని చరణారవిందముల నాశ్రయించవలసిన ఆవశ్యకత నొక్కి చెప్పబడినది. శ్రీమద్రామానుజులు - అంతర్యామియైన పరబ్రహ్మము యొక్క సహకారమువలననే మోక్షము సాధ్యమగునని, మరల మరల ఎన్నో విధముల ఉదాహరించియున్నారనుటకు ఇదొక నిదర్శనము. దీనివలన భక్తి - మరియు, కర్మరూపమైన ధ్యానము ఆరాధనా రూపమున ఆచరించవలయునని తెలియుచున్నది. శ్రీమద్రామానుజులు తమ పరమ గురువులగు భగవద్యామునాచార్యులు

గూడ పరమపురుషుడు కేవలము అత్యంత భక్తియోగముచేతనే పొందబడవలసినవాడు' అని చెప్పినట్లు ఉదాహరించిరి. 'జ్ఞానకర్మయోగ - భక్తియోగములవలన పవిత్ర మొనరింపబడిన అంతఃకరణము కలవారి చేతనే ఆయన పొందదగినవాడు అని వారు తెలియజెప్పిరి.

పరభక్తినిగూర్చి వర్ణించి చెప్పిన పిమ్మట శ్రీమద్రామానుజులు - అట్టి భక్తి, వేదములనుండి పొందిన జ్ఞానమూలమగు కర్మాచరణ ద్వారా అనుసరించుచు వచ్చు భక్తియోగమునుండి ఉదయించునని ఉద్ఘాటించిరి. మోక్షోపాయమునుగూర్చి గీతాభాష్యమున ఈ క్రింది విధముగ విశదీకరింపబడినది :-

"ప్రీతి విరహిత స్మృత్యభ్యాసము క్లిష్టతరమైనప్పుడు, ఆత్మ ప్రయోజనముపై, అక్షరముయొక్క నిజమైన స్వభావమునందలి తలంపుచేత, ఆ ఆత్మయొక్క అపరోక్ష జ్ఞానము శ్రేయస్కరము. ఎప్పుడు ఆత్మయొక్క అపరోక్ష జ్ఞానముకూడ సాధింపబడదో, అప్పుడు దాని ఉపాయభూతమగు ధ్యానము శ్రేయస్కరము. ఆ ధ్యానము వలనగూడ అది సాధింపబడనిచో, ఆ ధ్యాన సాధనమగు ఫలత్యాగమువలన అనుష్ఠింపబడు కర్మ - శ్రేష్ఠమైనది. ఫలాపేక్షరహితమైన కర్మాచరణమువలన మనస్సునకు శాంతి కలుగును. ఎప్పుడు మనస్సు ప్రశాంత మగునో, అప్పుడు ఆత్మధ్యానము సాధింపబడును. ఆ ధ్యానమువలన, అపరోక్ష దృష్టియు; ఆ అపరోక్ష దృష్టివలన పరభక్తియు సాధింపబడును. భక్తియోగాభ్యాసమునందు అశక్తులైనవారికి ఆత్మనిష్ఠ శ్రేయస్కరమైనది. ఆత్మనిష్ఠులై, అశాంతులయినవారికి ఆత్మ జ్ఞానయుతమైనది, ఫలాపేక్షరహితమైనట్టిది." — *(గీతాభాష్యము : 12 - 13)*

ఇందలి క్రమమును ఇట్లు పేర్కొనవచ్చును. 1. కర్మయోగము (కర్మ నిష్ఠ) 2. ప్రశాంతమైన మనస్సు 3. ధ్యానయోగము (ఆత్మధ్యానము 4. ఆత్మ దర్శనము (ఆత్మపరోక్షజ్ఞానము) 5. పరభక్తి 6. భక్తి యోగము (స్మృతి)

శ్రీమద్రామానుజులు భక్తియోగమను పదమును ఒకచోట పరమపురుషుని భక్తిరూపాన్నమైన ధ్యానమునుగూర్చి, మరొకచోట

ఆత్మదర్శనధ్యానమునకేగాక పరమశ్రేష్ఠుడైన భగవంతుని ధ్యానమునుగూర్చియు ఉపయోగించియున్నారు.

గీతాభాష్యమున -

"మద్గుణానుసంధానకృతమై, మదేకప్రియత్వాకారమైనది ఈ భక్తియోగము."

— (గీతా భాష్యము : 12 - 11)

శ్రీభాష్యమున :-

"పరవిద్యాపరమైన ధ్యానము అన్నిటియందును, ధ్యానవస్తు స్వభావముకన్న ఎక్కువగ ధ్యానము చేయుచుండు విషయ స్వభావ నైజమును తెలిసికొనవలయును. ఎందుచేత ననగా - ధ్యానవస్తువై ఒప్పు బ్రహ్మమునకు, ప్రత్యగాత్మ శరీరముగా కొనసాగును. అందువలన స్వయముగ అది ధ్యానవస్తువర్గము క్రిందకే వచ్చును. అందుచేత, ప్రత్యగాత్మ తన శరీరమై యుండగా, అట్టి ధ్యాన స్వభావము పరవిద్యాపరమైన ధ్యానమై యున్నది."

— (శ్రీభాష్యము : ( 3-3 - 51-2)

గీతాభాష్యమున -

"నన్ను భక్తియోగముతో సేవించువాడు - బ్రహ్మభావయోగ్యుడగుచున్నాడు. అది దానియందే ఉండుటచేత, అతడు అమృతమైన, అవ్యయమైన ఆత్మను పొందగోరుచున్నాడు." — (గీతాభాష్యము : 14 - 26)

గీతాభాష్యముననే వేఱొకచోట

"ఈ విధముగా ధ్యానయోగమును ఆచరించి, అతడు బ్రహ్మ మగుటకు తగియున్నాడు - బ్రహ్మభావమునకు తగియున్నాడు. సర్వబంధ వినిర్ముక్తుడై అది దానియందే యుండుట చేత, ఆత్మను అనుభవించుచున్నాడు."

— (గీతా భాష్యము 18 - 51 - 53)

పైన చెప్పిన గీతాభాష్యములోని చివరి రెండు పరిచ్ఛేదములలో సూచించు భక్తియోగము ధ్యానయోగమునకు తీసికొనిపోవు ధ్యానమునుగూర్చి తెలియజేయబడినది. ఆత్మధ్యానము, పరమ పురుషుని గుణగణములను గూర్చిన ఆలోచన అనునవి రెండును ఆత్మనుండి సర్వశ్రేష్ఠుడగు భగవంతునిపైకి ప్రధాన కేంద్రముగ మారు నిరంతర ధ్యానమే. సూక్ష్మ దృష్టికి భక్తియోగమును ధ్యానమే. ధ్యానమునకు ముందున్న ఆత్మ ధ్యానము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యా

హారము, ధారణము ఆచరించుటను చూపబడును. శ్రీమద్రామాను జుల పతంజలి యోగముయొక్క లక్ష్యము అవగాహన కాదు. ఏదె ట్లున్నను పరమాత్మధ్యానమునకు మంచి దవసరమై యున్నట్టిది, ప్రకృతినుండి వేరై, పరమాత్మకు శేషభూతమై యుండు ఆత్మదర్శన దృష్టి - స్మృతిరూపమైన ధ్యానమునకు ఆధారము.

ధ్యానయోగము ఆత్మ ధ్యానముగా చెప్పబడినది. దాని తత్ క్షణాశయము ఆత్మదర్శనము. ఈ ఆత్మదర్శనము దానియం దంతము గాక, ధారణ - ధ్యానముల మధ్య సంబంధమై యొప్పును. ఆత్మదర్శ నము పరమాత్మపరమైన ధ్యానమునకు మార్గము కలిగించును. ఇట యోగపదముయొక్క అవగాహనను విస్తృత మొనర్చుకొనవలసి యున్నది. ఫలాపేక్షరహిత విధ్యుక్త కర్మాచరణము కర్మయోగమని పరిగణించవలసియున్నది. ధ్యాన, భక్తి యోగములు రెండును శ్రీమ ద్రామానుజులు ప్రత్యేకముగ సంభావించిన పతంజలి అష్టాంగయోగ మును తెలియజేయుచున్నవి. ధ్యానయోగ మనుపదము ప్రత్యేకముగ కర్మయోగమునుండి పతంజలి - పద్ధతి యోగమును వివేచించి చెప్పు టకును, భక్తియోగ మను పదమును తమ పతంజలి - పద్ధతి యోగో ద్దేశ్యమును, ముఖ్య లక్షణమును సూచించుటకుగాను, వారు ప్రయో గించిరని తోచుచున్నది. ఈ నిర్ణయములపై ఆధారపడి వేదార్థసంగ్ర హమునందు జెప్పబడిన భక్తియోగము, ధ్యానయోగమును గలిగినట్టి దని గ్రహింపవచ్చును.

గీతాభాష్యమున -

"మోక్షార్థియైనవానికి, శమ దమాది గుణములను అభివృద్ధి జెందించుకొనుట యును సాధారణముగా ఉపయోగకరమైనదే అని సంప్రదాయ గ్రంథములు జెప్పు

చున్నవి. అయినను, అ దొక యోగ స్వభావము కాదు. శమ దమాది గుణములు ఆత్మజ్ఞాన సాధనములుగ గైకొనవలసినట్టివి."

— (గీతాభాష్యము : 3 ఉపోద్ఘాతము)

అని వివరింపబడినది.

అవి 'ఆత్మజ్ఞానోపదేశ గుణములు' అని, దానియందే మరొక చోట (గీతా.భా. 13-11) చెప్పబడినది. ఈ విధముగ గీతాభాష్యమున అనేక సందర్భములందిది ఉదాహరింపబడియున్నది.

భక్తియొక్క ధ్యానేతరమైన స్తుతి, నమస్కృతి వంటి ముఖవైఖరి (ప్రకటన) కూడ సాధారణముగా ఆత్మజ్ఞానమునకంటె పర విద్యకు మాత్రమే సంబంధించి, సహకారి యగునని తెలియజేయ బడినది.

"నృత్యధ్యానమునందును అసమర్థుడవైనచో - నా కొఱ కాచరింపబడు కర్మమునం దిష్టము కలవాడవు కమ్ము, దేవాయతననిర్మాణము, ఉద్యాన కరణము, ప్రదీపారోపణము, మార్జనము, అభ్యుక్షణము (జలహరణము), ఉపలేపనము, పుష్పాహరణము, పూజాప్రవర్తనము, నామసంకీర్తనము, ప్రదక్షిణము, స్తుతి, నమస్కారాదులైన నాకు సంబంధించిన కర్మలు, నా కొఱకు అత్యంత ప్రీతితో ఆచరింపుము. నా కొఱకు కర్మలు చేసి, అభ్యాసయోగపూర్వకమైన, స్థిరమైన చిత్త స్థితిని నాయందుఅచిర కాలమునపొంది, మత్ప్రాప్యస్వరూపసిద్ధిని పొందుచున్నావు."

— (గీతాభాష్యము - 12 - 10)

ఈ విధముగ భక్తి యొక్క ఇట్టి ముఖవైఖరి (ప్రకటన) ధ్యానయోగమునందలి ధ్యానదశయందు క్లిష్టత గలిగియున్నప్పుడే ఉపయోగపడునని విశదీకరింపబడినది.

## 6. కర్మయోగము

"యజ్ఞ దాన తపః ప్రభృతి వైదిక కర్మ లన్నియు ముముక్షువుచేత ఎప్పుడును త్యజింపరానట్టివి. మరణ పర్యంతము ప్రతి దినము ఆచరింపబడవలసి నట్టివి."

— (గీతాభాష్యము : 18 - 5)

వర్ణాశ్రమ ధర్మముల కొఱకు శ్రుతి, స్మృతులందు విధింపబడిన నిత్య నైమిత్తిక కర్మలు - యజ్ఞము, దానము, తపస్సు, అనాతకము మొదలగునవి. ముఖ్యముగా - యజ్ఞము, అంతకంటె ప్రత్యేకముగా - పంచ మహాయజ్ఞములు [2] మోక్షము నర్థించుచు, తన దేహత్యాగ పర్యంతము ఆచరింపబడవలయునని విస్పష్టమొనర్చబడినది.

"యజ్ఞ దాన తపః ప్రభృతి వర్ణాశ్రమ సంబంధమైన కర్మలు, మననశీలు రైన మనీషిని పావన మొనర్చును. మననము, ఉపాసన మనునవి - ముముక్షువులైన వారు యావజ్జీవము ఉపాసించుచుండవలయును. అవి ఉపాసన నివృత్తి విరోధులైన ప్రాచీన కర్మలను వినాశన మొనరించును."

— (గీతా భాష్యము : 18 - 5)

వైదిక కర్మాచరణము రెండు విధములుగ పవిత్ర మొనరించునని తెలియుచున్నది. 1. యజ్ఞము ఆహారమును పవిత్ర మొనరించునని, స్వచ్ఛమైన ఆహారము మనస్సున చక్కని జ్ఞానము కలిగించునని 2. యజ్ఞ దానాదులు శ్రుతులద్వారా పొందిన నిజమైన జ్ఞాన ప్రభావమున ఆచరింపబడినపుడు, మనస్సును ఇంద్రియ వస్తువులనుండి వేరు పరచుటకు తోడ్పడ, దానిని లోనున్న ఆత్మవైపు మళ్ళించును. ఇది కర్మయోగముయొక్క పని అని గీతా భాష్యము (2 - 39) ద్వారా తెలియనచ్చుచున్నది. మోక్షార్థులవలెనే సంపదను, సంతతిని, స్వర్గావాసమును గోరువారును అట్టి కర్మలనే ఆచరించుదురు. భేదము కర్మ యందు కాక, సంకల్పముతో చేయబడియున్న కర్మాచరణమునం దుండునని విదిత మొనర్చబడినది.

"ఒక కర్మయందు వర్తమానమై యుండి, సంకల్పమాత్ర భేదముచేత అత్యల్ప ఫలభాగినులు కొందరు, స్వభావమున పునర్జన్మకు లోనగుదురు. కొందరు

2. పంచ మహా యజ్ఞములు :- 1) భూతయజ్ఞము 2) పితృయజ్ఞము 3) దేవయజ్ఞము 4) మనుష్య యజ్ఞము 5) బ్రహ్మయజ్ఞము.

అప్రమేయశాశ్వత యానందమగు పరమ పురుషుని ప్రాప్తిరూప ఫలభాగినుల పునరావర్తనులగుదురు. 'దర్శన పూర్ణిమాది కర్మలచేత ఇంద్రాదులను పూజించెదముగాక !' అని ఎవరు ఇంద్రాదులను పూజించుటకు సంకల్పింతురో, వారు - ఇంద్రాదుల చెంత కేగుదురు. ఎవరు పితృదేవతలను పూజించెదరో, వారు - వారి చెంత కేగుదురు. కాని, ఎవరు యజ్ఞములచేత, దేవపితృభూతశరీరకుని, పరమాత్ముని, భగవంతుని, వాసుదేవుని పూజించెదముగాక ! అని నన్ను పూజించుచుందురో, అట్లు నన్ను పూజించుచుండువారు నన్నే పొందుదురు (చేరుదురు)."

— (*గీతా భాష్యము : 9 - 24, 25*)

ఒక్కసారి ఆచరింపబడిన ప్రతి కర్మమును దాని ఫలితమును తప్పక కలిగియుండునని, శ్రుతి విహితమైన ప్రతి కర్మమును సముచితమైన ఫలమును గలిగియున్నదని, ఆ ఫలము అనివార్యముగా ఆ పని ననుసరించునని, అందువలన, మోక్షార్థియైనవాడు కర్మలను చేయనేరాదని కొందరు చెప్పుదురు. ఇది సరియైనది కాదు. ప్రతి పనియొక్క ఫలితము దాని కార్యమునందు కాక, మీమాంసకముయొక్క 'వినియోగ ప్రవక్త్య న్యాయము' పై నెలకొని, దాని కనువర్తించు ఉద్దేశ్యముపై ఆధారపడి యుండుననియు, అట్టి పనులు ముక్తిని పొందు సాధనముగ అనువర్తించుననియు శ్రుతి వ్యక్తీకరించుచున్నది.

"బ్రాహ్మణులు ఆయనను (బ్రహ్మమును) వేదాధ్యయనము, యజ్ఞము, దానము, తపస్సు, అనాతకము (ఉపాసనము) అను సాధనములద్వారా తెలిసికొనజూనుదురు." — (*బృహదారణ్యక ఉపనిషత్తు : (4 - 4 - 22)*)

ముఖ్యముగ ఈ విశేషము - స్వాభావిక కర్మయందలి వివరింపరాని ఒక సిద్ధాంతము కాక, 'భగవంతుడు ఫలము నిచ్చును' అను వాస్తవముపై ఆధారపడియున్నది. ఈ విధముగ ముముక్షువైనవాడు, విహిత కర్మల నన్నిటిని వాని పరిమిత ఫలము నాశింపక, కేవలము మోక్షాపేక్షతో నాచరించవలయునని తెలియుచున్నది. ఫల పరి

త్యాగ మను అర్థమిచ్చుటయే కాక, ఒకని పనియందలి కర్తృత్వ మును గూడ తెలియజేయును. ఈ విశేషమును శ్రీమద్రామానుజులు ఈ క్రింది విధముగ వివరించియున్నారు :-

"పరిత్యాగము వైదిక కర్మల ఆచరణయందును, ఇదివరకు నాచే విశదీకరింపబడినట్లు, ఫల విషయ సంబంధమై, కర్మవిషయ సంబంధమై, కర్తృత్వ విషయ సంబంధమై మూడు విధములు - 'కర్మజన్యమైన, స్వర్గాదిక ఫలము నాది కాదు' అని ఆలోచించుట ఫల విషయ పరిత్యాగము. నా ఫలసాధనచేత ఇది నాకు సంబంధించిన కర్మము' అను మమతా పరిత్యాగము కర్మవిషయ పరిత్యాగము సర్వేశ్వరుని యందు కర్తృత్వానుసంధానమైన ఆత్మ కర్తృతా త్యాగము కర్తృత్వ విషయ పరిత్యాగము." — (గీతా భాష్యము 18 : - 4)

కర్మయోగము నుండి సాధారణ కర్మము పృథక్కరించి చెప్పునది దాని జ్ఞానాకారమని తెలియుచున్నది. మానసిక ఫలపరిత్యాగము, కర్తృత్వము, కార్యము, స్వయముగ ప్రత్యేక ఆత్మపరమైన నిజమగు స్వభావముయొక్క జ్ఞానముపై ఆధారపడియున్నవి. ఈ పరిత్యాగము రెండు దశలలో అభివృద్ధి చెంది యున్నది.

"ఎవ్వడీ ఆత్మప్రధానముగా ప్రకృతినుండి ప్రత్యేకమైనదిగ తెలిసికొనునో' అతడు ఆత్మయొక్క కార్యములోని కర్తృత్వము, దాని స్వాభావిక గుణమనకు అసాధారణమయినది కాదని భావించును. కాని, అదే ప్రకృతితో దాని సంయోగము కారణముగ ఉదయించును. కార్యములో వ్యక్తిగత అభిరుచి లేక నటించుట వలన, ఆత్మను ప్రకృతితో గుర్తించుటయందు అతడు మోసగింపబడజాలడు .... ఆత్మను గూర్చిన వాస్తవమును తెలిసికొనువాడు - శ్రోత్రము, తదితర జ్ఞానేంద్రియములు, వాగింద్రియములు, తదితర కర్మేంద్రియములు, ముఖ్యమైన ప్రాణము తమ వస్తువులకు సంబంధించి తమంతట తామే పని చేయుచుండునని దృఢముగా జ్ఞప్తియందుంచుకొనవలయును. 'నే నేమి చేయలేను' అని అత దనుకొనవలయును. అర్థ మేమనగా - కేవలము జ్ఞానస్వరూపునైన నాకు, ఈ విధమైన కర్తృత్వము, ఇంద్రియముల సహవాసమువలన, కర్మఫలితమగు ముఖ్యమైన జీవము వలన వచ్చియున్నదేకాని, నా స్వరూపమువలన వచ్చియున్నట్టిది కాదు' అని అత డనుకొనవలయును..... ఇంద్రియములు ప్రకృతియొక్క ప్రత్యేకమైన మార్పులై యున్నందున, ప్రకృతి ఇంద్రియముల రూపములో నుండి, ఎవరైనను తమ కార్య

భారమును బ్రహ్మముపై నుంచి, వాని స్నేహమును వదలి, వివిధ కార్యములలో న్వయముగ మునిగియుండి, 'నే నేమి చేయలేదు' అని తలచుచున్నదో, అట్టి వ్యక్తి ప్రకృతిలో నంబంధము కలిగియున్నను, ఆత్మకు శరీరమై యొప్పు ప్రకృతి నంబంధమునకు కారణభూతమైన పాపముచేత తడుపబడడు."

— (*గీతా భాష్యము : 5 - 8, 9, 10*)

ఈ విధమైన ఆలోచన, కర్మను గురించిన పరిపక్వమైన అవగాహనకు వీలు కలిగించును. ఆత్మ ప్రకృతులు పరమాత్మకు శరీరభూతమైయుండి, ఆయనచేతనే క్రియావంతులుగ జేయబడుదురని, కర్తృత్వములోని కార్యము, క్రియయును ఆయనకే చెందునని తెలియజేయబడినది. ఆత్మ భగవంతునకు శేషభూతమైనది. ఆయనచేతనే పరిపాలింప బడును. ప్రతి పనికిని భగవంతుడే కర్త. అంతేకాక, భగవంతుడు ప్రకృతికి ముఖ్యాధారమై యుండి, ప్రతి పనికిని ఆత్మయై యొప్పును. సర్వ కర్మలును, బ్రహ్మాత్మకమై యున్నందున, సర్వ జగము బ్రహ్మ మయమైనట్టిది. భగవంతుడే యజ్ఞమయుడు, యజ్ఞకర్మ, యజ్ఞభోక్త యును. ఎందుచేతననగా - భగవంతుడు ఆత్మలకు(జీవాత్మలకు), ప్రకృతికి, యజ్ఞములచే తృప్తి నొందు దేవతలకును అంతరాత్మయై వెలసి యున్నాడు. అందువలన, ఆత్మయొక్క శేషత్వమును, ఆత్మ భగవంతుని పై ఆధారపడియుండుటయును కర్మాచరణముద్వారా గుర్తింపబడును. ప్రతి పనియును భగవత్పరమైన పూజాకర్మమే అగుచున్నది. ఇందు లకు సాదృశ్యముగ శ్రీమద్రామానుజులు గీతాభాష్యమున ఇట్లు సాయించియున్నారు :-

"దేహయాత్రాశేషభూతమైన ఏ లౌకిక కర్మ నీవు చేయుదువో, దేహ ధారణకై నీ వేవి భుజించుదువో, యజ్ఞ - దాన - తపః ప్రభృతి నిత్య నైమిత్తిక మైన ఏ ఏ కర్మల నాచరించుదువో, వాని నన్నింటిని నా కర్పణ చేయుము. నమస్తమైన లౌకిక వైదిక కర్మల కర్తృత్వము, భోక్తృత్వము, ఆరాధ్యత్వము ఏ విధముగా నాకు నమర్పించబడవలయునో ఆ విధముగా జేయుము."

ఇది ఈవిధముగా చెప్పబడినది :-

"యాగ దానాదులందు దేవతలు మొదలగువారు ఎవరు ఆరాధ్యమూర్తులో, వారు నాకు చెందినవారే; మరియు - కర్మ కర్తవు, కర్మ భోక్తవునైన నీవుగూడ నాకు చెందినవాడవే. వారి ఉత్పత్తి స్వరూపస్థితి - నా సంకల్పాయత్తమే. కర్తవు, భోక్తవు, ఆరాధకుడవు అయిన నీవు నిన్ను దేవతా జాతమైన ఆరాధ్యమును, క్రియా జాతమైన ఆరాధనమును సర్వమును, పరమ శేషియైనవాడును, పరమకర్త (సమస్తమునకు కర్త) అయిన వాడనగు నాకే సమర్పింపుము. నా నియమపూర్వకమైనట్టిదియు, నాకు శేషభూతమైనట్టిదియు, ఆరాధ్యాదేశ స్వభావగర్భితమైనట్టిదియు, ప్రీతియుక్తమగు నీ తలంపు నా యందే అభివృద్ధి చెందుగాక !"

— (గీతా భాష్యము : 9-17)

కర్మయోగము మనస్సును రెండు విధములుగ పవిత్ర మొనరించునని తెలియజేయబడినది. ఇది ఆరాధనగా భగవంతునకు ప్రీతి కలిగించి, మనస్సునందలి పూర్వకర్మసంచితమైన వాసనలను ఆయన నిర్మూలించునట్లు చేయును. కర్మతోగూడిన ఆత్మయొక్క సమస్త సంబంధముల మానసిక పరిత్యాగమును కలిగించి, కర్మలోని అహంకారము నంతటిని తొలగించి, ఇంద్రియ వస్తువులనుండి మనస్సును మళ్ళించి, క్రమముగా కర్మబంధమునకు దారితీయు ఆత్మభ్రమను పోగొట్టును. కర్మయోగముయొక్క తత్‌క్షణోద్దేశ్యము మనస్సును పవిత్ర మొనర్చి, ఆత్మయొక్క సమ్యగ్దృష్టి నడ్డగించు మానసిక వాసనలను నిర్మూలించును. అంతే కాక, కర్మయోగమున నొక భాగమైన నిరంతరోపదేశముయొక్క అంతిమోద్దేశ్యము ఆత్మయొక్క సమ్యగ్దృష్టి మాత్రమే కాక, పరమ పురుషునియెడ భక్తియునై యున్నది.

## 7. జ్ఞాన యోగము

శ్రీమద్రామానుజులు కర్మయోగమును వర్ణించి చెప్పు సందర్భమున జ్ఞాన యోగమునుగూడ చర్చించి యున్నారు. జ్ఞానయోగము - ధ్యానయోగమునకై, కర్మయోగమునకు మార్పుగ చేర్చబడినది,

మానసిక శక్తులను సంసిద్ధ మొనర్చుటగాను - శ్రీమద్రామానుజాలు దానినిగూర్చి ముముక్షువులకు సలహా యివ్వలేదని, పతంజలి యోగము తీరు తెన్నులు మాత్రమే చర్చించిరని తెలియుచున్నది.

కర్మయోగము కర్మోపదేశమైయుండ, జ్ఞానయోగము ఒక క్రియాకారహితమైన పరిపూర్ణమగు ధ్యానోపదేశము. అది సంప్రదాయ భావమగు సన్యాసముపై ఆధారపడియున్నట్టిది. దాని ముఖ్యోద్దేశ్యము మనస్సును ప్రత్యేకముగ ఆత్మపై కేంద్రీకరింపజేయుట. జ్ఞానయోగము నాలుగు ఫలవంతమైన దశలు కలిగి యున్నట్లు విశదీకరింపబడినది. 1. కార్యప్రపంచమునుండి చాలించుకొని, ఒక పీఠమునే గైకొని, ఇంద్రియ పదార్థ సంబాధమునుండి ఇంద్రియముల నుపసంహరించుకొని, ఆత్మమీద మనస్సును కేంద్రీకరించి యుంచుట. 2. తృప్తికరమైన, అతృప్తికరమైన సందర్భములందు ఉదాసీనము వహించుటను అభివృద్ధి నొందించుట. 3. ముని యగుట. అసగా - ప్రీతి, భయ, క్రోధాది చిత్తవృత్తిచేత కలత నొందక, ఆత్మను గూర్చిన ఆలోచన గలిగి యుండుట. 4. ఎట్టిదానియందైనను, ఏ మాత్రము కోరిక లేక యుండి, ఆత్మపై మనస్సును కేంద్రీకరించుట. ఈ జ్ఞానయోగ విశేషమునుగూర్చి గీతాభాష్యమునం దిట్లు ప్రతిపాదింపబడినది :-

"ఒకడు ఎప్పుడు ఆత్మైకావలంబనమువలన, మనస్సుతో తృప్తి నొంది, ఆ తుష్టి (తోషణము) వలన, సమస్తమైన మనోగత కామనలను వివరించునో, అతడు స్థితప్రజ్ఞుడని పిలువబడుచున్నాడు. ఇదియే జ్ఞాన నిష్ఠయొక్క (జ్ఞానయోగముయొక్క) అత్యుత్తమ దశ." — ***(గీతా భాష్యము : 2 - 55)***

శ్రీమద్రామానుజులు వివరించి చెప్పిన 'జ్ఞానయోగ' స్వభావమిదే. వారు వివరించిన పరమార్థ సారాంశ మిట్లున్నది :-

కర్మయోగము జ్ఞానయోగమునకు మార్గ మేర్పరచునని, జ్ఞానయోగము ధ్యానయోగమునకు గొంపోవునని తెలియజెప్పిరి. ఒకచోట ముముక్షు

నైనవా డేక కాలమున కర్మయోగియు, జ్ఞానయోగియు కావలయునని వారు నిర్దేశించుచున్నట్లు తోచి, దాని ననుసరించియే, ఒక ఆక్షేపము లేవనెత్తబడినది. 'కర్మయోగము కర్మాచరణమును, జ్ఞానయోగము కర్మవిమోచనమును, చిక్కును గలిగించినచో (ప్రతిపాదించినచో) వెంట వెంట రెండును కొనసాగింపబడజాలవు' అను దానికి శ్రీమద్రామానుజు లిట్లు సమాధానము చెప్పిరి :-

'నన్ను మీ రపార్థము చేసికొంటిరి ఇవి రెండు విభిన్నములైన మార్గములు' కొంద రొక దానిని, వే రొక కొందరు వే రొకదానిని ఆచరించుటకు సమర్థులు.'

అని ఆ తరువాత -

"కర్మయోగోపదేశము పొందియుండక, జ్ఞానయోగము నభ్యసింపరాదని, ఒకవేళ ఎవరైన అట్లాచరించినచో, వారు తమ లక్ష్యమునందు విఫలు లగుటయే కాక, నాను పరిపూర్ణ కర్మ పరిత్యాగము సాధ్యము కాదని, జ్ఞానయోగ సంసిద్ధతకేగాని, జ్ఞానయోగానుష్ఠానమునకుఁగూడ కర్మాచరణము తప్పనిసరియని విశదీకరించిరి. అటు పిమ్మట, దీనిని గూర్చిన సుదీర్ఘ చర్చ తరువాత శ్రీమద్రామానుజులు కర్మయోగాభ్యానమువలననే ధ్యానయోగపరమైన మానసిక ప్రవృత్తికి సంసిద్ధ మగునని, అట్టివాడు జ్ఞానయోగమునకు మానుకొన నవసరము లేదని విప్పి చెప్పిరి. చివరకు వారు - 'శరీరముతో గూడియున్న ఆత్మకు కర్మయోగమే ధర్మమని, జ్ఞానయోగము రూపరహితమైన ఆత్మధర్మమని, ముక్తాత్మలు మాత్రమే సమస్త కర్మలను త్యజించును."

అని సాయించిరి.

జ్ఞానయోగాభ్యాసమును శ్రీమద్రామానుజులు పూర్తిగ త్రోసిపుచ్చి రనుటకు వీలు లేదు. గీతాభాష్యమునందలి వ్యాఖ్యానములు ఊహామాత్రముగనైన దాని అవకాశమును సూచించును. అందులకు నిదర్శనముగ -

"ధ్యానముచేత యోగమును సాధించినవారు - మనస్సుతో కూడియుండు శరీరములోని నిశ్చలమైన ఆత్మను చూచుదురు. యోగమును సాధింపపండినవారు

జ్ఞానయోగముద్వారా మనస్సును యోగమునకు దగినట్లుగ ఏర్పరచుకొని, ఆత్మను దర్శించుదురు. జ్ఞానయోగమున కర్తృత గలిగియుండియు, సులభ సాధన నెన్నుకొను వారు. వ్యాఖ్యాన కర్తలు జ్ఞానయుక్తమైన కర్మయోగము ద్వారా మనస్సును సుశిక్షిత మొనర్చియుండి, యోగమునకు సమాయత్తపరచి, ఆత్మను దర్శింతురు."

— (గీతా భాష్యము : 33 - 24)

ఏది ఏమైనను, శ్రీమద్రామానుజులు - తాము చెప్పిన మోక్షోపాయమున జ్ఞానయోగమును చేర్చి సూచించలేదు. గీతా భాష్యము చివరన మోక్షోపాయమును గూర్చి చెప్పిన వారి సంక్షేప వాక్యములందును జ్ఞానయోగమును చేర్చియుండలేదు. శ్రీభాష్యము నందు జ్ఞానయోగ ముదాహరింపబడలేదు. చాలమంది రచయితలు - శ్రీమద్రామానుజులను గూర్చి వ్రాసినట్లుగ, వారు సాయించిన మోక్షోపాయమును 'కర్మయోగము- జ్ఞానయోగము భక్తియోగము' అని సంగ్రహముగా చెప్పుట అపోహకు దారి తీయుచున్నది.

శ్రీమద్రామానుజులు ముముక్షువులకు జ్ఞానయోగము నెందుల కనుమతించి యుండలేదను విషయమును విచారించినపుడు, జ్ఞాన యోగముయొక్క ఉపయుక్తత ఇంద్రియముల పరిపూర్ణాధికారముపై ఆధారపడియున్నట్లు తెలియవచ్చును. ఇంద్రియముల నదుపు చేయుట చాల కష్టమని శ్రీమద్రామానుజులు వివరించిరి. ఇంద్రియములను ఇంద్రియ వస్తువులనుండి మళ్ళించి యుండినను, ఒక తృష్ణ నిలిచియే యుండును. ఆత్మదర్శన మగునంతవరకు ఇంద్రియ వస్తువులపై గల ఈ వాంఛ పోదు. ఈ వాంఛ జయింపబడనిచో, ఆత్మదర్శనమును పొందజాలడు. ఆ విధముగా జ్ఞానయోగము ద్వారా ఇంద్రియములను అదుపుచేయుట చాల కష్టము; అవశ్యమైనట్టిదియును. దీనినిగూర్చి గీతాభాష్యమున నిట్లు పేర్కొనబడియున్నది :-

"ఆత్మదర్శనము లేక, విషయరాగము తొలగదు. విషయరాగము తొలగనిచో, ఉద్వేగము గల శక్తివంతమైన ఇంద్రియములు, వివేకవంతుడగు మనుష్యుని మనస్సును అతడు గట్టిగా ప్రయత్నించుచున్నను, బలవంతముగా

హరించుకొనిపోవును. ఈ విధముగా ఇంద్రియములను జయించుట - ఆత్మ దర్శ ముపై ఆధారపడియుండ, ఆత్మదర్శనము ఇంద్రియ జయాధీనమై యున్నది అందువలన, జ్ఞాన నిష్ఠను పొందుట చాల కష్టము."

**(గీతాభాష్యము - 2 - 60)**

దీనిని సులభముగా జయించుట కొకే సాధన మున్నది. అ దేమన, శుభాశ్రయుడైన పరమ పురుషునిపై మనస్సును కేంద్రీకరించుటయే. ఈ విశేషమును - విష్ణుపురాణ మిట్లు ప్రతిపాదించుచున్నది :-

"విషయానురాగయుక్తచేత' జయింపరానిదైన ఇంద్రియములను సంయమన మొనర్చి, శుభాశ్రయోభూతుడనగు నా యెడల లగ్నమొనర్చి, అతడు ఏకాగ్రతతో కూర్చొని యుండుగాక, మనస్సు నన్ను ధ్యేయముగా తెలిసియున్నప్పుడు ఆ మనస్సు, నిర్ధగ్ధాశేషకల్మషత్వము నిర్మలీకృతమై, విషయానురాగ రహితమై, ఇంద్రియములను తన వశ మొనర్చుకొనును. అప్పుడు వశేంద్రియములు గల మనస్సు ఆత్మదర్శనమునకు సమర్థ మగును. ఇది ఈ విధముగా చెప్పబడినది. ఉద్ధత శిఖుడగు అగ్ని - వాయువుతో గూడి కాష్ఠమును దహించివైచునట్లు యోగుల చిత్తములం దున్నవాడగు శ్రీమహావిష్ణువు - సమస్త కిల్బిషములను దహించివైచును "

— **(విష్ణుపురాణము 6 :- 7 - 74.)**

పరమపురుషునియం దెవడు తన మనస్సును లగ్న మొనర్పక, స్వశక్తి ప్రయత్నముచేతనే ఇంద్రియములను స్వాధీనమునం దుంచుకొనుటకు బూనుకొనునో, అతడు తన లక్ష్యమునందు విఫలు డగుటయే కాక, విషయేంద్రియములయందు తన్ను తాను గట్టిగబరికించుకొనినవా డగు ననియు వివరింపబడినది. అంతే కాక, ముముక్షువైనవానికి ఇంద్రియముల నదుపుచేయుటకు, పరమ పురుషునియందు మనస్సును కేంద్రీకరించి ధ్యాన మొనర్చుట మాత్రమే వాంఛింపదగినది కాదట. అట్టి ధ్యానమునకు సహకారిగ అతడు కర్మయోగాభ్యాస మొనర్చుట అభిలషణీయమని చెప్పబడినది. ఎవడు కేవలము సర్వకర్మత్యాగము ద్వారా ఇంద్రియముల నదుపు చేయుటకు ప్రయత్నించునో, అతడు - తన జ్ఞానయోగాభ్యాసమువలన నశించును. పరమ పురుషుని

కరుణ వలన మొదట, పూర్వకర్మ ప్రభావమును తొలగించుకొనక పోయినచో, జ్ఞానయోగము ముముక్షువుయొక్క అధఃపతనమునకు దారి తీయును.

ఆత్మను బంధించియుంచునది కర్మము కాక, కర్మము చిగురించు నట్టి కోరికయే అని చెప్పబడినది. సమస్త కర్మలను పరిత్యజించుట సాధ్యమైనప్పటికిని, ఒకడు తనంతట తానే కోరికను వదలలేడు. జ్ఞాన యోగసాధకునకి దొక ప్రధాన సంకటము. అందువలన, ఒకడు సమస్త కర్మలను పరిత్యాగ మొనర్ప బూనినను, శరీరమును వహించ (భరింప) జాలడు. ఎందుచేత ననగా, ముముక్షువైనవాని శరీరము పరిశుభ్రమైన ఆహారము ద్వారా వహింపబడగలదు. ఆ పరిశుభ్రమైన ఆహారము విధ్యుక్త కర్మాచరణము వలననే కలుగునని వివరింప బడినది :-

"ఒకవేళ నీవు సర్వ కర్మలను పరిత్యజించి జ్ఞానానుష్ఠానమునకు మాత్రమే పూనుకొనినచో, జ్ఞాన నిక్షేప కారిణి యగు శరీర యాత్రను (శరీర నిర్వహణమును) కొనసాగించలేవు. సాధన సమాప్తి పర్యంతము శరీర ధారణమును తప్పనిసరిగా చేయవలసియున్నది. మహాయజ్ఞాదికముల నొనరించి, వానివలన మిగిలియున్న అతనము ద్వారా శరీరధారణ మొనర్పవలసియున్నది."

— (గీతాభాష్యము : 3 - 8.)

మోక్షము నపేక్షించువాడన్ని విధములుగ పరమ పురుషుని విశ్వ సింపవలయును. పరమ పురుషుని పూజించునట్టి, శ్రుతి విహితమైన కర్మాచరణముద్వారా ధ్యానమునకు సమాయత్తమగుటకు, తన మన స్సును తప్పక పరిశుద్ధ మొనరించుకొనవలయును. ధ్యానముననే తన మనస్సును పరమ పురుషునిపై కేంద్రీకరింపవలయును. ధ్యానమును బలపరచుటకుగాను, పూజాది కర్మాచరణమును కొనసాగించుచునే యుండవలయును. స్వశక్తిని పరిపూర్ణముగా విశ్వసించు యోగి, ఆత్మదర్శనము నొందజాలడు.

శ్రీమద్రామానుజులు జ్ఞానయోగమున కన్వయించి చెప్పిన శ్రుతులు పతంజలి యోగమునకు అన్వయించును. పతంజలి ఏ స్థితి యందు ఈశ్వర పదార్థ మున్నను, అతని యోగము స్వయం కృషి ద్వారా ఇంద్రియములను జయించునట్టి సంప్రదాయోద్దేశ్యమగు ఈ వ్యాసముపై ఆధారపడిన పద్ధతి. వాస్తవముగ శ్రీమద్రామానుజులు పతంజలి పద్ధతి యోగమును సరిగా జ్ఞానయోగమునకు విరుద్ధమైన ఆక్షేపణల ననుసరించి సమర్థించుదురు. జ్ఞానయోగము విపత్కరమై యున్నందున, శ్రీమద్రామానుజులు ధ్యానయోగ సంసిద్ధికై, కర్మ యోగము తప్పక ఆచరింపబడవలయునని నిశ్చయించిరి.

## 8. భక్తి యోగము

భక్తి యోగోద్దేశము ఆత్మావలోకమునకు సంబంధించినది జ్ఞానయోగ, కర్మయోగములద్వారా ఇది ఎట్లు ఫలప్రదమై యొప్పనో శ్రీమద్రామానుజులు విశదీకరించియున్నారు. శ్రీమద్రామానుజుల అభిప్రాయానుగుణ్యముగ, ఆత్మావలోకనమునకు శ్రుతి ననుసరించి పరమ పురుషునిగూర్చిన పరవిద్య అత్యావశ్యకమై యున్నది. ఆ విశేషము (అ) ధ్యానయోగము (ఆ) పరవిద్య అను రెండు అంశముల ద్వారా విదితమగును.

### అ) ధ్యాన యోగము

ధ్యానయోగ మనునది సర్వేంద్రియముల కర్మవిమోచనము. శ్రీమద్రామానుజులు ఇంద్రియముల నదుపుచేయు విధానముపై ఆధారపడవలసిన యోగమును, తిరస్కరించి యుండలేదు. మీదు మిక్కిలి వారు దానిని విధించిరి. అట్టి యోగాభ్యాసము ముక్తి నొందుట కత్యావశ్యకమని వారు దృఢముగ విశ్వసించిరి. అది కేవలము అను పయుక్తమైనదిని కాని, ఆత్మసంబంధమైన అభివృద్ధికి హానికర మని, పరమపురుషునిపై ఆధారపడక, ఆయనను ఒప్పుకొనక గ్రుక్తిం

పక), ఆత్మాధికారముద్వారా, ధ్యానమునకై ఇంద్రియముల నదుపు చేయు నట్టి ప్రయత్న మైనను, వారికి సమ్మతము కాలేదు. కర్మ యోగియైనవాడు - మనస్సు కలత నొందనంతవరకు, విషయ వస్తు అననుసంగమును అభ్యసించియున్నను, శీతోష్ణములయం దాసీనుడై యున్నప్పుడు, కష్ట సుఖములందు, దూషణ భూషణములందు, మట్టి పెల్లను - బంగారు కణికను సమానముగ నెంచినపుడు శత్రుమిత్రాదుల నుండి సంభవించు నష్టమునుగాని, లాభమునుగాని లెక్క చేయనపుడు, తన మనస్సు ఆత్మయందే లగ్నమై యుండినపుడు అతడు యోగాభ్యాస మున కర్హుడు. ప్రతి దిన మొక నిర్ణీత సమయమున, పరిశుద్ధమైనట్టి ఏకాంతమైన ప్రత్యేక స్థలమునందు సముచితమైన ఆసనము నేర్పాటు చేసికొని, చక్కనైన శరీర స్థితియం దట కూర్చుండవలయును. నాసాగ్ర ముపై దృష్టి నిల్పి, నాసాభ్యంతర చారిణులైన ఉచ్ఛ్వాస నిశ్వాసము లను క్రమబద్ధ మొనర్చి, మనస్సును ఏకాగ్ర మొనర్చి, చిత్తేంద్రియ క్రియను పరిశీలింపవలయును. మనస్సును ఏకాగ్ర మొనర్చి, పరమ పురుషుడగు భగవంతునియందే కేంద్రీకరింపవలయును. దీని గీతా భాష్య మిట్లు తెలియజేయుచున్నది :-

"నన్ను మాత్రమే చింతించుచు, అతడు కూర్చుండుగాక : పరబ్రహ్మను పురుషోత్తముడను, శుభాశ్రయుడను, సదాత్మాన మానసుడను, నియత మానసుడ నగు నా స్పర్శవలన పవిత్రీకృతమైన మనస్సుచేత, నిశ్చలమైన మనస్సును నా యందే ఏకీకృత మొనర్చి, నా యందు సంస్థితమైన శాంతిని పొందుచున్నాడు."

— *(గీతా భాష్యము : 6 - 14, 15)*

పరమ పురుషునియందుగల మానసిక ఏకాగ్రత - 'ధారణ' అని పిలువ బడుచున్నది.

"ధారణ'యందు స్థిరపరచినది యోగము. అనగా - నాయందు మాత్రమే స్థిరపరచిన నిశ్చల స్థితి." — *(గీతాభాష్యము : 18 - 12, 13)*

పై విశేషముల ననుసరించి ధ్యానయోగము చక్కగ అధివసించుట (ఆసనము), శ్వాస నియమనము (ప్రాణాయామము), ఇంద్రియ వస్తువులనుండి ఇంద్రియములను మళ్ళించుకొనుట (ప్రత్యాహారము), ఒక్క వస్తువుపైననే మానసిక ఏకాగ్రత (ధారణ) అను అంశములను గలిగియున్నదని తెలియుచున్నది. అట్టి అనుష్ఠానముల ఉద్దేశ్యము సాధారణ ఆలోచనా సరణులను, సాధారణ చైతన్యమును అణచి వేయుటయే. శ్రీమద్రామానుజులు మిగిలిన అంశములను వివరింప కున్నను, చక్కగ అధివసించియుండు పద్ధతి చాల అవసరమని నొక్కి చెప్పిరి :-

"భక్తుడు కూర్చుండు స్థితియందే ధ్యానమును కొనసాగించవలెను. ఎందుచేత ననగా - ఆ స్థితియందే అవసరమైన ఏకాగ్ర చిత్తతను పొందగలడు నిలబడి యుండిగాని, నడచుచుండినగాని ధ్యానము చేయుటకు ప్రయత్న మవసరము. (పండుకొనియుండుట నిద్రకు కారణ మగును.) శరీరమును చక్కగా నిలచియుండుటకు ఏదైన పీఠముపై అధివసించియుండుట సరియైన పద్ధతి".

— *(గీతాభాష్యము : 4 - 1 - 7.)*

మిగిలిన అంశము లన్నియు మౌలికముగా పతంజలి నిర్వచనములనే బోలియున్నవి. కాని, ధారణనుగూర్చి మాత్రము శ్రీమద్రామానుజులు గొప్పగ వివరించిరి. పరమపురుషుడే ధారణా వస్తువుగ ఎందుకుండవలయునో శ్రీమద్రామానుజు లెన్నో కారణముల దెలియజేసిరి. మనస్సు పవిత్ర మొనరింపబడవలయు నన్నచో, ఆ వస్తువు స్వయముగ పవిత్ర మైనదై, పవిత్ర మొనరించుటకు సమర్థమైనదై యుండవలయును. ఈ విశేషమును స్థాపించుటకై వారు విష్ణుపురాణములోని 7-వ అధ్యాయమును గూర్చి - చర్చించియున్నారు. దాని ననుసరించి, నిఖిలహేయప్రత్యనీకుడు, కల్యాణగుణార్ణవుడగు పరబ్రహ్మయే ధారణా వస్తువుగ దగియున్నాడని, ఆ పరబ్రహ్మ ప్రభావము వలననే

సంసారమున చిక్కుకొనియున్న కారణముగ, మూలప్రకృతియును, ప్రత్యగాత్మలును అపవిత్రమై యుండి, 'ధారణా' వస్తువుగ, అనర్హమైనవని వివరించియున్నారు. అంతే కాక, ముక్తాత్మయును దానికి తగదట. ఎందు కనగా, పరమాత్మపై ఆధారపడియున్నందున, దాని పవిత్రత, స్వాభావిక మైనదికాదని చెప్పిరి. కఠోపనిష ద్వాక్యము (1-3-3-14) నందును వారు - 'పరమ పురుషుడే మనస్సును పవిత్ర మొనర్చుటకు సమర్థుడై యున్నా'డని విప్పి చెప్పిరి. ఈ సందర్భముననే వారు మరొక ముఖ్య విషయమును ప్రతిపాదించిరి. 'మనస్సు నదుపునం దుంచుకొనదలచినవారు, మొట్టమొదట అనుమంత్రుడు అంతర్యామియునైన పరబ్రహ్మమును వశీకృతు నొనర్చుకొనవలయు' నని చెప్పుచు, శ్రీభాష్యమున నిట్లానతిచ్చిరి :-

"ఉపనిష ద్భాగమున 'రథమును తోలువానినే ఆత్మగా నెఱుంగుము' అని ప్రారంభము. 'జ్ఞానవంతులు మార్గము కష్టమైనదని అందురు' అను ముగింపు నిజమైన ధ్యాన పద్ధతినే కాక, భక్తుడు శ్రీవైకుంఠము నెట్లు చేరుకొనునో తెలియ జేయును."

— (శ్రీభాష్యము : 1 - 4 - 6.)

దీని నీ క్రింది విధముగ అన్వయించుకొనవలసియున్నది. ఆత్మ రథమునకు యజమాని యని, శరీరము రథ మని, బుద్ధి రథ చోదకుడని, మనస్సు పగ్గములని తెలియ నగును. అంతర్యామియైన భగవంతుడు - ధ్యాన వస్తువై యుండి, ఆత్మ బుద్ధిని నియమించుటకు (అదుపు చేయుటకు) వీలు కల్పించును. బుద్ధి మనస్సును, మనస్సు శరీరమును, బాహ్యేంద్రియములను గూడ అదుపు చేయును. అంతే కాక,

"సమస్త ప్రాణికోటి కర్మల కర్తృత్వ పరిగణన పరమాత్మని ఇచ్ఛపై ఆధారపడియుండును. సర్వాంతర్యామియైన ఆ పరమాత్ముడు భక్తుని ధ్యానమునకుగూడ కారణ మగును. ధ్యానమును గలిగించుటకు, ధ్యాన లక్ష్యమునకు కారణభూతమై యున్నందున, ఆ పరమాత్ముడే పొందబడుటకు గొప్పనైన ధారణా వస్తువు."

— (శ్రీభాష్యము : 1 - 4 - 1.)

అని వివరింపబడినది. ఈ విధముగా మనస్సును పవిత్ర మొనరించుటకు పరమపురుషుడు కేవలము సముచితమైన వస్తువే కాక, అత్యంతావశ్యకమైన వస్తువుగూడ అయి ఉన్నాడు. పరమ పురుషుడే ధారణకు ముఖ్య వస్తువుగ స్వీకరింపబడుటకు గల కారణము - ఛాందోగ్యోపనిషత్తున (3 - 14) ఇట్లుదాహరింపబడినది.

"ఈ ప్రపంచమున వాని యాలోచన యెట్లుండునో, ఈ ప్రపంచమును వదలియున్న తరువాత, వాని యాలోచన అట్లే యుండగలదు."

శ్రీమద్రామానుజులు దీని అర్థము నిట్లు స్వీకరించిరి :-

"అతని ధ్యాన మెట్లున్నదో, అటులనే దానిని పొందును. ఎవడు బ్రహ్మమును పొందగోరునో, వారు బ్రహ్మమునే ధ్యానించవలయును. ఎవడు బ్రహ్మప్రతీకలైన మనస్సు, ప్రాణము, శబ్దమాదిగా గల మానసిక భావనలనుగాని, ఇంద్రియ వస్తువులనుగాని ధ్యానించునో, అతడు బ్రహ్మమును పొందజాలడు. ఎందు కనగా, అట్టి వస్తువులను తమను మించి ధ్యాతను తీసికొనిపోగల శక్తిలేదు. (కేవలము దైవిక శక్తి మాత్రమే మనస్సును పవిత్ర మొనరించగలదు.) అంతిమ ఉద్దేశ్యము ఒక పరమ పురుషునిగ పొందబడవలయును." — ( ***శ్రీభాష్యము : 4 - 3 - 14*** )

ధ్యానయోగము యొక్క తత్ క్షణోద్దేశ్యము ఆత్మ దర్శనమని, అది కేవలము స్మృతివలన కలుగునని చెప్పబడినది. వాని వాని కర్మలను అణచివేయుటకు గాక, బుద్ధి, చిత్తము, మనస్సులకు ఇంద్రియ వస్తువుల నుండి మళ్ళించి, పరమపురుషున కున్ముఖ మొనర్పబడవలయును. ఈ సందర్భముననే పురుషోత్తముడగు శ్రీమహావిష్ణువు, అత్యద్భుత తేజోయుతుడై, ధారణా వస్తువుని అట్టి వస్తువే ధ్యానమునందును కొనసాగునని తెలియజెప్పబడినది.

పురుషోత్తమునిలో స్పర్శ వలన (సంబంధము వలన) మనస్సు పవిత్ర మొనరింపబడి, నియంత్రింపబడినప్పుడు, అది ఆత్మ తనలోనే

యున్నట్లు తెలిసికొనును. మనస్సుయొక్క సమక్షమున జ్ఞాన ప్రకాశముతో ఆత్మ ప్రకాశించునని - శ్రీమద్రామానుజులు వివరించిరి. అంతే గాక, ఆతని మనస్సుద్వారా మాత్రమే గ్రహింపబడగలదని చెప్పిరి. కాని, మనస్సు, ఆత్మ, మానసోపకరణముద్వారా తనను తాను కనుగొనునని తెలిసికొనవలయును. ఆత్మదర్శన మనునది - స్వకీయమైన జ్ఞాపకము. పూర్వకర్మ ప్రభావము వలన, ఇంద్రియ వస్తువు, ద్వారా కలత నొంది యున్నప్పుడు, మనస్సు అశుచి యైనప్పుడు' మానసోపకరణముద్వారా ఆత్మదర్శనశక్తి పరిమితమై యుండును. అందువలన, ఎప్పుడా మనస్సు తన అపవిత్రతను తొలగించుకొని, కర్మయోగ, ధ్యానయోగములద్వారా ప్రశాంతత నొందునో అప్పుడు ఆత్మ తన అపరిమిత జ్ఞానప్రకాశమున తన్ను తాను దర్శించునని అత్మయే జ్ఞాతృపదార్థముకాని, మనస్సు కాదని మనము భావింప వలయును. ఈ సందర్భమున ఆత్మ దర్శనమునుగూర్చి ఒక ముఖ్య విషయమును గమనింపవలసియున్నది. ఆత్మ ప్రకృతినుండి వేరైనదే కాక, పురుషోత్తమునకు శేషభూతమైన దనియు తెలిసికొనవలయును.

"ఈ విధముగా ధ్యానయోగము నాచరించి, అతడు బ్రహ్మ మగుటకు తగియున్నాడు, బ్రహ్మస్థితికి తగియున్నాడు. సమస్త బంధములనుండి విడివడి, అతడు ఆత్మానుభవమును పొందును. బ్రహ్మమైయున్న ఆత్మయొక్క స్వభావము నాకు శేషభూతమై యుండి, శేషభూతమై యుండుటకు తగిన స్వరూప లక్షణములను గలిగి యుండి, శేషభూతుడై యుండుటకు తగిన అపరిమితజ్ఞానరూపుడై యుండవలయునని చెప్పనైనది. 'కాని, దానిని మించిన నా ఇతర ప్రపత్తిని తెలిసికొనుము.'.... ప్రసన్నాత్మ, క్లేశ కర్మాదులు లేక, అకలుష స్వరూపమున నన్ను గురించి కాక, అతనికి ఇతరుల యెడ దుఃఖము లేదు. నాకు వ్యతిరేకమైన దేనినైన, అతడు ఆలోచింపడు; ఆధింపడు. అతడు నాయందు కాక, సమస్త ప్రాణులందును ఉదాసీనత గలిగి, ఏ ప్రాణినైనను, ఏ వస్తువునైనను తృణముగా భావించి, నాయందలి పర

భక్తుని పొందును. అనగా - అతడు సర్వేశ్వరుడను, నిఖిల జగదుత్పత్తి స్థితి లయ కారకుడ నగు నాయందు ప్రియానురూపమగు భక్తిని పొందును."

— (గీతాభాష్యము : 12 - 53, 54)

శ్రీమద్రామానుజుల మోక్షోపాయ మంతయును, ఆత్మ (జీవాత్మ) పరమాత్మకు శేషభూతమై యుండునను విశేషమును తెలియజేయునని, ఈ విశేషమును అవగత మొనర్చుకొనుటయే కర్మయోగమునకు మూల మని విస్తరింపబడి యున్నది. ఈ అవగాహనమే యోగమునందలి ధారణ - ధ్యానముల మధ్యగల సంబంధ మని తెలియుచున్నది. ఆత్మ, భగవంతునకు శేషభూతమైనదను ఈదృష్టి,కర్మయోగ ధ్యానయోగము లందు తెలియజేయబడిన సాధారణ భక్తి కాక, పురుషోత్తమునియందు పరమభక్తిని అభివృద్ధి నొందించును.

ఆ) **పరవిద్య : -**

పరబ్రహ్మమగు పురుషోత్తముడు, స్వచ్ఛంద జ్ఞాన స్వరూప మైన ప్రియతమమైన, నిరంతరమైన, అన్యవస్తు నిరపేక్షమైన, భక్తి పూర్వకమైన ధ్యానముచేతనే పొందబడవలసినవాడని శ్రీమద్రామానుజు లానతిచ్చియున్నారు. ప్రకృతినుండి భిన్నమైన, పరమపురుషు నకు శేషభూతమై యొప్పు ఆత్మదృష్టియే పరభక్తి నభివృద్ధిజెందించు నని తెలియజేయబడినది. పరభక్తి పురుషోత్తమునియందు పరవిద్య నుదయింప జేయును. యోగియైనవాడు, ఆత్మదర్శనమున తాను ముఖ్యముగా పురుషోత్తముడగు పరమపురుషునిపై ఆధారపడి యున్నట్లు, ఆయనయే భక్తికి ఉత్తమమైనవాడని, వాస్తవముగా ఆయనయే పరమ ప్రాప్యమనియు, ఆయన ఒక్కడే ప్రాపకుడనియు తెలిసికొనును, ఇట్టి పరిపూర్ణావగాహన గలిగి, అతడు పురుషోత్తముని యందే మనస్సును లగ్న మొనర్చును.

"నేను వాసుదేవ శేషతరైక రసుడను. నా స్వరూపము, స్థితి, ప్రవృత్తియు ఆయనపై ఆధారపడి యున్నవి. ఆయన అనంఖ్యాకములైన కల్యాణ గుణములచేత పరతరుడు' అని జ్ఞానవంతుడై, 'వాసుదేవుడే నా ప్రాప్యము, ప్రాపకమును. నా మనస్సునం దుండుఇతర మేదైనను ఆయనయే. ఆయనయే నా సర్వస్వము' అని అతడు నన్ను గూర్చియే పోవును - నన్నే ఉపాసించును"

— (గీతాభాష్యము : 7 - 19)

ధ్యానము లేక ఉపాసన అనునది స్మృతిరూపాపన్నము. పరమ పురుషుని గుణగణములను భావింపజేయునది. నిరంతరము భగవంతుని తలపింప జేయనట్టిది. నన్నే మనస్సున గలిగి - నా భక్తుడవు కమ్ము' అను విశేషములు గలిగియుండునదై యుండవలసినది. ఇందులకు గీతాభాష్యమున శ్రీమద్రామానుజు లిట్లు సాయించియున్నారు :

"సర్వేశ్వరేశ్వరుడను, నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణైక గుణార్ణవుడను, సర్వజ్ఞుడను, నిఖిల జగదేక కారణుడను, పరబ్రహ్మవాచ్యుడను, పురుషోత్తముడనగు, నాయందే, తైలధారవలె అవిచ్ఛిన్న మనోనిష్ఠను గలిగియుండుము."

— (గీతాభాష్యము : 9 - 34.)

ఈ పరబ్రహ్మ వేదాంత గ్రంథములలో ఆజ్ఞాపింపబడిన వివిధ విద్యల ననుసరించి యుండవలయునని తెలియుచున్నది. వీనిలో - సద్విద్య, భూమ విద్య, దహర విద్య, ఉపకోసల విద్య, శాండిల్య విద్య, వైశ్వానర విద్య, ఆనందమయ విద్య, అక్షర విద్య అనునవి చాల ముఖ్యమైనవి. ఈవిద్య లన్నియు బ్రహ్మముయొక్క రీతిని, అనగా - ఆయనస్వభావములనువర్ణించును.ఉదాహరణమునకు -దహర విద్యలో బ్రహ్మమును ఈ క్రింది విధమున ధ్యానించవలయునని తెలియజేయబడినది. ఇందు బ్రహ్మము నొక దహర (చిన్న) ఆకాశముగ హృదయస్థితు నొనర్చి, ఈ ప్రపంచమందలి ఉన్నవి, లేనివియునైన సమస్త గుణగణములను, సకల వాంఛలను గలిగియుండి, అపహతపాపమానుడై, విజరుడై, విమృత్యుడై, విశోకుడై, విజిఘత్సుడై, అపిపా

నుడై యుండి, తన ఇచ్ఛా సంకల్పములచేత ఎల్లప్పుడును తెలియబడు చుండువాడు. ఈ విద్య లన్నింటియందును బ్రహ్మము సగుణబ్రహ్మము గనే యుండును. దీనిని భగవద్రామానుజులు శ్రీభాష్యమున నిట్లాన తిచ్చి యున్నారు :--

"పరవిద్య లన్నిటియందును సగుణమే బ్రహ్మోపాస్యము, ఫలము గూడ, ఏకరూపమైనది." -- (శ్రీభాష్యము : 1 - 1 - 1.)

సద్విద్యనుగూర్చియు శ్రీమద్రామానుజు లీ విశేషమునే స్థాపించిరి. వారు వేదార్థ సంగ్రహములో ---

"సమర్థులగు పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానములలో వివరించినట్లు, సద్విద్య యందలి 'తత్ త్వమ్ అసి' అనుదానిలో - ప్రార్థనాయుతమగు ధ్యాన వస్తువు సగుణ బ్రహ్మమే. సమస్త కల్యాణ గుణములును ఆయన స్వరూపమునందు స్వాభావికమై యున్న కల్యాణ గుణములచేత ఆయన ప్రార్థింపబడుచుండును. ఈ కారణముగ సద్విద్యలోగూడ సగుణబ్రహ్మమునకే ఫలప్రాప్తి కలుగును."

(వేదార్థ సంగ్రహము : 88.)

అని తెలియజేసిరి.

ప్రతి ఒక్కటియును వాంఛితార్థమును నెరవేర్చుటకు స్వయముగ తగి యున్నందునను, ఒక్కదానికంటె ఎక్కువ అభ్యసించిన విద్యలు చక్కని ఫలితము నివ్వజాలనందునను భక్తుడైనవాడు వీనిలో ఒక్క విద్యనే అభ్యసింపవలయును. ధనము పొందవలయు నను దృష్టితో, సంతాన ప్రాప్తికై, స్వర్గావాసమునకై చేయబడు గొప్పనైన సమృద్ధనుత్తైన, కర్మాచరణము గొప్పనైన ప్రతిఫల మిచ్చును. కాని. బ్రహ్మవిద్యల విషయమున నిట్లు కాదు. బ్రహ్మప్రాప్తి కిటువంటి తరతమ భేదములు లేవు. ఈ విశేషమును నిర్ధారించుచు శ్రీమద్రామానుజు లిట్లు విశదీకరించిరి :-

"అన్ని బ్రహ్మ విద్యలయందును అనవధికాతిశయ బ్రహ్మానుభవము భేదము లేదని చెప్పబడినది. ఆ బ్రహ్మానుభవము ఒక విద్యచేతనే పొందబడినపుడు, ఇతరముల ప్రయోజన మేమి ?" -- (శ్రీభాష్యము : 3 - 3 - 57.)

ఈ సందర్భమున బ్రహ్మమునకు సంబధించిన కొన్ని లక్షణములు (ధర్మములు) లేనిచో, బ్రహ్మమును సముచితముగ తెలియనట్లే యగును. ప్రత్యేకముగ నెన్నుకొనిన విద్యకు గల లక్షణములకు వీనిని చేర్చి, ధ్యానించవలయును. అవి సత్యము, జ్ఞానము, ఆనందము, అమలత్వము అనంతత్వ మనునవని చెప్పబడినవి.

"ధ్యానవస్తువుగ బ్రహ్మముయొక్క నిజమైన తలంపు గలిగియుండుటకు సత్యము, ఆనందము మొదలగువానిని పరవిద్యలను చేర్చవలయును. 'కనీకరము' వంటి అదనవు లక్షణములు - వాస్తవముగ అవి వానికి సంబంధించిన విషయమును వదలియుండనప్పటికి, బ్రహ్మము విషయమున అనవసరమైన మూలపదార్థములైనను ఎచ్చట అవి ప్రత్యేకముగ ఉదాహరింపబడవలెనో, ఆ యా విద్యలందు మాత్రమే అవి చేర్చబడవలయును."

— (శ్రీభాష్యము : 4 - 1 - 1, 4 - 1 - 12)

ఒక్కసారి మాత్రమే బ్రహ్మమునుగూర్చి చేయబడు ధ్యానము అంతగ ప్రత్యేకతను గలిగియుండదు. అంతకంటె దాని ఉద్దేశ్యము కేవలము పరమపురుషుని యందు భక్తి ప్రకటించుట కొరకే సాధనమైయొప్పి, తీవ్రమైన భక్తిని ఉత్పాదించుట, ఆ భక్తి ధ్యానమునకు గొంపోవును. మనస్సు భగవంతుని చక్కగా కలిగియుండిన, ధ్యానము భక్తిని తీవ్రతర మొనర్చును. ఆ ధ్యానము భక్తునకు మరింత ప్రీతికరమగునంతవరకు, ఆ ధ్యాన వస్తువుగ నుండిన భగవంతుని మానసిక తుష్టి మరింత స్పష్ట మగును. ఈ తరుణమున ధ్యాన మొక ఉద్దేశ్యమును సాధనమని చెప్పవలయును. భక్తి ఒక రకమైన జ్ఞానము. అది ఆనందముగ ఫలిత మిచ్చుటయేకాక, స్వాయముగ ఆనందమే. భక్తియోగి పరిపూర్ణమైన భక్తితో భగవంతుని ఆనందపరచుటవలన భగవంతుడు దానిని తన చెంతకే చేర్చును. వాస్తవముగ ఆయన వానిని తనలో లీన మొనర్చుకొనుటకు బలవంతము చేయబడును. తన ప్రారబ్ధకర్మము నశించినంతనే భక్తియోగియైనవాడు ప్రత్యక్షముగ ఆ భగవంతుని అనుభవించునని, ముక్తు

డైన పిదప, ఆయనను నయనములద్వారా అనుభవించగలడని తెలియ జెప్పబడినది.

భక్తి యోగముద్వారా పొందబడునట్టి మూడు గమ్యస్థానము లున్నవని శ్రీమద్రామానుజు లానతిచ్చి యున్నారు. అవి 1. ఐశ్వర్యము, 2. కైవల్యము, 3. భగవానుడు అనునవి. ఐశ్వర్యార్థి యైనవాడు ప్రాకృత సంపదల నాశించువాడు కావున, మోక్షమును బడయజాలునని స్పష్టీకరించిరి. ఇక కైవల్యార్థిని గూర్చి —

"జిజ్ఞాసువు - ప్రకృతి వియుక్తాత్మ స్వరూపావాప్తిని గోరువాడు."

— *(గీతాభాష్యము : 7 – 16.)*

అనగా - 'ప్రకృతినుండి వేరైన ఆత్మదర్శనము ననుభవింప గోరిన వాడు' అని చెప్పబడినది. భగవత్ప్రాప్తిని గోరువాడు 'జ్ఞాని' అని జ్ఞాని నిట్లు విశదీకరించిరి :—

"భగవచ్ఛేషత్వైకరసాత్మ స్వరూపమును తెలిసికొని, ప్రకృతి నియుక్తమైన కేవలాత్మయందు నిలచియుండక, భగవంతుడే పరమప్రాప్యమానుడని తలంచి, భగవంతునే పొందుట కిచ్ఛగించుట." — *(గీతాభాష్యము : 7-16.)*

అందువలన, కైవల్యార్థి యైనవాడు - ఆత్మదర్శనముతోడనే నిలచి పోవునని, భగవత్ప్రాప్తి గోరువాడట్లు గాక, పరవిద్యోపాసనకై పురోగమించునని తెలియజేయబడినది. పై మూడు విధములవారును పరమాత్మనే ఉపాసించువారైనను, ఐశ్వర్య, కైవల్యార్థుల కన్న జ్ఞానియే చాల గొప్ప యోగి యని చెప్పబడినది. అందరు యోగుల కన్న ప్రత్యేకించి, ఐశ్వర్య కైవల్యార్థులకన్న జ్ఞానియే శ్రేష్ఠతముడని ఇట్లు వివరించిరి :—

"నాయందు మనస్సు నుంచి,అత్యంత ప్రియుడనగు నన్ను క్షణమాత్రమైనను ఎడబాసి సహింపజాలక, మత్ప్రాప్తి విషయమున తొందర గలవాడై యుండి, ఎవడు

నన్ను సేవించి, పూజించి, ధ్యానించునో - అతడు అందరికన్న శ్రేష్ఠతముడు."
— (గీతాభాష్యము : 6 - 47 )

అందువలన, జ్ఞాని యొక్క మార్గము సులభమై, శీఘ్రముగ ఫలము నిచ్చునట్టిదై యుండ, కైవల్యార్థియైనవాని ప్రయత్నము మిక్కిలి శ్రమతో కూడినట్టిదని విదిత మగుచున్నది.

శ్రీమద్రామానుజులు మోక్ష ప్రాప్తికి యోగాభ్యాసము అత్యంతావశ్యకమైనదని నిర్ధారించిరి. యోగసాధనోద్దేశము భక్తియే అని తెలియచెప్పబడినది. మానసికమైన ఈ యోగసాధన, పరమపురుషునిపై ఆధారపడియున్నది. ధారణ - ధ్యానములతో విలక్షణమైన ఈ యోగమును ఎందరో మహోదయు లనుష్ఠించి, పరమాత్మ దివ్యచరణారవింద ధ్యానానంద పరవశులై, చిరకాలము జీవించి, భగవద్దివ్య సందేశముల నెంద రెందరకో ప్రవచించి చెప్పి, ధన్యాత్ములయిరి. అట్టి మహాయోగులు నేటికిని జీవించియున్నట్లు ఎన్నెన్నో దృష్టాంతము లున్నవి. శ్రీ మద్రామానుజ యతి సార్వభౌముల శిష్యులొకరు - 'మహాయోగి దేవరబాబా' అనువారు యోగ బలమున నేటికిని జీవించి యున్నట్లు 18-9-1983 తేదీ ఆంధ్ర పత్రికలో ప్రకటితమైనది ఇది మిక్కిలి ఆశ్చర్యకరమైన విషయము. దేవరబాబావారి వయస్సెంతో తెలియదు. వారి శిష్యులే 100 సంవత్సరములకు మించినవారున్నారు. భారత ప్రథమ రాష్ట్రపతి డాక్టర్ : రాజేంద్రప్రసాద్ చిన్నతనమున తన తండ్రితో కలిసి, ఈ బాబాను దర్శించిరట. ఆయన ధ్యాన సమాధిలో నుండి మానస సరోవర ప్రాంతమున దీర్ఘ కాలము తపస్సొనరించిరి. సంస్కృత భాషలో బాబా మహాపండితుడనియు, వేదములు, స్మృతులు, గీత, ఉపనిషత్తులనుండి శ్లోకములు

సులభముగా, ఆయన నోటివెంట వచ్చునని యు పేర్కొనబడినది. సర్వజీవకోటిపట్ల ప్రేమయే సర్వాత్మదర్శన సారమని దేవర బాబా జీవిత సందేశము నిచ్చిరి.

మోక్షార్థులైన భక్త శిఖామణులగు పాంథులు - అపార కారుణ్య సౌశీల్య వాత్సల్యౌదార్య మహోదధియు,అనవధికాతిశయ తేజోవిరాజితుడును, నిఖిల లోకైక శరణ్యుడును, సర్వాంతర్యామియు నైన పురుషోత్తముని దివ్య కటాక్షము నంది, చరితార్థులగుటకు పరమ పవిత్రమైన శ్రీమద్రామానుజ యతీంద్రుల యోగవిద్యా రహస్యము పాథేయమై అలరారుచున్నది.

"రామానుజార్య దివ్యాజ్ఞా, వర్ధితా మభివర్ధితామ్."



# ధనుర్మాసు

'భక్త కవిశేఖర'

## శ్రీ పుతుంబాక శ్రీకృష్ణయ్య



### కామదీక్ష

శ్రీరమ్యంబును - మోక్షదాయకము - సంసేవ్యంబునై, పుణ్య కా
వేరీ గర్భ సుజాతమై, విమలమై, వేదాంత రూపంబునై
శ్రీరంగేశు నివాసపీఠ మగుచున్ జెల్వొందు సుక్షేత్రమై
శ్రీరంగం బను పట్టణంబు గల దుర్వీదేవి సీమంతమై.

ఆ పుర గోపుర ప్రకర మంబర చుంబనలందుఁ గోవెలల్
బాపురె! హేమ రత్న ధనరాసులతో వెలదూఁగు; దీర్ఘికల్
శాప విముక్తిఁ జేయు విరజానది లౌను; విశేష మే మనన్
గాపుర మద్ది విష్ణుపదకంజములన్ భజియించువారికిన్.

అయ్యాది వైష్ణవోత్తముల యాలయ పంక్తుల కాలవాలమై
యెయ్యెడ విన్న సూనృతులె, యెయ్యెడ ద్రావిడగీతనామమే
తియ్యన తియ్యనై చెవికిఁ దృప్తి నొసంగును దివ్యగానమై
యయ్యరె! రంగధామమున కయ్యది సాటి మ తేది లే దనన్.

భావం బెంతయు రంనాథపదసేవాసక్తిఁ బుట్టింపఁగా
సావేరీ ఘనరాగ మేళనమునన్ సద్భక్తి గీతంబులన్
ద్రోవన్ బోవుచుఁ బాడుచుండెదరు ప్రత్యూషంబునం దా పురిన్
గావేరీ విమలాంబు సంతతులఁ దోఁగన్ జేరు పుణ్యాంగనల్.

చూడన్ జూడగ గ్రొత్త యౌచు మిగులన్ జోద్యంబునై యొప్పుచున్
నాఁడున్, నేఁడును, రేపుగూడ గుడులున్ బ్రాకార కుడ్యంబులున్
బాడున్ రంగని భక్తి గీతికల విన్నాణంపు రాగంబులన్
వీడన్ జాల రదెట్టి మూఢు లయినన్ వీక్షింప శ్రీరంగమున్.

ఆ పురంబున మల్లవిద్యానిధి యయి
కాసు వీసముగల ధనుర్దాసుఁ డనెడి
పేరు గల్గిన యొక్క సంసారి గలఁడు
యింతిలోఁ డిదె లోకముం చెంచు నతఁడు.

సారములేని సంసరణ సాగర మీదుచు నోలలాడుచున్
దీరము పారమున్ గనక - నీతియు, లజ్జయు, ధర్మచింతయున్
మీఱి చరించుచుండుఁ బొలిమేరల దాటిన కామదీక్ష ; శృం
గార రసైకమూర్తియయి కన్నును మిన్నును గాన కెంతయున్.

అతని కీడు జోడు నగు భార్య గల దామె
సొగసు లొలుకునట్టి సుందరాంగి
హేమవర్ణ యౌట హేమాంగి యను పేర
బిలిచినార లాప్త పిన్ననాఁట.

కాంతారూప మ దిట్టు లుండవలెనాన్ గందర్వ దేవేరి య
త్యంతం బిట్టుల దీర్చి దిద్దుకొని సంధ్యాకాల వాహ్యాళి కి
ప్రాంతంబందుఁ జరించుచున్నటుల దోఁపన్ జేయు నిక్కంబుగా
నెంతే సార్థకనామధేయ యగు నా హేమాంగి హేమాంగియై.

అసలె కాముకుఁ డింక నాపైన నిజకాంత
మిసిమి నెసఁగునట్టి బిసరుహాక్షి ;
ఆజ్యధార నిడిన యగ్నిరీతిని వాని
కామవృత్తి యొటుల గ్రాలకుండు !

కులుకుమిటారి ! క్రొన్నెలత ! కోర్కుల పంట ! వయస్వినీ! సుధా
కలశమ ! నాదు జంట ! కులకాంత ! మదీయ శుభోదయా ! కళా
విలసిత ! యంచు నెల్లపుడు బిల్చుచునుండును వెంటనంటి ; యా
మెలతను బాయలేఁ డొక నిమేషమయేని యదేమిచిత్రమో !

కమ్మ కస్తురి చుక్క కలికి మోమున దిద్ది
యా మోము మోమున కద్దికొనును
అంగరాగ మలంది యది యారకయ మున్న
కాంతను బిగియార గౌగలించు
తల దువ్వి వాల్జడ వెలయించి నీటుగాఁ
బ్రక్కకుఁ జేరి తా బైనఁ దాల్చు
మేలి భూమల నెల్ల మెడ వైచి ప్రియమున
వానిలోఁ గొన్ని తా వైచికొనును
కలికి పయ్యెద నొక కొంత గప్పికొనును
అతివ విడెమున నొక కొంత యారగించు
మహిత భక్తిని దైవ నిర్మాల్యములను
గోరి ధరియించు గొప్ప భక్తుని విధాన.

అతివ పయ్యెద జార నది చక్కదిద్దును
సిగపూలు వాడఁ గ్రొత్తగ నమర్చు
తరుణి గానము సేయఁ దంబురా నందించు
శ్రమ వారి తాళవృంతమున నార్చు
పడతి నాట్యము సేయఁ బదకింకిణు లమర్చి
ప్రక్కఁ దాళంబుల బట్టి నిలుచు
బోటి గృహోద్యానవాటిని విహరింప
రవిదీప్తి సణప ఛత్రమును బట్టు
సకియ నడువంగ మార్గము చక్కబఱచు
ముందు గతిఁ జూడ కాతఁడు మోహవశత
మెలత సేవయె నిత్య నైమిత్తికములు
గాఁగ బ్రొద్దులు పుచ్చు దుష్కాల హాతిని.

తరుణి విడనాడి యొక ముహూర్త బయేని
కాల మింకొక్క రీతిగాఁ గడుపలేఁడు;
నాతి ఋతుమతియైన మూన్నాళ్ళ విరతి
కల్పశతముగఁ దోచు న క్కాముకునకు.

ప్రకృతిచేతను సహజ సంప్రాప్త మయిన
వ్యాధి యొకవేళ నాపెకు వచ్చెనేని
ప్రళయ మయ్యది - తను జుట్టవచ్చినట్లు
విధిని దూరుచునుండు నవ్వేళ యందు.

నాతి ! నే నియ్యెదె స్వాతిమేఘుఁడనైన
విద్యుత్తరంగమై వెలయు దీవు
పూబోడి ! నే నిదె పూర్ణచంద్రుఁడనైన
జ్యోత్స్నాస్వరూపంబు నొందె దీవు
అతివరో ! నే నిదె యబ్జంబ నే నైన
అందలి మకరంద మయ్యె దీవు
వాల్గంటి ! నే నిదె వార్నిధి నే నైన
వారి తరంగమై వరలె దీవు

అనుచు నిజకాంత కాతని యుబ్బురంపు
వలపు లొలికించు పలుకుల బలుకుచుండ
తత్త్వ మెఱుగని యూ ధనుర్దాసునకును
తరుణి యెడ గల్గె నిట్టి యద్వైతసిద్ధి.

బాల్య మిత్రుల గన్న భాషింపఁ డెన్నడు
భార్యతో నర్మగర్భములు దక్క
ఇతర కార్యము సేయ నెంచఁ డేనాఁడైన
నిజకాంత పరిచర్య నియతి దక్క

పరమేశుఁ జింతింపఁ దరనిమేషము యేని
తరుణీ లావణ్య చింతనము దక్క
సద్గ్రంథ పఠనంబు సలుపఁ డెన్నండును
దవ్వితోఁ గామ సూత్రములు దక్క

అన్య మెఱుఁగఁడ యిట్టు లనన్యభక్తి
నతివపై జూపు విషయభోగానురక్తి;
పొలతి సేవయె యాతని భుక్తి ముక్తి
కరుణ లేనిది కటకటా కామశక్తి!

అతఁడా మన్మథ మన్మథుండు - సతి భార్యారూప మింకేమి యా
రతి రూపంబె - సమస్త సంపదలకా రన్వాంతయున్ లోటు లేఁ;
దతి రూపాధిక సంపదల్ గలుగ న య్యాలున్ మగం డింకఁ గా
మ తిరోధానముగాంతురే? ముదిమి సంప్రాప్తంబు గాకున్న చోన్.

కాసార జలవీచికా డోలికలయందు
దూగాడు రాయంచ దోయి యనఁగ
మిసిమి వెన్నెలకాంతి మేసి యాకసమునఁ
గేరింత లాడు చకోరము లన
ప్రావృట్పయోధర ధ్వానానుగతి నృత్త
కేళిఁ జరించెడి కేకు లనఁగ
గోన గోనఁ బ్రియభాష లనయంబు సలుపుచు
గస కస లాడు జక్కవ లనఁగ

గూడియుండి యెల్ల కోర్కులఁ బండించు
నేద్యవృత్తియందుఁ జిత్త మిగుటఁ
బ్రొద్దు గ్రుంకు టెట్లొ - పొడుచుట యెట్లొ
కానరైరి వారు కాల గతిని.

ఆమని ప్రొద్దులందుఁ జివురాకుల సెజ్జలఁ బూలదిండ్ల నెం
తే మృదులమ్ము లౌ నటుల దీరిచి, గొజ్జగి నీ ర్విదిల్చి క్రొం
దామర మొగ్గ లంచులను దాపి, మనోజ్ఞముగా నొనర్చి, యా
రామమునందు వెన్నెలల రాత్రులఁ బండెద రెంతో వేడుకన్.

వలపులు తేనె సోనలయి వడ్డికి బారగ వార లిర్వురున్
గులికెడి గూటి గువ్వలయి కోయిల పాటకు వంత బాడుచున్
జిలిబిలి మాట లాడుచు వశీకృత బర్హియుగంబు నాట్యమున్
సలిపెడి వేడ్క గాంతురు వసంతమునన్ దమ సౌధమందునన్.

ఆ శశివర్ణ సౌధ సముదంచిత కుడ్యమునందు నర్ధ నా
రీశుని విగ్రహంబు గని .. 'యిట్టుల బుట్టగ నోచ మైతి' మం
చాశలు గుమ్మరించుకొని యా తరుణోజ్జ్వల రూప దంపతుల్
పేశల బాహువల్లికలఁ బ్రీతిఁ బెనంగెద రెంతో వేడుకన్.

పూవుల్ గంధము మేలి యత్తరువులన్ బుక్కాములన్ గూర్చి యా
పూవిల్కాని గులాములై, యొరుల చూపుల్ వారు లక్షింప కే
వేవేళన్ ముని మాపులందు విధిగా నేతెంతు రా వీధులన్
గావేరీ సికతా విహార కలనా కౌతూహల స్వాంతులై.

మొన మొన్న నాటిన మొల్లలు వికసింప
గుచ్చి తెచ్చితి నంచు మెచ్చి యిచ్చు
రమణి! యియ్యవె గంధరాజ పుష్పము లన్నఁ
బ్రియము నీ కంచును బిలిచి యిచ్చు
హేమాంగి! నీ కివి యేరి తెచ్చితి నంచుఁ
బరువంపు నూత్న చంపకము లిచ్చు
పాటలాధరి! నీకు బాగు బాగిది యంచుఁ
బాటలీ పుష్పంబుఁ బట్టి యిచ్చుఁ

క్రొత్తరక మిద్ది - దీనిఁ గోరి తెచ్చి
ప్రోదిఁ జేసితినా చేవో పూలు దెచ్చు
వెలదితోఁడ గృహోద్యాన వీథులందు
నరుగు వేళల నా నవ యౌవనుండు.

అతఁడు పూలు రాల్ప వకుళాగ్రము నెక్కి విదుల్చునంతలో
జాతర లాడి యాతని కపాయ మెదేని ఘటిల్లవచ్చునం
చాతనిమీఁది ప్రేమమున నాబిడ చెట్టు విదుల్పవద్దు లే
చేతుల నేరు పుష్పములు నేకురు చాలును డిగ్గి రమ్మనున్.

లకుముకి పిట్ట లెల్లు పదిలంబుగఁ జేపల టక్కు టక్కునన్
ప్రకటిత చాకచక్యమునఁ బట్టునొ, యట్టులె కందుకంబులన్
జకచక బట్టుకొంచును బసందుగ వెన్కకు ద్రిప్పి కొట్టుచున్
వికవిక నవ్వుచుండు రలివేణియు నాతడు క్రీడలందునన్.

బంగరు బొంగరాలజతఁ బట్టి, యి పెట్టుల నుండెఁ బల్కు మో
యంగన! యంచుఁ గాంతహృదయంబునఁ జూపునిగుడ్చి; నాపె యా
సంగతి కర్థ మెంచియు - రసజ్ఞనె నే నని? నవ్వ నాఁచుచున్
భంగిమఁ జూపి నవ్వఁ జెలు నవ్వులు వెన్నెలపూలు బూయఁగన్.

ఇది యని చెప్పఁగ నేటికి
హృదయంబున కెప్పు డేది యిష్టం బగు న
య్యది యెల్లను విడకుండఁగ
నడనున రమియింత్రు వార లా యాయెడలన్.

మలయపర్వత సానువులఁ బటీరచ్ఛాయ
విడిది కేగెద రొక్క వేళయందు
శరదిందు చంద్రికా శైత్యానుభవ మంద
బయల నుండెద రొక్క పట్టునందు

వనలతా కుంజ నివాసానుభవ కాంక్షఁ
గాన కేగెద రొక్క కాలమందు
నావికాయాత్ర సౌఖ్యావహంబని యెంచి
పోవుచుందురు పూల నావయందు

అప్పు డప్పుడు పాచిక లాడుచుంద్రు
చిలుకలకు మాట లెంతయుఁ జెప్పుచుంద్రు
వేఱె పలుకంగ నేలపో వారి యునికి
సకల పరివారయుత పంచశరుని యునికి

పొంగెడి యౌవనంపుఁ బరిపూర్ణ ఫలం బిది యంచు వార లా
యంగజు సేవ యిట్లు లనయంబును సల్పుచునుండు నంత, హే
మాంగికి నొక్క నాఁ డుదయ మందె న దేమి విచిత్రమో మదిన్
రంగని యుత్సవంబు గని నమ్రలి మ్రొక్కెడి కోర్కి యెంతయున్.

ఆపె కా రీతి నెంతయు నాస గలుగఁ
దనదు కోరిక నప్పుడు దయితునకును
దెలుప, నాతఁడు సమ్మోద కలితుఁ డగుచు
నంత నాపె నలంకృత వగు మటన్న.

వలిపెంపు గ్రొంబట్టు వస్త్రంబు ధరియించి
రవణించు మేల్ జరీ రవిక దొడిగి
అందందు మితముగా నమరించి భూషల
నవ్యమైన ముత్యాల సరము దాల్చి
అరవిచ్చి చివురాకు లొరసి కాంతుల నీను
పుష్ప గుచ్ఛములు గ్రొమ్ముడి ధరించి
కమ్మ పుప్పొడి ముఖమునం దిద్ది
యగరునఁ దిలకంబు నమరఁజేసి

సంకుమదసార ఘనసార కుంకుమంపు
లేత మెయిపూత వాసనల్ నిగ్గు జూప
సొగసు లన్నియు నొకచోటఁ జొచ్చినట్టు
లంత సంస్కృతి యయ్యె హేమాంగి మిగుల.

ఆపె యిట్టు లలంకృత యయిన గాంచి
తనకు దగినట్టు లా ధనుర్దాసు, మేలి
యుదుపులం దాల్చి యాపెకు గొడుగుఁ బట్టి
సేవకుని రీతి రంగని సేవ కరిగె.

## ఆ చా ర్యా గ మ న ము

పొడుగునకున్ దగు పుష్టి - పచ్చని మేను
నాజాను బాహువు లమరువాఁడు
సొగసైన నాసిక - సువిశాల ఫాలంబు
కడు దీర్ఘనేత్రముల్ కలుగువాఁడు
అరుణోదయ ప్రభల్ విరజిమ్ము శుభ్రంపు
కాషాయ వస్త్రముల్ కలుగువాఁడు
వెనువెంట జనుదెంచు వేద పాఠకులైన
సచ్ఛాత్ర భూసుర సమితివాఁడు
కరుణ వర్షించు చూపులఁ గ్రాలువాఁడు
స్థిరత గాంచిన యోగ ప్రదీప్తివాఁడు
అదిగొ యే రంగపురవీథి నరుగుదెంచె
భక్తిరసమూర్తి యగు పరివ్రాజకుండు.

నడికట్టు బిగియించి వడి వడి నెదు రేగి
సాష్టాంగ దణ్ణముల్ సలుపువారు
భక్తి భావంబుచేఁ బదములఁ గడలింపఁ
జాలక కన్నీళ్ళ జార్చువారు

సర్వాపరాధముల్ క్షమియించు మంచును
కాళులు కన్నీళ్ళఁ గడుగువారు
మహిత విద్యారూప మంగళం బిదె యంచు
స్వస్తి వాక్యంబులఁ బలుకువారు
ప్రాంగణంబుల హారతిఁ బట్టువారు
పూజ్యపదముల లోలోన మ్రొక్కువారు
అరసి ముంగలఁ జని బరాబరులు సేయు
వారునై యొప్పి రా పరివ్రాజకునకు.

అతఁడే లక్ష్మణయోగిపుంగవుఁడు - శిష్టాచార సంపన్నుఁ డ
ల్లతఁడే మానవ సంఘమందున విశిష్టాద్వైత సిద్ధాంత నే
గతి మీా కంచును జాటువాఁ డతఁడె యోగప్రజ్ఞ లోకంబునం
దతి విస్తారము సేయువాఁడు - ఘన వేదాంతార్థ తత్త్వజ్ఞుఁడున్.

ఆ యతిరాజు మోమున మహా పరితృప్తియు - మందహాసమున్
బాయక దివ్వె లట్లు కనుపట్టగ శిష్యుల నుజ్జగించుచున్
దీయని మాట లాడుచును, దిక్కులు సూడక పోయి పోయి, యా
పోయెడి మార్గమందె పరిపూత చరిత్రుఁడు నిల్చె దేనికో!

కారణ మేమి లేకయె యెగాదిగఁ జూచుచు నిట్లు నిల్చె బా
జారున, నేమి గల్గెనొకో స్వామి కటంచును యోజఁ జేసి ఖం
గా రగు శిష్యు లెల్లర కగమ్య మయోమయ మాట నచ్చటన్
వారలుగూడ నిల్చి నలు ప్రక్కలఁ జూచిరి వెఱ్ఱి చూపులన్.

ఏమి స్వామివార లెందుల కిట్టుల
నిలచినార లనుచు బలుకరింప
జాలకచట బ్రహ్మచారులు గుజ గుజ
లాడుచున్నయట్టి యవసరమున.

తిరిగిచూడక ప్రక్కవీక్షన నదేమొ
కార్య మున్నట్టు లాచార్యవర్యు లరుగ
వారివెంటను నిజ శిష్యవర్గముఁ జని
చూడ, దూరానఁ గాంచిరి చోద్య మొకటి.

వేసము డంబు మీరి పృథివీపతి యట్టుల దోప, బాద వి
న్యాసము ఠీవి గొల్ప నిజ నారికి ఛత్రము నెత్తిపట్టి సం
తోసముతోడఁ గూడి తన దుర్దశ లోకులు చూడ, నా ధను
ర్దాసుఁడు వచ్చు రీతిని నిదానముగా దిలకించి రందరున్.

అటుల నతని గాంచి యాచార్యవర్యుఁడు
ఎట్టులైన వీని కిట్టి వృత్తి
పోవఁజేయ మనసు పుట్టి కాఁబోలును
ఆగు మాగు మనుచు నచట నిలిపి.

కార్యాకార్య విచక్షణత్వ మది గంగన్ ద్రోసి, నిర్లజ్జతన్
భార్యాదేవికి సేవఁజేయు టది గొప్పా? లేక, నీ వంశపున్
మర్యాదా? మరి పూరుషార్థమ? యిసీ మాటడవేమోయి? నీ
వీర్య ప్రజ్ఞలకున్ ఫలంబె యిది? లేవే వేఱు సత్కార్యముల్?

స్థిరమతితోడ సాధు పరిసేవ యొనర్చి - ప్రశాంత వృత్తితోఁ
బరమును గాంచు సాధన లవంబును జేయక, మూర్ఖ చిత్త వి
స్ఫురణ మడపఁబోక, తలపోయక ముక్తిని, గామమూర్తివై
యరమర లేక సిగ్గు విడి యాలికి దాసుఁడ వౌట యొప్పునే?

అనునంతనె యా మల్లుఁడు
తను గూరిచి పల్కుచున్న తత్త్వజ్ఞనిధిన్
గను గానక కావరమున
వినయము వోనాడి యిటుల విసువున బలికెన్.

పరము పరం బటంచుఁ దెగఁ బల్కెదవీవు - పరానుభూతి నే
నెరుగ - వృథా ప్రయాస గని యేమియు గాంచగలేని శూన్యమున్
బర మను భ్రాంతిచేతను భవాదృశు లిట్లు జడత్వబుద్ధిచేఁ
బరము పరం బటం చెపుడుఁ బల్కుచు నుందురు లేనిదానినిన్.

ఉన్నదియో పరం బదియు నూడ్చుకపోయినదో మరిప్పుడీ
యున్న సమస్త సంపదల నున్నవి యుండిన రీతి స్వేచ్ఛగాఁ
గన్ననఁ బొందుటే ఫలముగా కిక, నావల లేనిదానికై
పున్నము పూరుషార్థమని మూల్గిన నేమి ప్రయోజనం బగున్ ?

అని బిరబిరఁ జనబోయెడి
కను గానని కాముకునకుఁ గన్నుల నీయన్
మనమున నెంచి యతీంద్రుఁడు
వినుమని చెయి పట్టి నిలిపి ప్రియ వచనములన్.

నిలు నిలు మేల యేగెదవు ? నిక్కము బల్కితి వీవు ; కాని - నీ
కలి నిజాంగకి రూపమును గాంచి కదా యిటు భ్రాంత బుద్ధి సం
కలునుఁడ వౌట గల్గె ? కలకాలము నిల్వవు యౌవనంపు సొం
పులు ; మరి చూడలేదె ముదిమోముల వ్రేలెడి సొంపు సంపదల్.

నీ దగు వాలకంబు గన నిక్కపు మల్లుఁడవంచు దోచు ; నీ
పేద మనంబు నిన్నటుల బ్రీతి వరించెనొ పల్కఁజాల ; మ
ర్యాదను వీడి కాంత కనయంబుగ ఛత్రము నెత్తి పట్టి సం
వాదము జేతు వేల ఘన పండితుఁ డట్టుల వీధిలోపలన్.

జరయున్, మృత్యువు సర్వజీవ తతికిన్ సంప్రాప్తమౌ నెప్పుడో
నిరతం బా విధి వెన్నునంటి తిరుగన్ నిద్రాపరీభూత చి
త్తరతిన్ నిత్యముగాని యౌవనమె నిత్యంబన్న విభ్రాంతి తా
తరుణీ దాస్యము నేయ నౌనె ? పరతత్త్వం బింక చే దాయె నే ?

పరిణతి గల్గియున్నది ప్రపంచము నేఁడును రేపుగూడ ; నీ
సరణి నిరంతరాయముగ సర్వయుగంబులఁ గల్గుచుండు ; ని
త్తరుణికిగూడ నొక్కపుడు తప్పదు వార్ధక రూప ; మిప్పుడే
తరుణ మెరింగి నిత్య మగుదాని నీవు గ్రహింపగాఁ దగున్.

అల్లదె చూడు, నీ సఖి వరాంగమునన్ ధరియించుకొన్న సం
ఫుల్ల సుమంబు లిప్పటికె ముందటి శోభను వీడె నెంతయున్
బెల్లుగ రూపు మాయు నిదె వీథిన బోవుచు నుండునంతలోఁ ;
బొల్లగు కాంత యౌవనపు పోడిమి కూడ నిదే విధం బగున్.

సతి సుతు లేడ ? బంధువుల సంగతి యేడ ? ధనంబు లేడ ? దు
ర్గతి నొదవింపఁజేసెడి సుఖంబు ల వేడ ? వృథానురక్తితో
బ్రతుకు టదేమి లెస్స ? భవబంధ విమోచన మార్గ మక్కటా
వెతుక విదేల ? యిట్టి పశువృత్తి నిరంతర సౌఖ్య మిచ్చునే ?

సదస ద్వస్తు వివేకం
బుదయింపని మానవునకు నునికియు లేముల్
మదమున వ్యత్యస్తములౌ
ముదమున నది కనినవాఁడె ముక్తినిఁ గాంచున్.

తనకోస మిటుల బలికెడి
మునివర్యుని వాక్య మెంత ముక్తిప్రదమో
యని తెలియక గరువంబునఁ
జనబోవుచు యతికి నిట్లు చయ్యన బలికెన్.

అవునయ్యా ! యతి మంచిమాట యవుగా కా యింతి కష్టము లన్
దవులం బందిన నా మనంబు దిరుగన్ మార్గంబు వే రొక్కటి
భువిఁ గన్పింపగఁ జేయు లే రెవరు ; పో! పోనయ్యా; యీ మాట లే
లని వృథాయాసము నొందనేలని? భవమార్గంబిమ్ముఁ బ్రోద్దెక్కెడున్.

ప్రొద్దుపొడుపుననే నాడు పూవుబోడి
కన్నుదమ్ములు పస చెడి కమలుచుండ
చండభానుని కిరణాల సైపగలవె ?
వేగమే మేము గృహమున కేగవలయు.

అరమర లేక యి ట్లనుచు నాతఁడు వేగమ పోవుచుండగాఁ
గరమును బట్టి యా యతి - సుఖంబును జూపెద రాగదోయి, నీ
వెరుగని వెల్ల రిత్త యని యెంచెదో ? నిల్వుము - పారిపోకు - నా
తెరగె సమస్త సత్య మనితీరెద విప్పెడె జాములోపలన్.

అవుగా కీవు నచించినట్టుల వృథా వ్యాసంగమే; కాని - యీ
భువి నీ యుత్పలనేత్ర నేత్ర రుచికిన్ బోల్పంగ లేకేమి; గొ
ప్ప విచిత్రంబులు - ముక్తిదంబులును - సంపన్నంబులౌ నేత్ర ప
ద్మ విశేషంబులఁ జూపువాఁడ కని యీ దాసత్వమున్ వీడదే ?

అనినన్, మల్లుఁడు వల్లె యం చనఁగ నా యాచార్య దేవుండు, రం
గని దేవాలయ మార్గగామి యయి పోఁగా, నాతఁ డా వెంటనే
చనుచున్ గొందల మంది డెందమున, మోసం బేమి వాటిల్లునో ?
మునివేసంబున నున్న మాంత్రికుఁడో యేమో ? యంచు
యోజించుచున్.

ఈ జన్మ కిక నేను హేమాంగినిన్ గూడు
భాగ్యంబు లేదను భ్రాంతితోడ
ఈ నేత్రపద్మాల కెనయైన నేత్రంబు
లుండబోలునె యన్న యోజతోడ
ఈ వేళ నీ యతి యెందుల కిటు వచ్చె
నంచు దీరని సంశయంబుతోడ
ముందు వెన్కలఁ జూచి మోపెడి పాదంబు
లటు నిటుఁ బడు త్రొక్కులాడతోడ

పూర్వవాసన లెంతయుఁ బూన్కితోడఁ
గ్రిందు మీఁదులఁ బడఁద్రోసి డింపు పరుప
నరుగుచుండెను మెల్లగా యతికి వెనుక
మంత్రముగ్ధుని రీతి నా మల్లవరుఁడు.

ఆతని వెంట భార్యయును - నాపెకు వెన్క నదేమి చిత్రమో
చూత మటంచుఁ బోవు పరిశోధకులో వెనువెంటనే వటువ్రా
తము, నొక్క రొక్కరు పురప్రజ యంతయు రాగ, నాతఁడున్
జేతము దండడింప నెటో చేరెను రంగని ద్వారభూమికిన్.

వచ్చి నిలచిన యంత భక్తి భిక్షంబున
కదియె మొదటి కబళ మనిన యట్లు
ప్రతిమ వోలె నున్న వాని మెల్లన గాంచి
ప్రేమతోడ యతియు వినిచె నిట్లు.

అలవోకకై యిట్లు వెలయించినది కాదు
భక్తియోగజ్ఞాన భాష్య మిద్ది
శిల్పశక్తుల జూపు చిత్రశాలయు గాదు
ఆగమాఖిల సంహితార్థ మిద్ది
రాజాధిరాజ విశ్రాంతిధామము కాదు
షడ్దర్శనాదర్శ శాల యిద్ది
ఉబుసుపోకకుఁ జేరు నూరి రచ్చయు గాదు
అధ్యాత్మ తత్త్వవిన్యాస మిద్ది

పుడమి నరుఁడయి పుట్టిన పుట్టువునకు
ధన్యతను గూర్పు నిత్యము తరలవలయు
చూడ రమ్మిదె మల్లుఁడా ! చూడవలయు
అతులితంబగు రంగని యాలయంబు.

ఏ మహారాజేంద్రు లెంతెంత ధనరాసు
లర్పించి కట్టి రీ యాలయముల
ఏ భక్తవరులు తా మెంతెంత భక్తితో
నాటి రీ యుద్యాన వాటికలను
ఏ కర్మవీరు లెం తెంతయో దీక్షతో
సమకూర్చినార లీ సంపదలను
ఏ విశ్వకర్మ లెంతెంత సామర్థ్యాన
వెలయించినార లీ విగ్రహముల

వార లందరు వైకుంఠ పథముఁ జేర
వ్రాసియున్నది కీర్తి స్వర్ణాక్షరముల
పూరుషార్థంబు లిచ్చుచో పుడమిం జనుల
కతులితంబగు రంగదివ్యాలయంబు.

ఏ రాజరాజన్యు లీ దేవదేవునిఁ
గాంచి కప్పంబులఁ గట్టలేదు
ఏ శిల్పశాస్త్రజ్ఞు లీ దేవళంబునఁ
దమ కౌశలం జూపి తనరలేదు
ఏ వేదవిజ్ఞాను లీ యాలయంబున
సామగానంబులఁ జదువలేదు
ఏ శాస్త్రకోవిదు లీ దేవసౌధాన
షట్ఛాస్త్రచర్చలు సలుపలేదు

జ్ఞాన మూర్తేశు శిష్యాదిదాసుల కిది ;
సకల మతములవారికి జన్మహక్కు ;
సర్వ సంపత్ప్రదంబు, సుశాంతిదంబు ;
రంగభూజాని శ్రీరంగ రాజధాని.

తైర్థికానవళి ప్రసాదము లారగించెడి
ప్రఖ్యాతమైన యుప్పరిగ యిద్ది
సతత గోఘృతహోమ సంయుక్తమై యొప్పు
సువిశాల మగు యాగశాల యిద్ది
సకలశాస్త్రపురాణ చర్చలు సలిపెడి
విద్వత్వతంసుల వీథ యిద్ది
ఆ యర్జునుఁడు తీర్థయాత్రకై వచ్చిన
సమయానఁ గట్టిన చవిక యిద్ది

యనుచు నచ్చోట నున్న ముఖ్యస్థలంబు
లన్ని జూపుచుఁ బ్రదక్షిణ మగుచు వచ్చి
ప్రణవ మందిర ముఖమంటపంబు సొచ్చి
దయను నిటు బల్కె నా ధనుర్దాసుఁగూర్చి

ఈ మంటపంబున నెంద రెందరు ధరా
ధవులు సాష్టాంగ వందనము లిడిరో ?
ఈ స్థానమందున నెంద రాచార్యులు
తర్కమీమాంసలఁ దనిపినారో ?
ఈ మందిరంబున నెంద రాళ్వారులు
భక్తిగీతంబులఁ బాడినారో ?
ఈ దేవళంబున నెందరు ఋషివరుల్
చేసి తపము ధారవోసినారో ?

మాకు రంగని యాస్థాన మహిమ నెన్నఁ
దరము గా దింక నెరికిం దరము గాదు
తలచినంతన మే నది పులకరించు
తమ్ము, దర్శింపు, నీ విదే రంగనాథు.

ఈ దేవదేవుఁడే యిక్ష్వాకు కులజాల
కిలవేల్పుగా నుండ వెలసినాఁడు
ఈ కృపాసింధువే లోకైక నాథుఁడై
ప్రేమ మెంతయు గురిపించువాఁడు
ఈ కల్పవృక్షమే యే యఘంబులనైన
నెంచక శరణంబు లిచ్చువాఁడు
ఈ రంగనాథుఁడే యిలఁ గల్గు జనులకు
ముక్తినిఁ గయిసేయ మొనయువాఁడు

ఈ మహాత్ముఁడె సర్వ నియామకుండు;
కర్త యీతఁడె దీనులఁ గావ; నితఁడె
నిత్య మెంతయు నీ దాక్షిణాత్యులకును
గంటి యెదుటను బండు బంగారు పంట.

ఏ దృక్కులను గాంచ నెల్ల యోగీంద్రులు
సంతత ధ్యానంబు సలుపుచుంద్రు
ఏ కటాక్షము గాంచ నెల్ల దిక్పాలకుల్
మించిన భక్తి సేవించుచుంద్రు
ఏ చక్షువుల గాంచ నెల్ల దేవతలును
అనిమిష వృత్తిని నవధరింత్రు
ఏ నేత్రరుచి గాంచ నిందిరాదేవి తా
హృదయంబునను వసియించియుండు

నట్టి చిత్రాతిచిత్ర నేత్రాబ్జము లవె
సగము విచ్చిన ఘన కుశేశయము లనఁగ
యోగనిద్రా విభూతితో నొప్పియున్న
వవియె, దర్శించి ధన్యత నందవోయి!

చూపెద నన్న నేత్రరుచిఁ జూపితి, నిద్దురయె సుమ్మి, నే నికన్
జూపెడి దేమి లేదు; సరిఁ జూడుమ యిర్వురి నేత్రకాంతి; నీ
దాపున నుండె దైవమును - దారయు, మోసము లేదు - దీనిలో
దాపక పల్కు నీ కిక ముదంబును గూర్చెడి దేదొ మల్లఁడా!

కరుణామూర్తి యతీంద్రుఁ డిట్లు పలుకన్ గైమోడ్చి యా మల్లఁడున్
వెరగున్ లజ్జయు విస్మయంబు నుదుటన్ వ్రేలాడ, దేహంబె దు
ర్భరమై తోపగ, గద్గదత్వ మొదవన్, భావంబు రేకెత్త ము
మ్మరమై భక్తి సబాష్ప నేత్రుఁడగుచున్ మాటాడ యత్నింపఁగన్.

తనువు కంపించి హృదయము దందడింప
చేతు లల్లాడఁ గన్నులు చెమ్మగిల్ల
నిలువఁజాలక యట్టులే నేలఁ బడియె
పుడమి బడియెడి వృక్షంబు పోల్కి నతఁడు.

ఆ విధి భూమిపైఁ బడిన, నాతని గాంచి యతీంద్రుఁ డంతటన్
నేవల మోద భావమునఁ గీల్కొని, శీర్షము దువ్వి మెల్లగా,
నావల లేవ నెత్తి, దరహాసము మోమున దూరు పెత్త నిం
కేవి యెరుంగఁ గోరెదవు యేర్పడఁ జెప్ప మటంచుఁ బల్కెనన్.

ఎరుగక తప్పుఁ జేసితి యతీంద్ర! సమస్తము రిత్తలాయె, నే
నెరిగిన వెల్ల; నిప్ప డిక నేమి యెరుంగఁగఁ గోరువాఁడ? నీ
చరణయుగంబె దిక్కనుచు సన్నుతిఁ జేసెద, మోక్షకాంక్ష సు
స్థిరముగఁ గల్గునట్లు కృప నేయుము నా కిక దేశికోత్తమా!

సల్లలితంపు సూక్తులను జాలఁగఁ బల్కితి వీవు నాకు; నీ
యుల్లము నే నెరుంగకయె యోరిమి వీడి మహానుభావునిన్
బ్రల్లద మాడినాడ, నను బాపము లేమి యొనర్చునో కదా!
వెల్లువలైన నా యఘము వేగము ద్రుంపుము దేశికోత్తమా!

చేసితి దోస మెంతయును, జేసితి నీ కెయిఁ దప్పు లెన్నియో
చేసితి లోకదూష్యమగు చేష్టల నెన్నియొ, కాంతలోడఁగ
దాన మటంచు నెంచి; యిఁకఁ బాపముఁ బాఱఁగ నన్ను మీరు నే?
మోసము నొందినాఁడ నెటు ముక్తి నొసంగెదొ దేశికోత్తమా!

హరిహరి యేమి సేతు నల్లదె మెల్లగఁ దొంగి చూచి, యా
మరుగున బొంచియున్న దనుమాన మ దేలను ? పాపరాక్షసీ
విరస మహాట్టహాస ఘన భీకర ఘాంకృతి, గుండె వ్రయ్యలై
తెరగున మ్రోగుచున్న దిఁక దిక్కు నొసంగవె దేశికోత్తమా!

పశ్చాత్తాపము చేత నా యెడద తప్తం బాయె నేఁ దక్కుటా!
దుశ్చారిత్రుఁడ నేఁ డటన్న యపవాదున్ బాప నాకౌనె? ప్రా
యశ్చిత్తం బిఁక నేమి చేసెదో? యిదే యాత్మార్పణన్ జేసి, నే
నిశ్చింతన్ భవదీయ పాదయుగమున్ సేవింతునో దేశికా!

మునుపటి వర్తన కిట్టుల
మనమున దుఃఖించి మిగుల మల్లాడు వల్లన్
ఘన కృపఁ గల్గి యతీంద్రుం
డనియెను హృదయంబు శాంతి నందగ నిటులన్.

నన్నుతిఁ జేయు టేల నను? చాలును జాలును; చూడు మయ్య దే
విన్నను, నన్ను, లోకమును సత్యము రక్షణఁ జేయు నాథుఁ డా
పన్న శరణ్యుఁడై కనుల పండువు సేయుచు, నీదు ముంగలన్
బన్నగ బండియుండ శరణాగతి జేయుము వాని కింతటన్.

అతఁడె సమస్త పాపముల నావల ద్రోసి, దయార్ద్రచిత్తుఁడై
యితఁడు మదీయ భక్తుడని యేలగలాఁ డిక, వాని కూర్చి నీ
వెతలను జెప్పికొమ్ము కడు వేగను నీ హృదయంబు శాం[illegible]
ప్రతత గఁజేసి మోక్షపు నిధాన మొసంగు శరణ్యు[illegible].

ఏగెద నే నాశంబునకు నెంతయుఁ బ్రొద్దు గతించె ; నీ విదే
నాగశయాను పద్మనయనంబుల కాంతినిఁ దృప్తిదీర నెం
తే గని రమ్ము - నీ యఘము దీరును ; నా పయి భక్తియున్నచో
భాగవతోచితం బయిన వైష్ణవదీక్ష గ్రహింపఁగాదగున్.

అనుచుఁ బ్రియమునఁ బలికి రామానుజుండు
కొంత మనసున నతనికి శాంతి గూర్చి
యాశ్రమంబున కరిగెడి యవసరమున
ననియె దుఃఖంబు దోప హేమాంగి యిట్లు.

కలిగిన మాత్రమున్ గుడిచి - కాంతునితోడ యథేష్ట వర్తనల్
సలుపుచు - సర్వసౌఖ్యము లొసంగెడి సౌధమునందు హాయిగా
జిలుకలు గోరువంకలును జేసెడి గానము లాలకింప కీ
తలపది యేల గల్గెను విధాత లిఖించిన వ్రాతగానిచో !

వలచి సమస్త సౌఖ్యము లవారిగ గూర్చుచు నుండె కాంతు ; డా
వలపు లవెల్ల నేఁటికి బ్రభంజను ధాటికి దూది పింజె ల
ట్లలరిగఁ దూలిపోయె ; నిక నాతఁడు నా కెటు లబ్బునో కదా !
తలపగ నింద్రజాలము విధంబుగ నున్నవి నీదు కృత్యముల్.

ఓ యతిశేఖర ! యిట్టుల
నా యధిపుని మాయఁ జేసినాడవె కట్టా !
నాయము పాయము లేదా ?
పాయగ లేకున్న జంట బాపుట తగునా ?

ఈతఁడె నాదు సంపద - మ రీతఁడె నా మెయి నున్న ప్రాణముల్;
ఈతఁడె నాదు డెంద మగు నీతని లోపలనే వసించి నం
ప్రీతిని వత్సరంబుల నిమేషము లట్టుల పుచ్చుచుంటి, నిం
కేత్రు వీడి నే బ్రతుకు టెట్టులనో యతిరాజశేఖరా !

కావియుఁ బూవు రీతి, జలదంబును నీరము పోలె, జీవికా
జీవిక లట్లు కాపురము సేయుచు నుంటిమి ; నేఁటి కిట్లు మ
మ్మా విధి నీదు రూపమున నావల నీవలఁ జేసివైచె నో
హో విబుధాగ్రగణ్య ! యెటు లోర్చెను నీ మన సిట్టి చేతకున్ ?

ఆపె యిట్టుల దుఃఖంబు నాపలేక
తనకుఁ బతికి వియోగంబు తప్ప దనుచుఁ
దలఁచి కాంతునిఁ బిలిచినఁ బలుకఁ డనుచుఁ
జేరి యా యతిఁ బ్రసన్నునిఁ జేయఁదలచి.

జలజలరాలు బాష్పముల నంఖ్యములై దిగజారి, కాల్వలై
వలిపెపు పయ్యెదన్ దడుపవచ్చెడి దుఃఖము నాపలేక సా
గిలఁబడి మ్రొక్క నాపెకు 'సుఖింపు' మటంచు వచించి, మెల్లఁగాఁ
దలపయి యోగశక్తియుత దక్షిణ హస్తము నుంచి యాతఁడున్.

అడలకు మమ్మరో ! యిట్టుల
కడు నరుదగు భక్తి గలిగె కాంతుని కనుచున్
బడయక సమ్మోదం బీ
చిడిముడిపాటుల నీకుఁ జెప్పము తల్లీ ?

ఏల దుఃఖము గాంతు విది యసామాన్యము
నిందు భక్తిని గాంచె నీదు భర్త
మున్ను మీ రొదగూర్చుకొన్న సౌఖ్యంబులు
సారహీనము లంచు స్వస్తి జెప్పె
ఇంతమాత్రన కాంతు డిలు వీడి నిను బాసి
యడవి జేరునటంచు వడల వలదు
గార్హస్థ్యమున నుండి కామాదులను రోసి
సంతతంబును భక్తి నలుపవచ్చు

భక్తిమూలనె గలుగును పరమపదము;
ఇట్టి శుభశకున కీవు దుఃఖింతు వేల?
నాటకంబులు వలపులు, బుద్బుదములు
సకల సౌఖ్యంబు లఖిల సంసార గతులు.

సిరి రా మోకా లొడ్డిన
సరణిగ నో తరుణి! యీ విషాదము తగునే?
అరుదుగ గలుగుచు నుండును
భగవంతుని దయను నిట్టి భక్తివిధంబుల్.

జ్ఞాన నిపుణు డతని నిష్కామ బుద్ధి
జేరి సేవించి పరమేశు చింతనమున
నిహ పరంబులు సాధింప నెంచు తల్లి!
[illegible] మఠమున కరిగె రామానుజుండు.

ఈ యతి కెంతటి దయయో
పోషించి దయా మూఢమతుల బోనీయక యే
పాయని యవ్యాజ కృపన్
తీయని మృదు వాక్యములను దీరిచె నిటులన్.

ఏమి దళంబు వేసికొని యిట్టుల బుట్టిరొ? పూర్వజన్మమం
దేమి తపంబు సల్పిరొకొ? యేమి యొసంగిరొ సాధుకోటి కి?
ట్లీ మహనీయు పాదము లహీశ శరణ్యము లయ్యె, నేటితో
రామపథానువర్తులకు కాలము మారెను, తీరె దోసముల్.

ఇంతటివారలు గలరా?
ఎంతెంతలు చేసి యేగె నీ యతి యనుచున్
వింతలు పలుకుచు నేగిరి
పొంతల నున్నట్టి రంగపురజను లంతన్.

## వైష్ణవదీక్ష

అటుల దీవించి యోదార్చి యతివరేణ్యుఁ
డాశ్రమంబున కరిగిన యంత నతఁడు
తెప్పరిలి లేచి పొగులుచు దిక్కులఁ గని
యేడి? నా దేవుఁ డాచార్యుఁ డేడి? యనుచు.

వెడవెడ నవ్వుచు, నేడ్చుచుఁ
దడబడు పాదముల దారిఁ దప్పుచు, గురునిన్
దొడిబడు నుడులను బొగడుచు
వడివడిఁ బరువెత్తుచుండఁ బట్టణ వీథిన్.

ప్రాకార భిత్తి కా ప్రాంతంబులందున
రమ్యమౌ నాళికేరంపుచాలు
ప్రాంగణంబున నుండి బయటి కేగెడి త్రోవ
కిరు ప్రక్కలను బూగవృక్షపంక్తి
ఆ పంక్తులకుఁ బ్రక్కలందు నొప్పెడి లతా
కుంజంబులందునఁ గుట్టిమములు
ఆ కుట్టిమంబుల కనతి దూరంబునఁ
దనరారు భూరి బృందావనములు
రమ్య జంబీర చూత నారంగవృక్ష
వితతి గృహపార్శ్వమందున వెలసి మిగుల
నింపు లొదవించు చిన్ని కోనేర్లు గలిగి
వెలయు తలమును గాంచి, లోపలికిఁ జనగ.

చిదచిదీశ్వర సత్య సిద్ధాంత మొకచోట
నుభయ మీమాంస లం వొక్కచోట
అష్టాక్షరీమంత్రనిష్ఠ లొక్కొకచోట
నుద్గ్రంథ పఠనంబు లొక్కచోట

ద్రావిడామ్నాయ గీతంబు లొక్కచోట
యుక్తి ప్రయుక్తుల వాక్కుచోట
ఋగ్యజుస్సామాది ఋగ్ఘోష లొకచోట
నుపనిష దర్థంబు లొక్కచోట
వెలసి యయ్యది శారదా పీఠ మనఁగ
నన్నుతంబగు నొక చతుశ్శాలము గని
యదియె కావచ్చు రామానుజాశ్రమం బ
టంచు నూహించి, త ద్గృహమందుఁ జూడ.

వీచీపరంపరా విరహితంబగు శాంత
గాంభీర్యయుక్త సాగరముపోలె
వాతపోతవ్రాత భీతి నొందక నిల్చి
కలదని దీపంపు కలికరీతి
మసక మబ్బుల ఛాయ లిసుమంతయును లేక
వెలుగొందు జాబిల్లి బింబ మట్లు
తుహిన వర్షము లేని తూరుపు గొండపైఁ
బ్రభవించు నరుణ బింబంబు భాతి

వైరి వర్గంబు నణచి సంపదల విడచి
జ్ఞాన తేజంబు మోమున శాంతి గురియ
నింటి నడుమను నువిశాల మంటపంబు
నందు వేంచేసియుండె రామానుజుండు.

భాగవతోత్తముల్ గొలువ భాసిలుచున్న యతీంద్రు జేరఁ దా
సాగిలి మ్రొక్క ముందునకు సాగగలేక భయంబు నంది, యిం
కే గతి లేని కేగు టని యెంచుచునుండఁ బ్రియంబు జూపుచున్
స్వాగత మంచుఁ బల్కె నటఁ బల్కుల నేర్చిన రాజ కీరముల్.

ఆ పలుకుల విని యాతఁడు
లోపలి సంశయము వాసి, లోనికిఁ జని, సం
తాపము దీరగ యతివరు
దాపున సాష్టాంగపడియెఁ దత్పరమతియై.

దణ్డ మిడి యోసరిల్లి యా దండ నొదిగి
నిలిచియున్నట్టి మల్లుని సలలితముగఁ
బలుకరించియు భోజన భాజనముల
నరసి యాతని యాప్సితం బడుగ నతఁడు.

ఓ యతిలోకరాజ! కరుణోదధి పూర్ణశశాంక! యింక నన్
శాయని ప్రేమపెంపునను వైష్ణవదీక్ష నొసంగి నాకు నా
రాయణ మంత్రసారము రయంబునఁ గర్ణములందుఁ బోసి యో
తోయరుహాక్ష! నీదు పదతోయము లిచ్చి పునీతుఁ జేయుమీ

నావి యనంగ నెవ్వియు మనంబున నెంతయుఁ దేరి చూచినన్
లే, నవి యెల్ల స్వాములవి; లే దొకటేనియు వీని కింక; మి
న్నే విధి గొల్చెదున్? హృదయ మేనియు వీనిది కాదు; దాసునిన్
దేవరవారి పాదయుగ తీర్థసుధన్ జరితార్థుఁ జేయరే!

దాసుఁడు మీకు నీతఁడు-స్వతంత్రుఁడుగాఁడొకయించుకంత-యా
వాసము, దేహ, మర్థ విభవంబులు, మానము ప్రాణమేని, స్వా
మీ! సకలంబు దేవర నిమిత్తము వర్తిలు వీని వస్తువుల్ -
మోసము గాదు; కోరి కొరమట్టయి పోయె నితండు సామికిన్.

ఇమ్ముల నుండె మృత్యువని యెంచక, సంసరణంబె నిత్య సౌ
ఖ్యమ్మని యెంచి జీవితము నాహుతిఁ జేసితి - నేఁడొ, రేపొ, రా
రమ్మని హుంకరించును గరమ్మును గాలభటాళి; యింక నీ
మమ్ము దలంచి భాగవత మార్గముఁ జూపి యనుగ్రహింపవే.

అనుచున్ గొందల మంది దుఃఖమున హాహాకారముల్ సేయు నా
తని వీక్షించుచు యోగిపుంగవుఁడు తాత్కారంబు గావింపగాఁ
జనదంచున్ గ్రహియించి రేపకడ దీక్షాపూర్ణునిన్ జేతు గా
వున, దుఃఖమ్మును మానుమం చనియెఁ సంపూర్ణానుకంపామతిన్.

ఆ వాక్యంబుల నాలకించి, మది నాహ్లాదంబు రెట్టింపఁ ద
ద్భావో ద్రేకముచేత మేనఁ బులకల్ భాసిల్ల, నేత్రంబు లం
దావిర్భావము నొందెఁ గాల్వలుగ నానందాశ్రువుల్; వానిచే
నా విప్రోత్తము పాదముల్ కడిగి సాష్టాంగంబు గావించియున్.

యతివరు నానతి చొప్పున
నతఁ డింటికి జనియెఁ గాని యా రాతిరి తా
నతివను జూడక పల్కక
మతిపోయిన వానికరణి మసలుచు నుండెన్.

ఎన్నఁడు తెల్లవారు? గురు నెన్నడు గాంతును? మంత్రదీక్ష నా
కెన్నఁడు లభ్యమౌను? మఱి యెన్నడు సంస్కృతిగాంతు? నన్ను భా
వోన్నతితోడ మానుపడి యోగిరమైనను ముట్టలేక యా
పన్నుని రీతి దుఃఖమునఁ బాపెను నాఁటి నిశీథ మెట్టులో!

అష్టాక్షరీ మంత్రమా యిది? యన్నట్లు
కొక్కొరొకో యని కోడి కూసె
భాగవతానీక భజనంబులా? యన్న
పక్షి భారద్వాజ పక్షు లరచె
జ్ఞానప్రకాశ విస్తారమా యిది? యన్న
తెరగున దిక్కులు తెలివి గాంచె
సద్గురుపాద సంస్పర్శమా? యన్నట్లు
ప్రత్యూష పవనాంకురములు సోకె

సహ్యజామల శీతల స్వాదు జలము
లందు గ్రుంకిడి వచ్చు పుణ్యాంగనాళి
లలిత భూపాలరాగ సంకలిత గీతి
కా రవమ్ములు గగనమ్ముఁ గ్రమ్మె నంత.
అవి శుభ శకునంబులుగాఁ
జెవి సోఁకగ నతఁడు లేచి చివ్వునఁ జని, తా
నవసరముల వెసఁ దీరిచి
యవతల, సతితోడ నరిగె నాశ్రమమునకున్.

ఎపు డెపు డంచు వేగమ యతీంద్రుని యాశ్రమసీమఁ జేరగా
జపమును సంధ్యయున్ సలిపి శాంతి నిధానమునా వితర్ది కా
విపుల తలంబునందు గురుపీఠమునన్ వసియించియుండె న
త్తపసి; ప్రదక్షిణంబు చని దారయు నాతఁడు మ్రొక్కి రాతనిన్.

వారలఁ గాంచి సంయమి నృపాలుఁడు - చెంత విశాల శాలకున్
జేరిచి, వహ్నిముంగలను నిల్పి, యథావిధి నొప్పఁ బంచ సం
స్కారము లాచరించి, కడకన్ వచియించె విశేష భంగుల
వ్వారిగ నిట్లు భాగవత పద్ధతిఁ బ్రేమపురస్కృతంబుగన్.

ప్రకృతి నేవేళ విధులఁ దప్పక చరింపఁ
జేసి, యీ దృశ్య జగము సృష్టించి, పెంచి
లయము నొందించు సతము నారాయణుండు
వాని యస్తిత్వమున కనుమాన మేల ?

కలఁడని, లేఁ డటంచుఁ గలకాలము నిశ్చయ బుద్ధి శూన్యులై
కలిగినవానిఁ గాంచుటకుఁ గన్నుల విప్పక శుష్క తర్క సం
కలిత మనస్కులై పసిడి కాలము వ్యర్థ మొనర్చి, దేవునిన్
దలపక జీవితంబును వృథాగతి నొందగఁ జేయఁ బాడియే ?

కలఁ డంచును గాంచితి మని
కలవానిని గూర్చి ఋషులు కయికొని పలుకన్
గలడో, లేడో ? యంచును
బలుకుట కొనవెఱ్ఱిగాక ప్రాజ్ఞత యగునే ?

కలఁడని యోగదృక్కులనుఁ గాంచి వచించుటె కాక యీశ్వరున్
దెలిసికొనంగ మార్గములఁ దీరిచి చూపిరి యోగు; లింక గా
వలసిన యోగసాధన లవశ్య మొనర్చి విశాల సత్యమున్
దెలియుట తప్ప, నాస్తికమతిన్ దలపోయుట వ్యర్థమే సుమీ !

దేహ మస్థిర మగుటయే స్థితముగాన
రేపు మాపను తామసరీతి మాని
యహరహంబును మానసాభ్యంతరమునఁ
బరమపదనాథ చింతన బరపవలయు.

ఎంతటి కష్టనష్టముల వేర్పడి వచ్చిన నోర్చి, తా నుపా
యాంతర, దేవతాంతర, మతాంతర చింతల వీడి, మానసా
భ్యంతరమందు విష్ణువునె ప్రాపకమున్ మరి ప్రాప్యమం చొగిన్
జి తనఁ జేయువాఁడె కడు నిక్కపు భాగవతుం డనన్ దగున్.

నరగున నట్టి దీక్ష కొనసాగుటకున్ దగినట్టి సాధనల్
స్థిరమతితోడ నెల్లపుడుఁ జేయుట యొప్పును; వాని నెంతయున్
బరమ పవిత్ర భావమునఁ బట్టు దొరంగక యాచరింపఁగా
బరగును నిత్యశాంతి ; మరి వానిని గూర్చి వచింతు నిప్పుడే.

తామస రాజసంబులకుఁ దావు నొసంగు నభోజ్యవస్తువుల్
నేమముతో ద్యజించి, యవిలే వివి లే వని కోరు జిహ్వాయం
దేమరుపాటు లేక, యవి యెన్నడు ముట్టక, దేహయాత్ర కే
మేమి యవశ్యమో యవి భుజించిన సాత్త్విక భోజనం బగున్.

సత్త్వగుణవృద్ధి భోజనమె కాక
తగిన నిద్రయు, మెలకువ, తగిన కర్మ,
తగిన భావము, భాషలు, తగిన సక్తి
కలిగియుండుట యొప్పు భాగవత తతికి.

దైహికాఖ్యాన మిట్టి సత్త్వమును వీడి
తామ సాదిక వృత్తులఁ దవిలెనేని
మానసంబును, నట్టులే మరలుగాన
దేహగతులను నియమించి తీరవలయు.

పిదపఁ జిత్తంబునందు దుర్వృత్తు లేవి
యున్నవో వాని శోధించి యొక్కటొక టె
రూపు మాపంగవలయు నారూఢమతిని
వాని నణపక యే కాడు వైష్ణవుండు.

ఇతరుల దైన్యంబు నెరిగి తా నుపకృతి
జేసి యహంకృతిన్ జెందఁ డెవఁడో
లోక మంతటికి నిరూఢియా భక్తితో
దణ్డమర్పించెడి ధన్యుఁ డెవఁడో
కరణ త్రయమున నెవ్వరి నిందింపక
సత్త్వ శుద్ధిని జూపు శాంతుఁ డెవఁడో
సర్వకార్యములను సమముగాఁ జూచుచుఁ
దృష్ణా లతల ద్రుంచు ధీరుఁ డెవఁడో

మగువ లందరు - పోషించు మాత లటుల
నూహ గలిగియు - నాలుక యూడుచున్న
సత్యము వీడఁ జాలని నరసుఁ డెవఁడో
వాఁడె నిజమైన యుత్తమ వైష్ణవుండు.

ఏ కోరికలు లేక యింద్రియంబుల గెల్చి
నిత్యసంతృప్తితో నెగడవలయు
పక్షపాతము వీడి భయమును బోద్రోలి
పరిపూత మది యయి పరగవలయు
శత్రు మిత్రులయందు సమత వర్తించుచు
మానావమానముల్ మానవలయు
దూషణ భూషణాదుల నేక రీతిగా
నెంచి యుపేక్ష గావింపవలయు

ఆత్మనాశన మొనరించునట్టి వైరి
షట్కమును ద్రుంచి నిర్మల శాంతి గాంచి
యలలు లేనట్టి గంభీర జలధివోలెఁ
బరగుచుండంగ వలయును భాగవతుఁడు.

దైవరతిఁగూర్చి, విపుల తత్త్వత్రయంబు
మనసు హత్తెడి రీతి బోధనము సలిపి
దివ్యజీవిత మిచ్చిన దివ్యగురువు
నందు దృఢతర భక్తినిఁ బొందవలయు.

గురువే తల్లియుఁ దండ్రియు
గురువే దైవంబు మరియు గురువే ప్రభువం
చెరిగియు సద్గురువర్యుని
నిరతము సేవింపవలయు నిర్మల భక్తిన్.

దయయును సత్యమున్ శమము దాంతి యహింసయు దైవభక్తియున్
నియమము నీతి నిష్ఠయు గణించినవాఁడు గృహస్థుఁడైన నా
దయ నిజగేహమున్ విడి యరణ్యమునన్ దప మాచరించు వాఁ
డయినను నొక్కటే యగు మహత్త్వము రెంట జితేంద్రియత్వమే.

కావున నవఁ జే యాశ్రమ
మే విధి నైనన్ని నేమి యింద్రియ జయమే
పావనునిఁ జేయు ; నద్దియె
కావలయును మోక్షమార్గగాముల కెల్లన్.

ఈ విధి నేమముల్ సలిపి, యెల్లపుడున్ హృదయంబునందునన్
దేవుని, సత్యధాముని, సునిశ్చిత భక్తినిఁ బూజ సల్పుచున్
భావమునందు నేరుపడు వ్యర్థపు కోర్కెల ద్రుంపివేసి, యే
వేవి యొనర్చి నప్పటికి నీశ్వరు ప్రీతికిఁ జేయగావలెన్.

జనన మరణాది దుఃఖ సంసార మిట్లు
దాట నవసరమైన సూత్రాల మెట్లు
జూపినాఁడను కార్యదీక్షాపరుండ
వగుము శాశ్వత సుఖముల నందుకొరకు.

ఆత్మసందేహభావ మావంతయేనిఁ
బుట్టనీయక విశ్వాసపూర్ణుఁడ వయి
కలుష విరహిత పుణ్యమార్గమున నడచి
పరమ పదమును గాంచుమో భాగవతుఁడ !

## వైరాగ్యము

అవధరింపుఁ డనంతర మాత్మరతినిఁ
గూడి, యాడుచుఁ గూర్మి గూర్చు
సకల సంపదలందు నాసక్తి లేక
తగులమును మాని నా ధనుర్దాసవరుఁడు.

నాలాయిర ప్రబంధాలాపముల గూడి
కామచేష్టాదులఁ గడకుఁద్రోసె
అష్టాక్షరీమంత్ర నిష్ఠాగరిష్ఠుఁడై
తరుణి యుండుటగూడ మరచిపోయె
శ్రీరంగనాథ సేవారంభ శీలుఁడై
సంసారవిధులకు స్వస్తిఁ జెప్పె
భాగవతానీక పరిచర్యలం గూడి
స్వోదరంబు నుపేక్ష జేసె

వెనుక నున్న కామవృత్తికిఁ దగినట్టి
వస్తుతతుల నెల్ల వరుసతోడఁ
బంచిపెట్టె వేగ బరులకు ; వైరాగ్య
భావ మొప్ప ; భక్తి పరిఢవిల్ల.

భూలోక విరజగాఁ బుట్టిన కావేరి
తెలినీట మజ్జనాదుల నొనర్చి
యదుశైల ఖనిజ సంపదయైన శ్వేత మృ
త్తిక నూర్ధ్వపుండ్రముల్ తీర్చి దిద్ది
మహిమాన్వితంబగు మంత్ర, ద్వయాను సం
ధానంబు నిష్ఠను దవిలి తవిలి
యతిరాజు తిరువడి మతిలోనఁ జింతించి
భక్తితోఁ బల్లాండు పాడి పాడి

రంగనాథుని దివ్యదర్శన మొనర్చి
వచ్చిపోయెడి సద్భాగవతుల గోష్ఠి
నలుపుచుండును జిత్తప్రశాంతితోడ
నతని కిద్దియె నిత్య కార్యక్రమంబు.

జ్ఞానమార్గమునందు గ్లానిఁ జెందితిరేమొ ?
రండు మీ రిచట విశ్రాంతి గొనుఁడు
సాంఖ్యయోగంబు నిస్సారమే కద ? యిట
హరికథాసార మాధురినిఁ గొనుఁడు
కర్మయోగమున నైష్కర్మ్యసిద్ధి యటంచి
మచ్చుఁ జూడుఁడు భక్తిమార్గ మిచట
హఠయోగమున మీర లరసిరా ? రండు మ
ద్గురు తరుచ్ఛాయను గూరుచుండి

భక్తిపాయస మింత సాపడి, శ్రమంబుఁ
బాపుకొనవచ్చు నంచును బ్రక్క నేగు
వారి నుత్కంఠఁ బిలుచును బ్రతిదినంబు
తివిరి యాశ్రమ తల వితర్దికను నిలిచి.

రండో మానవులార ! రేపటికి సంప్రాప్తంబు లే మానో ? యీ
దండన్ జూడకపోదురే ? హరిచరిత్రాలాపవాక్యగ్రా
ఖండంబుల్ చవిగొండు- మద్గురుని యుగ్రాణంబులోఁ జిక్కు-రా
రండో యంచుమ వ్యగ్ర కంఠమున సంప్రార్థించు నప్పాంథులన్.

వచ్చిన తీర్థయాత్రికుల వద్దకుఁ జేరి నమస్కరించి, రా
వచ్చును మా గృహంబునకు వంటక మిచ్చెద - కూడ దన్నచో
వెచ్చము దెచ్చియిత్తు నని విందునకున్ దొడితెచ్చి వారి నే
పొచ్చెముఁ బొందనీక, సరిపుచ్చును భక్తిగ భోజ్య వస్తువుల్.

తిరుమణి ధారులన్ గనిన - 'దేవరవారల దివ్యదేశ మే
నెరుగగవచ్చునా ? యిచటి కెన్నడు వచ్చితి ? రే మఠంబునన్
దిరవు లభించె ? సాపడుటయెచ్చటి ? మా యతిరాజుగాంచి యా
తిరువడి నాశ్రయించి, పదతీర్థముగొంటిరొ ?' యంచుఁబల్కెడున్.

ఎవరి తిరువడి సంబంధు ? తెచట, నేవి
సాంప్రదాయిక గ్రంథముల్ చదివి, వినిరి ?
దివ్య దేశంబు లేవేవి తిరిగినార ?
లనుచుఁ బృచ్ఛించు భాగవతాళి గాంచి.

ఆర్తరక్షణు వేంకటాద్రీంద్రుఁ గాంచిరా ?
వీరరాఘవుని సేవించినారె ?
భక్తవత్సలుఁడైన వరదునిఁ గంటిరా ?
ఘటికాచలప్రభుఁ గాంచినారె ?
సింహాచలేంద్రుని సేవించి వచ్చిరా ?
మంగళాద్రి నృసింహు మహిమ గనిరె ?
బదరికాశ్రమవాసు భక్తితో గాంచిరా ?
బృందావనాటు సేవించినారె ?

యనుచు నొక్కొక్క క్షేత్ర మాహాత్మ్య మడిగి
తెలిసికొనుసంత గాత్రంబు పులకరింపఁ
గనుల నానంద బాష్పముల్ కాల్వగట్ట
మౌనమున నట్టె భావసమాధి గాంచు.

అరుణోదయా త్పూర్వమందు మఠావని
సమ్మార్జనాదుల సలుపుచుండు
భాగవతుల రాక భావించి యెదు రేగి
సాష్టాంగ దణ్డముల్ సలుపుచుండు
తీర్థయాత్రికులైన దేశాంతరులఁ జేరి
క్షేత్ర మాహాత్మ్యంబుఁ జెప్పుచుండు
బీద సాదల గాంచి ప్రేమతో వారికి
గుప్త దానముల సంతృప్తి చేయు.

గురుని యాజ్ఞకుఁ జెవి యొగ్గి తిరుగుచుండు
ప్రబల భక్తియు, జ్ఞాన కర్మముల దీక్ష
గలిగి యాతఁడు పూర్ణయోగమునఁ దవిలి
భాగవతులకు నొజ్జగాఁ బరగుచుండు.

ఆశ్రమోద్యానంబునందు పాదులు ద్రవ్వి
యే పూట కా పూట యేత మెత్తు
తరు గుల్మ లతల శోధన నేర్పుగాఁ జేసి
పూలు బుట్టల నింపి పూజ కొసగు
ఆచార్యునకు సాత్త్వికాహార మని కొన్ని
కూర లా పూటకు గోసి యిచ్చు
ఇంపుగా బెరుమాళ్ళ కెప్పడి కప్పుడు
రకము మార్చుచును మాలికలు గట్టు

అతిథు లరుదేర నెంతయు నాదరించి
వారి కే వేవి వలయునో వరుస నడిగి
వలసి నన్నియుఁ గూర్చి య వ్వారలకును
విశ్రమించుట కను వగు విడిదిఁ జూపు.

ఎన్ని పను లిట్లు తాఁ జేయుచున్న గాని
యొరుల తోడను మాటాడుచున్న గాని
చిత్తమందున నీశ్వర చింతనంబుఁ
బాయఁ డాతని యధ్యవసాయ మేమొ ?

అరయఁడు త్రోవ నేగునపు డావల నీవల — గమ్య సీమయే
యెరుగక యేగుచుండు — హృదయేప్సిత మేదియు గానరాదు — సం
సరణము దాటి శుద్ధమగు శాంతినిఁ గూడిన వాఁడుగాన, బం
ధురమగు భక్తిభావ మదినూల్కొని యుండును మోమునందునన్.

వీనుల్ దన్పుచు వేగు బోకలను గావేరీ నదీగర్భమం
దా నిష్ఠానిధి దివ్యసూరుల ప్రబంధార్యార్థ గీతంబులన్
స్నానం బాడుచు బాడ, నుప్పతిలు త న్నాద ప్రతిధ్వాన మ
త్యానందంబున వంత బాడు - తటినీ సాకూత-గానం బగున్.

అచ్చపు జ్ఞానయోగులయి యాంతర దృష్టిని జూచు మార్గముల్
మెచ్చక జాలి నొంది, యిక మీరలు శీఘ్ర సుఖానుభూతికై
చెచ్చెర భక్తిమార్గమునఁ జేరుఁ డిదేల వృథా శ్రమంబు ? మీ
యిచ్ఛగ రంగనాథుని రమింపగ రండని చాటి పల్కెడున్.

దహరాకాశముఁ జూడ నేల? పరతత్త్వం బిట్లు మీ మ్రోలఁ బ్ర
త్యూహమున్ మంగళ విగ్రహం బగుచు భక్తవ్రాత మందారమై
యహిశయ్యన్ బవళించు రంగవిభు గన్నారంగ దర్శించి మీ
రిహ బంధంబుల నూడ్చ రాదె? పర మూహింపంగ వేరున్నదే?

రంగనాథుని భక్తి శీఘ్రమునఁ గాంచి
త ద్విశిష్టామృతంబు సాంతముగఁ ద్రావి
రుచిని గ్రహియించినట్టి యార్యాదులకును
బరమపద మద్ది - యరచేతి ఫలముగాదె ?
అనుచు నుద్బోధ సలుపుచు ననుదినంబు
నొక్క రొక్కరిఁ దోడ్కొని యొజ్జఁ జేర్చి
భాగవత దీక్ష నిప్పింపవలయు ననుచు
పురుషకారంబు సలుపు నా గురుని యెదుట

సకల సామర్థ్యముల సవ్యసాచి వోలె
వినయ భక్తుల వాయుపుత్రుని విధంబు
శుద్ధ వైరాగ్యమందు శ్రీశుకుని రీతి
యనెడి కీర్తికిఁ దావల మయ్యె నిట్లు.

# ప్రపన్నత్వము

అవలోకించిన విస్మయం బగును నిత్యం బాతఁ డాచార్య భాగవతానీక, రమా మనోహరుల కైంకర్యంబునన్ మానసోత్సవ సంరంభమునందు మున్గి, పర సంసర్గంబులన్ మాని, భక్త వరిష్ఠుండును-శుద్ధ సత్త్వమయ విఖ్యాతుండునై యొప్పుచున్.

భగవద్దాస్య మహా రసంపుఁ జవి యాస్వాదించి మత్తిల్లి, యిమ్మగ గీతంబులఁ బాడి యాడుచు మహామోదాబ్ధిలోఁదోఁగుచున్ నిగమారణ్య నివాసులౌ బుధుల కేనిన్ భక్తి బోధించి, తన్నగరీ వీథుల భక్తియోగ లతికల్ నాటించి నీ రోసెడున్.

అలయఁడు సేవలన్ సలుపు నప్పుడు - దివ్యసుఖ ప్రవృష్టిచేఁ బలుకఁడు వ్యర్థవాక్య మొక పట్టున నైనను ; బల్కఁ బొచ్చెనా సలలిత శైలి శాంతిరస సంపద లూరగ దివ్యగాథలే పలుకును గాని, యొండు కథఁ బల్కఁగఁబోఁడు ప్రపత్తినిష్ఠుఁడై.

చేతనోద్ధరణంబుఁ జేయ నిం కొకసారి
యిట్టు లాళ్వారులే పుట్టె ననఁగ
నిత్యసూరియె భక్తినిష్ఠఁ బెంపొందింప
వైకుంఠమును డిగి వచ్చె ననఁగ
పరమ వైరాగ్య సంపన్నుఁడౌ శుకయోగి
యే యిట్లు మరల జన్మించె ననఁగ
భక్తవరేణ్యుఁడౌ ప్రహ్లాదుఁ డీ రీతిఁ
బుధుల భక్తిని నింపఁ బుట్టె ననఁగ

సమిత వైరాగ్య భక్తి నిష్ఠాత్ముఁ డగుచుఁ
గలుషము లడంచి నిష్కామ కర్ముఁ డగుచు
శుద్ధసత్త్వ స్వరూపంబుఁ జూరగొనిన
వాఁడు నా నొప్పు నచ్చటి భాగవతుల.

పరమ విరక్తుఁడై పరఁగు భక్తుఁడు గావున సర్వసిద్ధులున్
వరవుడ ముండె నాతని కవశ్యము, మెల్లగ లోకు లంద ఱా
గురుతున వాని శక్తి గనుగొన్న కతంబున స్పర్శవేధి యన్
బిరుదున బిల్చి గద్ది పురవీథులఁ బ్రాకి, నగళ్ళ కెక్కెఁ బో.

ఎంతవానికి లోపంబు లెన్నునట్టి
మంద బుద్ధులె యాతని మహిమ నిట్లు
దెలిసికొని యాడ, నట్టుల దెలియకుండు,
సర్వ మెఱిఁగిన యాచార్యసత్తముండు?

అతనికిఁ గల్గు శీలమును, నాతని శక్తి, విరక్తి, భక్తి, సం
తత పరితృప్తి, సత్యరతి, దాంతి, ప్రశాంతి, నితాంత దీక్ష, ప్రా
జ్ఞతయును మున్నె తా నెఱుఁగుఁ గావున లోకములోన వాని య
ర్జ్ఞత గుఱుతించలాగున నిరంతర మాతని ప్రజ్ఞ నెన్నుచున్.

ఘనతమ కులమద, విద్యా
ధనమదముల వీడలేని దర్పోద్ధతుఁడా
తన శిష్యుఁడు మొదలాండా
నను వానికి బుద్ధి నేర్ప యతివరుఁ డంతన్.

స్నానమునకయి సహ్యజానదికి నేగు
నప్పు డాండాను చేయూత నంది వెడలి
స్నాతుఁడై వచ్చు సమయాన స్పర్శవేధి
బిరుద మందిన దాసుని కరముఁ బట్టు.

కరముఁ బట్టుటయే కాదు గౌరవంబు ;
ధౌత వస్త్రంబు లా ధనుర్దాసవరుఁడ
మడఁచి యొసఁగంగ నా యతి మడికిఁ గట్టు
తత్త్వ మెఱిఁగిన వాని వాత్సల్య మిట్లు.

హీన కులంబునందు జనియించినవానికి నిచ్చకంబునన్
లేని విశేష మీ గురుఁడు నేఁటికి నిట్టుల గట్టిపెట్టె ; సం
ఘాన మఱొక్కఁ డిట్టి ఘనకార్యధురీణుఁడు లేకపోయెనే ?
కానఁగలేక యీయతి,యకార్య మొనర్చె నటంచు బ్రాహ్మణుల్.

పదపడి విప్రవర్యులగు వైష్ణవు లందఱుఁ జేరి, యిట్టి యా
పద సహించు టెట్లు ? మన బ్రాహ్మణ జాతికిఁ గల్గు శ్రౌత సం
పద కిది యా ఫలంబు ? స్మృతి పాఠము నేర్పు యతీంద్రుఁ డిట్లు చే
యఁ దగునె ? ధర్మశాస్త్ర ముపహాస్యముపాలగు నంచుఁ బల్కుచున్.

గురునకైనను దోసముల్ పొరయునేని
యట్టి దోసంబు లన్నియు నతని యెదుటఁ
దెలిపి సవరించుకొనునట్లు సలుపు టద్ది
తప్పు కాదని ధర్మశాస్త్రము వచించు.

కాన నియ్యది తగదని గౌరవమునఁ
దెలియఁ జెప్పినఁ దప్పక దిద్దికొనును
కాకపోయిన బ్రాహ్మణ గౌరవంబు
మఱి సనాతన ధర్మముల్ మంటఁ గలియు.

అనుచును బ్రాహ్మణు లందఱు
మనమునఁ జెల రేఁగినట్టి మాత్సర్యమునన్
బనిగొని యాచార్యులకడ
వినిపింపఁగ నంద ఱటకు వెడలుద మనుచున్,

భాష్యముల్ తలక్రిందు వల్లెవేసిన వారు
నిగమార్థ పాఠముల్ నేర్పువారు
ఉభయ మీమాంసలు సభలఁ బల్కెడువారు
ప్రతివాది భీకర ప్రజ్ఞ వారు
మంత్ర తంత్రార్థ మర్మం బెఱింగినవారు
వేదాంత కేసరి బిరుదువారు
అఖిలాగమంబుల నందె వేసినవారు
న్యాయశాస్త్రార్థ నిర్ణాయకులును

మఱియుఁ బెద్దలు, పిన్న లందఱును గలసి
చనిరి వరుసగ విప్రు లాశ్రమమునకును
బ్రాహ్మణాచార మిట్టుల పాటసేయఁ
దగ దటంచును గురునితోఁ దగవు సేయ.

అరిగి నమస్కరించి, హృదయాంతర భావము వెల్లడించినన్
వెఱపు ఘటిల్లి మాటలను నేర్వనివారి విధాన నిల్వ, నా
వరున గ్రహించి మౌనియును వచ్చిన కార్యము దెల్పుమం చనెన్
జిరు నగ వంకురించి ముఖసీమను వెన్నెలకాంతిఁ జిమ్మగన్.

ఆ విధిఁ బృచ్ఛ సేయునపు డొందల వాల్చి యతీంద్రు మ్రోల, స
ద్భావముఁ జూపి, యేమియును బల్కఁగలేక యొక ళ్ళొకళ్ళకున్
నీవె యుపక్రమింపు మను నేత్రపు సంజ్ఞలు, హస్తసంజ్ఞ లే
వేవియొ చేయసాఁగిరి మునీశ్వరు లట్టుల క్రిందుఁ జూచుచున్

ఎట్టకేలకు వారిలో నించుకంత
గట్టివాఁ డొక్కరుండు వాక్యముఁ బెకల్చి
గొంతు సకిలించి కుదుటయి కూరుచుండి
వినయ మెంతయుఁ దోఁప ని ట్లని వచించె.

మీర లెఱుఁగని ధర్మ మేదియును లేదు
అయిన నొక్కింత సందేహ మావహింప
ధర్మసందేహమున నుంట దగ దటంచు
నెఱుఁగ వచ్చితి మిప్పు డోయీ! మహాత్మ!

తాతలనాఁటనుండి సతతంబును శాస్త్రము లొక్కతెన్న, సం
ప్రీతి వచింప, నేఁడు విపరీత పథంబునఁ జిక్కి, స్వామియున్
నీతి దొరంగె నన్న యొక నిందకు లోఁగుచు ధర్మతంత్ర మి
ట్లా తల దీ తలన్ జరప నక్కట! శాస్త్ర మి కేల దేశికా?

పురుషవరేణ్య! శూద్రకుల పూరుషు చేతి మడుంగు వస్త్రముల్
నిరతము దాల్చుచుందు రది నీతియె? శాస్త్రము లిట్టి చేఁతకున్
నరకము గల్గు నన్న వచనంబులఁ బల్కును; గాన మీర లీ
దురిత మొనర్చి, లోకజన దూషణ పాలగు టేల దెల్పరే!

అన విని యోగినేత దరహాసమునన్ వచియించె నిట్లు; మీ
కనిన శ్రుతీతిహాసములఁ గానగలే దొకొ యిట్టి గాథ లే
నని పలుకంగలాఁడ? హృదయంబున కెక్కని వేదశాస్త్ర పా
ఠనమున నేమి లాభ మది దాంభిక భావము వృద్ధి జేసెడున్.

ఆరయలేక శాస్త్రవిషయంబుల మీరలు, లేనిదాని కీ
తీరున వ్యాఖ్య చేయుచు, సుధీవరు లట్టులఁ బల్కఁజొచ్చి రా
ళ్వారులలోనఁ బంచము కులంబునఁ బుట్టినవారు లేరొ? య
వ్వారికి మ్రొక్కనట్టి యొక వైష్ణవుఁ డుండఁ డటం చెఱుంగరో?

ఆయెఁ బోయెను దాని కేమాయె ననుచుఁ
బూర్వగాథల విస్మృతిఁ బొంది మీరు
హరిపదధ్యాన పారీణుఁడైనవానిఁ
జూచి సహియింపకుండుట చోద్య మకట!

'ఆత్మవ త్సర్వ భూతాని' యనెడి వాక్య
మట్టు లుంచుఁడు సకల యోగ్యతలు గలిగి
యఖిల భాగవతోత్తముఁ డయినవాని
నైన సమతను జూచుట యబ్బురంబె?

శాస్త్ర మొక దిక్కుఁ బ్రజల యాచార మొక్క
దిక్కు నడువగ, నద్దియే స్థిర మటన్న
భ్రాంతిలో బడి జ్ఞాననేత్రమును విప్పి
కానలేరైరి న్యాయమార్గమును మీరు.

ధర్మ మెంతయు సూక్ష్మమై తనరుగాన
తత్త్వ దర్థంబు లెస్సగాఁ దడవి చూచి
దేశ కాలానుగుణ్యంబు తెలిసికొనుచు
సంప్రయోగంబుఁ జేయఁగా జనును మనకు.

కావున నేను ధర్మమును గాదనఁజాలను - దాని సారమే కావలె గాని, సూత్రము లెగాదిగ పల్కిన నేమి లాభ మా ప్రోవ మెఱింగి పోవునది దొడ్డతనం బని యట్లు తల్చితిన్ పావనమైన ధర్మవును బా డొనరింపను విశ్వసింపుఁడీ!

మన శ్రీవైష్ణవ సంప్రదాయమునకున్ మార్గమియున్ దీనిచే తను రాలే దది యుండనిం; డిక ధనుర్దాసుండు సామాన్యుఁ డంచును యోజింపగరాదు - భాగవత సుశ్లోకుండు - తత్స్వర్శమాత్రన పావిత్ర్యము గల్గు జీవులకుఁ; బంతం బేల మీ కియ్యెడన్?

వెఱపును జెంద నేల? నడపించెదఁ జూడుఁడు - పూర్వ ధర్మ మే తెఱఁగు వచించెనో యెఱఁగి తిన్నఁగ మెత్తని పూలబాటలం బరువడి సర్వధర్మములు; ప్రాజ్ఞత గల్గిన లోక మింక నీ నరులకు వైష్ణవంబె శరణం బనునట్లు విశాల దృక్కులన్.

నయము వచింప నిట్టుల, మనంబుల నమ్మిరి పెక్కు మంది - య
క్షయ మగు మత్సరంబునను గాదనఁజాలక కొంద ఱందు, సుం
తయు బలుకాడకుండఁ బెడదారినిఁ బోయిరి యీసురోన మెం
తయుఁ దమమోములందునను దాండవమాడఁగ నొక్క కొక్కరే.

అది గని యోగిరాణ్మణియు నాదటఁ దక్కినవారిఁ గాంచి, మీ
కిది హితమానొ కాదొ? వచియింపుఁ డటంచునుబల్క నందఱున్
సదమల భక్తితోడుత సనాతన ధర్మము దిక్కు దిక్కులన్
బొదలెడు గాత్ర మీవలనఁ బూర్వపు రీతిగ నంచుఁ బల్కుచున్.

పోయెడివేళ వారు మునిపూజ్యపదంబుల మ్రొక్కి, న్యాయ ని
ర్ణాయక మూర్తివం చెఱుఁగు ప్రాజ్ఞత మా కడ లేమిచేత, ని
ట్లాయెను; బుద్ధి వచ్చెను; దయాపర! మాయెడఁ గల్గు తప్పులున్
మా యవివేక భావములు మాన్పఁగదే యని యేగి రందఱున్.

ముందఱ లేచిపోయిన విమూఢులు కొందఱుమాత్ర మజ్ఞతన్
సందుల గొందులన్ గొణఁగసాఁగిరి మత్సరబుద్ధిచేత, నా
పందల కెడ్డ బుద్ధి గఱపన్ మదిలోఁ దలపోసి, దాని కే
చందము భావ్యమా యనుచుఁ జాలగఁ యోజనఁ జేసి యాతఁడున్.

ఘనకార్యంబుల నిర్వహింపఁగల దీక్షాదక్షుఁడై శిష్యు నొ
క్కని రావించి, మఠంబునన్ గలుగు మూర్ఖశ్రేణి వస్త్రంబులం
దునఁ గొన్నింటిని దాఁప, గొన్ని కొనలున్ ద్రుంపంగ నేమించియున్
గననట్లున్, విననట్లు మౌనగతి ధ్యానానందుఁడై యుండగన్.

స్నాతులై వచ్చి శిష్యులు శాలలందు
దాఁచుకొన్నట్టి ధౌత వస్త్రములయందుఁ
గొన్ని కనుపింపకుండుటఁ గొన్ని చినిఁగి
యుండుటను గాంచి దానికి నోర్వలేక.

పారులు క్రుద్ధులై యొకరిపై నొకరుం డొక నింద మోపి, యీ
నేరము నీ వొనర్చితివి, నీవె యొనర్చితివంచు బిట్టుగాఁ
బోరొనరింప జొచ్చిరి చమూపతు లట్టుల ; నంత మానియున్
నేరని రీతి వారికడ నిల్చి యి దేమని మందలింపఁగన్ .

జరిగిన కార్యం బంతయు
గురునకు వినిపించి వారు కుయ్యో యనఁగా
జరిగిన దెట్లో జరిగెను
సరియగునే యిట్టి పోరు చాలింపుఁ డనెన్.

చెప్పిన గురువరు మాటల
కప్పుడు మాటాడఁజాల కందఱు పోరున్
దెప్పున నాపిరి చయమున
నప్పటి కది సమసిపోయె నాశ్రమ మందున్.

కడచిపోయెను మఱి కొంత కాల మిటుల
నంత యతివరుఁ డొక్క సాయంతనమునఁ
ద ద్విమూర్ధులఁ బిలిచి మంతనము సలిపి
పలికె నిట్టుల గంభీర భాషణముల.

నిండుకొనె వస్తు సంపద
భండారము శూన్య మాయె బదపడి యెటులో
తిండికి తిప్పలు వచ్చును
నొండాడక సేయవలయు నొక పని మీరల్.

తలప శిష్యుల నొక ధనుర్దాసు గాక
వేఱె ధనవంతు లెవ్వరు లేరటంచు
నంద ఱెఱిఁగిన విషయమే యగును గాని
యడుగ, నిచ్చునో ? యీయడో యనుచుఁ దోఁచు.

కావున నిప్పు డాశ్రమపు గార్యము దీర్చుటె ముఖ్యమంచు సం
భావనఁ జేసి, మీ రతని భార్య శయించుటఁ జూచి, యూపి స
ర్వావయవంబులందునను భాసిలుచున్న సమస్త భూషలన్
శేవ వహించి మెల్లన నిశీథములోపలఁ దెండు నాపుడున్.

సరగున నొక్క రొక్కరు దిసంతులు గొట్టుచు, వారి యీర్ష్యయీ
తెఱగునఁ దీర్చికో దలచి ధీరత సంతయుఁ గోలుపోయి, సం
ఖరమున మేము మే మనుచు వచ్చి యతీంద్రునిఁ జేరినారు, క్ర
మ్మఱ నెటు వచ్చునో యనెడి మర్మ మెఱుంగని వెఱ్ఱి బాపలై.

చిమ్మచీకటి చేతుఁ జీల్చికొనుచుఁ
జీమ చిటు కన భయమునఁ జిక్కువడుచు
సందు గొందుల దారిని సద్దు మాలి
చివర కెట్టులో గమ్యంబు జేరి వారు.

శ్రీవైష్ణవ వేషంబుల
నే విధమున నెన్నఁడేని యే స్థితి యందున్
గావలె నని తొలఁగించుట
దైవద్రోహం బటంచుఁ దలచినవారై.

ఛాందస విప్రులు గావున
ముందర నున్నట్టి వేషముల పీడక యే
దండడి కార్యాకాంక్షను
మందిరమును జొచ్చినారు మత్సర మతులై.

ఆ గృహమేధి భాగవతుఁడై శరణాగతి నొంది నిత్యమున్
రాఁగల కీడు మే ళ్ళవియొ రాకయొ మాన వటం చెఱింగి, యొం
టేగినఁగాని ద్వారముల నెన్నడు మూయఁడుగాన వారలున్
గాఁగల కార్య మాయె నని క్రన్నన లోనికి నేగి చూడఁగన్,

తంగెడు గున్న పూచిన విధంబున నా గృహాలక్ష్మి మేన స
ర్వాంగములందు రత్న రుచిరంబుల భూషలఁ దాల్చి నిద్రలో
గ్రుంగుపడంగఁ జూచి, తమ పున్నము పండె నటంచు నొక్క ప్ర
క్కం గల భూషణంబులను గ్రక్కున దీసిరి యొక్క టొక్క టే.

అంతట నాపె మేల్కొనుచు నాశ్రమవాసులుగా నెఱింగి, యే
చింతల దక్క యీ గతికిఁ జిక్కిరొ వీ రయి కాకయున్నచో
నింతటి వార లీ పనికి నెన్నఁడు బూనరు నేన యిత్తు మే
నంతటఁ గల్గు భూషల నటంచును రెండవ వైపు బొర్లఁగన్.

చిక్కిన దేమొ చిక్కినది శీఘ్రముగా మన మేగకున్నచోఁ
జిక్కు ఘటిల్ల వచ్చునని చిత్తమునన్ దలపోసి, తత్తరం
బెక్కుడుగాఁగ నెట్లు చరియింపుటకున్ మదిదోఁప కందఱున్
గ్రక్కున బర్వు లెత్తిరి వికావికలై మఠభూమి జేరగన్.

అనువగు వ్యాజ మియ్యది యటంచును నా నిసి విల్లిదాసునిన్
బనిగొని నిల్పి వైష్ణవ ప్రబంధములన్ మనమారఁ బల్కుచుం
డెను; అట ముచ్చలించు పని నెగ్గిన దంచు దలంచినంత దా
సునిగని, ప్రొద్దు పోయె ననుచున్ నిజ గేహము జేరఁ బంపఁగన్.

హెచ్చగు భూషణంబుల యతీశున కిచ్చుచు శిష్యు లెల్లరున్
దెచ్చితిమయ్య యెట్టెట్టులో దిక్కులు త్రోవలు గానరాని యీ
యచ్చపుఁ జీఁకటిం గలఁగి యక్కట ! యంచు వచింప నౌను, మీ
రచ్చపుఁ జీఁకటిం బడితి రంచనె వ్యంగ్యముగా వచించుచున్.

వారవి యే మెఱుంగుదురు పాపము ? వారలు వ్యంగ్య భావమే
నేరిచియున్న యోగిజన నేతకు వంకలు దిద్దవత్తురా ?
భూరి మహానుభావుఁడగు పూరుషు నింటను ముచ్చిలింతురా ?
పారము లేని యీర్ష్యఁ గని పాడయి రిట్టుల విప్రవైష్ణవుల్.

ఇఁక నట, భాగవతోత్తముఁ
డొకఁ డయి నిజగేహమునకు నొయ్యనఁ జని తాఁ
దికమకఁ బడుచును వాకిట
నొక ప్రక్కను నిలచియున్న యువిదను గనుచున్.

ఈ మొగసాల నేమిటికి నిప్పుడు నిల్చితి వీవు చెప్పు మం
చా మగువన్ గురించి పలు కాడుచు లెస్సగఁ దేఱి చూచి, లే
వే మయిపోయె భూషణము లిట్లొక ప్రక్కన యుంచఁ గారణం
బేమని పృచ్ఛ జేయు హృదయేశున కా సతి యిట్లు పల్కెడున్.

స్వామీ! యే మని విన్నవించెదను? సంసారాతిభారంబొ, వే
ఱే మైయుండునొ? వైష్ణవోత్తములు రేయిన్ వచ్చి విత్తాశచే
నా మేనం గల భూషణంబుల ననూన వ్యగ్రతన్ దీయఁగా
నే మేల్కాంటిని వైష్ణవోత్తములఁ గంటిన్ ధన్యతాబుద్ధినై.

వారల కిపు డే గతి చే
కూరెను, లేకున్న నిటుల గొంకక నేఁ డే
వారలు ముచ్చిల వత్తురె?
భారంబగు కార్య మెదియొ పైఁబడె ననుచున్.

ఈవలి ప్రక్క లీ తొడవు లీ యయవారల కెంతపాటి యీ
క్రేవ ఘటిల్లు భూష లవ లీలగ నిట్లు గ్రహింపగూడు నం
చావలి కొత్తగిల్లితి భయంబున నోడని చాడిగా ద్విజుల్
ద్రోవగ దాని ఘోరమగు దోసము వాటిలె దాసురాలికిన్.

భాగవతాపచారము ప్రవర్తిలె నిప్పుడు, దీని కెట్టి దు
ర్యోగము పట్టునో యనుచు నమ్మలికిన్ గొనుచుంటి; నింతకున్
గాగల కార్య మాయె; నిఁకఁ గాచుటకున్ యతిరాజు దక్క, వే
ఱే గతి లేదు నా కనుచు నేడ్వగ బాల్పడ యాతఁ డిట్లనున్.

వారి కట్టుబ్రక్క భూమలు వలయునేని
వారలే నిన్నుఁ బొర్లించి వైచి వానిఁ
దీసికొనియుందు రంతలో దిటవు మాని
కానిపనిఁ జేసితి వహంకారవృత్తి.

ఇచ్చెద నటన్న బుద్ధి నీ కేల గలిగె ?
భాగవతులకు నెద్ది కావలసియుండు
నద్ది వారలె గ్రహియించి యరిగియుందు
రంతమాత్రము తోఁచింప వైతి వబల !

ఎన్ని దినములు గురుసూక్తి విన్నగాని
కడ కహంకార బుద్ధియే కానవచ్చె ;
ఇచ్చుదానవు నీవును ? బుచ్చుకొనెడి
వారు భక్తుల ? యెంతటి భ్రమ పడితివె ?

ఎంద తెందఱి సేవింప నేమి ఫలము
చిత్తసంస్కార మిసుమంత చెందకున్న
నంతతోద్గ్రంథ చర్వితచర్వణములు
శ్రవణ మననాదులును వృథా శ్రమలు గావె ?

రా రమ్మిక గురువరుకడ
నేరంబును దెల్పి తగిన నిష్కృతిఁ జేయం
గోరెదము గాక మన కిఁక
వే తోఁక టెది లేదు రక్ష విశ్వములోనన్.

అని తన భార్యతోడ గురు నాశ్రమ సీమకు నర్ధరాత్రమం
చును, సమయంబు కాదనుచుఁ జూడక, బుద్ధినిఁ బూచినట్టి పా
వన గురుపాదపద్మముల భక్తి దలంచుచు నేగి, తత్తపో
ధన నిధి జేరి, త్సుత్తుఁ గని తల్లినిఁ జేరెడు లేఁగ కైవడిన్.

చేరి మఠంబునందు నిజ శిష్యులతో వసియుంచియున్న త
ద్వారిజనేత్రుఁడా యతికి వందనముల్ పచరించుచున్ మనో
భారముచేత నిట్లనెఁ బ్రపత్తి గడల్కొన దప్పవచ్చె, మా
నేరము గాంచి చేయఁదగు నిష్కృతి జేయవె శిష్యవత్సలా!

అని పలికిన వెనువెంటన
తన శిష్యునిఁ గాంచి యతియు దయతో ననియెన్
నినువంటివాఁడు నిష్కృతిఁ
గను కార్యము సేయు టనఁగఁ గల్ల యటంచున్.

అన విని దాసుఁడున్ ముదము నందక హా యని బిట్టు దుఃఖమున్
గని, భువి బొర్లుచున్ దుదకు గద్గద మొప్పగ నిట్లు బల్కె, నో
మునివర! నేఁటి కీ యతివ పున్నము బుచ్చె ననంగ నెద్దియో
పనిగొని వైష్ణవోత్తములు వచ్చిరి భూషణముల్ గ్రహింపఁగన్.

ద్రుచ్చిరి వార లీ ముగుద రూఢిగ నిద్రితయం చెఱింగి యిల్
సొచ్చియు నొక్క ప్రక్కఁ గల సుందరభూషణపంక్తి; నంతలో
విచ్చెను నిద్ర; యింక గను విచ్చి కనుంగొన వైష్ణవోత్తముల్
వచ్చిన జాడ దోఁచి తన స్వల్పపు బుద్ధిని యోచ సల్పుచున్.

వచ్చినవారు వైష్ణవులు - వారికిఁ గానివి యేల నాకు? నే
నిచ్చెద భూషణావళుల నీవలి ప్రక్కవిభూడ నంచు, తా
నొచ్చపు బుద్ధి నావలికి నొత్తిల వారు భయంబుతోడుతన్
వచ్చిన దారిఁ బట్టిరి యవశ్యముగాఁ దలపోసి యందఱున్.

ధర్మాధర్మ విశేషముల్ మఱియుఁ దత్త్వార్థంబు లెన్నెన్ని యో
మర్మంబుల్ తమవల్ల నే వినియు సమ్మాన ప్రియాశూన్యయై
నిర్మాలం బొనరించె ధర్మువును; పున్నెం బెట్లు చేకూరు; నా
కర్మం బిట్టుల కాంచెఁ దుట్టతుదకున్ గాఁదగ్గ దే మున్నదో?

అన్నియు దా నెఱింగియు నహంకృతి వీడక, వారి కిత్తునం
చన్న యహంకృతిన్ దవిలి యావలి ప్రక్కకుఁ బొర్లె నిద్ది యా
మన్నన గొప్పగాఁ దలచి మానసమందున ; దానివల్ల కా
నున్నది కాకపోయెను, భయోన్నతి మాత్రము గల్గె వారికిన్.

దేవరవారు భాగవతదీక్ష నొసంగిరి మాకు, దానిచేఁ
బావనమైతి మేము నిరుపద్రవతన్ గని యంచు నుండ, మ
మ్మా విధి యిట్లొనర్చె భయ మయ్యెడు, వేఱొక రక్షలే దహో
దేవ! మహానుభావ! భవదీయుల నేటి కనుగ్రహింపవే.

అన్నా! చేసిన తప్పుఁ జెప్పితిమి ప్రాయశ్చిత్తమున్ దెల్ప నీ
కన్నన్ వేఱొక పండితుం డెవఁడు? శీఘ్రం బింక శిక్షింపు; మా
కన్నీ రోడిచి నీదు పాదముల కర్ఘ్యం బిచ్చుటే కాక, వే
ఱున్నే నేఁ డొక సాధనంబు ; కన మోహో! శిష్యసంరక్షకా!

అనియెడు దాసున కెంతయు
ననునయ వాక్యములఁ బలికి యతివరుఁ డంతన్
వినుఁడని బ్రాహ్మణ శిష్యులఁ
గని యిట్టుల పలుకఁదొడఁగె గడు మృదులముగన్.

కంటిరె యీతని మీరలు ?
వింటిరె యితఁ డనిన నుడులు ? విప్రుల రగు మీ
రుంటిరె యింతటి నిష్ఠను ?
నింటింటను జాటవలదె యీతని మహిమన్.

మేదిని నిట్టి మేటి గృహమేధిని గానగలేరు మీరు ; దు
ర్వాదము మాని వీని నిఁక భాగవతోత్తముగాఁ దలంచి, కే
లూది చరించు టొప్పను - గుణోన్నతి కల్గినవాని కెప్డు మ
ర్యాద లభించు - నైజ మది - రాఁదగువారికి వచ్చితీరెడున్.

ఊరక మత్సరంబు గని యున్నవి లేనివి ప్రోగుచేసి, యీ
తీరున వైర మూనితిరి - దీనికి నిష్కృతి లేదు మీకు - పెం
పారెడి మిత్రభావ ముదయంబయి నర్థిల వంశగర్వమున్
దీఱిచి సత్యమైన సుగతిన్ గనుగొంటయె మీకు నిష్కృతుల్.

ఇంతటి తత్త్వవేది యని యెన్నడొ చెప్పితి మీకు దానికిన్
వింతగ నెంచినార లవివేకముచేతను - దాని సత్య మా
ద్యంతము కార్యరూపమును దాల్పగ నియ్యది నే నొనర్చితిన్
వింత య దేమి? యీతఁ డిక విప్రులకున్ గురుఁ డేలగా డొకో!

ఇట్టి సూక్ష్మాతిసూక్ష్మముల్ పట్టుకొనక
స్థూల రూపంబు బట్టి యుయ్యాల లూగ
పాప మొనయించు భాగవతాపచార
దహనకీలల సమయుట తప్ప దెపుడొ!

మాసిన ధర్మరూపము సమంచితమా గతిఁ జేయనేని సం
న్యాసముఁ బూన నేల? నిటు లాశ్రమ వాసము జేయ నేల? వి
ద్యా సముపార్జనంబునకుఁ దద్ద శ్రమంపడ నేల? యిట్టి యా
యాసము నొందుకంటెను గృహస్థుఁడ నౌటయె మేలు కా దొకో!

ఏది యొనర్పగావలెనొ యెయ్యది మానుట యొప్పొ-యెప్పు డే
దేది యవశ్యమో - యెవరి కెయ్యది పథ్యమొ తా నెఱింగి, యే
వాదన సల్పియైన నతి భక్తిని ధర్మము లాచరించు మ
ర్యాద యొసంగుకే యతికి న్యాయము - కావున నట్లొనర్చితిన్.

దండ కమండలువులచే
దండిగ గాషాయవస్త్ర ధారణ చేతన్
మెండుగ శిష్యులఁ గూర్చుచు
ముండన మొనరించినంత మోక్షము కలదే?

యతి ధర్మం బసిధారా
వ్రత మని యెఱుఁగంగ వలయుఁ బ్రాజ్ఞత లేకీ
యతి ధర్మ మూనఁగా దు
ర్గతిఁ గాంచుట కాక వేఱె ఘనతయుఁ గలదే?

యతి యగువాఁడు మానవుల కగ్రణి - యాతఁడు ధర్మ మూని దు
ర్మతులను శిక్షలో నునిచి మార్గముఁ జూపుచునుండు - వాఁడె పో
యతి యని యంద్రు - లోకుల భయంబున ధర్మము రిత్తబుచ్చు న
య్యతికి నిహంబునున్న-మఱి యప్లెపరంబును సున్న యయ్యెడున్.

మనమున ని ల్లెఱింగి పెడ మార్గముఁ బట్టిన మిమ్ముఁ ద్రిప్పఁగాఁ
జనునని సన్ని వేశ మిటు సల్పితి - దీని యథార్థ భావమున్
గని యిపుడైనఁ జక్కఁబడఁగా వలె, నీర్ష్య మనుష్య ధర్మ మా
రణ మొనరించు నెంతయు స్థిరం బది - కావున నద్ది మానుఁడీ!

తప్పులఁ జేయుట నైజము
తప్పగఁ మది దోపగానె తడయక దానిన్
దప్పక విడిచిన వాఁడే
ముప్పును గనకుండ భువినిఁ బూజ్యత నొందున్.

కావున నింక మీ మదిని గర్వము మానియు విల్లిదాసు స
ద్భావము నేర్చి, మైత్రి గని తద్దయుఁ బావన మార్గమందుఁ గొం
పోవుడి యార్య ధర్మముల పోడిమి; నట్టుల కాదయేని రాఁ
బోవు శుభంబు లింక గనబోవరు మీర లటంచు బల్కగన్.

జరిగిన చిత్రముఁ గాంచుచు
గురువరు వాక్యముల వినుచుఁ గొందలపడుచున్
బరమాశ్చర్యము నొందుచు
స్థిరముగ నిలుచుండి యున్న శిష్యులు వగతోన్.

జరిగిన తప్పు సైపుము విశాల దయానిధి యింత వానిఁగా
నెఱుఁగము విల్లిదాసుని - యతీంద్రులకున్ బరితృప్తి గూర్పఁగా
బరఁగు మహాత్మ్యమున్ గనిన భాగవతోత్తముఁడం చెఱుంగకీ
దురిత మొనర్చినార, మిఁక దుస్సహ పాపము లెట్లడంచెదో ?

అని యొక రొక్కరున్ బుడమి నొఁదల మోపుచు మ్రొక్కి వేడ, చే
సిన పని తప్పెఱింగి రని శిష్యుల నెల్లర జేరఁ బిల్చి, మీ
మనసుల నున్న మత్సరము మానితి రంతియ కాదు, దాసునిన్
గని క్షమియింపు మం చడుగఁగాఁ దగు మీ కని పల్కె నాతఁడున్.

అంతట బ్రాహ్మణ శిష్యులు
సుంతయు మది నీర్ష్య లేక సుస్థిరమతులై
చెంతను నిలిచిన దాసుని
చెంతకుఁ జని పలికి రిట్లు చిత్రము గాఁగన్.

ఓయి మహానుభావ ! దయ యుంచుము - మత్సర బుద్ధిచేత న
న్యాయము లాచరించితిమి - యట్టివి నీ మనమందు నుండఁ జో
టీయవటం చెఱింగియును నిద్ది విధాయక మౌట; సోదర
న్యాయముఁ జూప వేడితిమి, యట్టులఁ జూచి క్షమింపవే మమున్.

తరిగిన కార్యమంల్ నుదులు చక్కనఁ జూచుచు, వించు, నోరగా
జరిగి విధేయతన్ దెలుపు చాడ్పున శీర్షము వంచి, విప్రు లె
ల్లరు విన నిట్లు పల్కెను - తలంపఁగ నియ్యది విష్ణు మాయయో
గురువరుమాయయో యెఱుఁగఁగూడదు నాకో యనివిల్లిదాసుఁడున్.

కలయో నిక్కమొ యెఱుఁగను
గల యని భావింప నదియుఁ గాదని తోఁచున్
తుల లేని గౌరవంబును
దలపయి నిడి రేల నాకుఁ - దగునే యిదియున్.

అని యతిరాజుఁ జేరి వినయంబునఁ బల్కఁగ విల్లిదాసునిన్
గనుచు వచించె నా యతియు గన్నుల జిల్కు దయారసంబుతో ;
నిను గని నేర్చుకొందు రని నేనె వచించితి భూషణంబులన్
గొని యిట రం డటంచు, నివిగో యని యిచ్చె సమస్త భూషలన్.

అవి మరలన్ గ్రహియించిన
నవునది చౌర్యంబ యనుచు నతఁడు తలంపన్.
ధ్రువముగ నియ్యవి మీవియె
యివి యేలా నాకటంచు నిచ్చుచు దయతోన్.

యతి వరేణ్యుఁ డంత నఖిల శిష్యావళిఁ
జేరఁ బిలిచి యిట్లు చెప్పఁ దొడఁగెఁ
బోరు నష్టి యొసఁగు బొందు లాభము నిచ్చుఁ
గాన పొందు గనుట ఘనతరంబు.

మనములు నింక మీరు కొఱమాలిన చేతలు మాని, దివ్య సా
ధనఁ గని ప్రాకృతార్థ పరతంత్రులు గాక స్వతంత్ర బుద్ధితోఁ
జని యిక వైష్ణవంబును విశాల మతంబుగఁ జేయు భారమున్
ఘనముగ బూనుఁ డిప్పుడు సనాతన ధర్మము దప్పకుండగన్.

వసి వాళ్వారిన దైవభక్తి కృశతన్ బాపంగ నొక్కొక్క రీ
యసి ధారావ్రత మూని మానవుల కధ్యాత్మంబు బోధించి, దు
ర్వ్యసనాసక్తినిఁ బారఁ ద్రోలఁ గల విద్యాసక్తి గల్పించి ; స
ర్వ సమానం బగు వైష్ణవంబు పుడమిన్ వర్ధిల్లగాఁ జేయుఁడీ !

పండబారిన నాస్తిక వన తరువుల
నరికి పడవైచి యాస్తిక తరు వితాన
బీజముల నాటి మాధవ ప్రీతి కొఱకు
స్వాదు ఫలములఁ బండింపవలయు మీరు.

తుద మొద లేది లేని భవ తోయధి దాఁటఁగ దివ్య నౌకయై
పొదలెడుఁ గాక వైష్ణవము ! పొంపిరి వోయెడి దివ్య భక్తితోఁ
గదలుఁడు - కంకణంబులను గట్టుఁగు - వేద నిగూఢమైన సం
పదలను సర్వమానవ సమన్వయుతన్ గొని పంచి పెట్టఁగన్.

కల్లల్ పొల్లులు లేని సత్యమగు వాక్ప్రౌఢిఁ జూపించి, రం
జిల్లన్ జేయుచుఁ జేతనంబులు సముజ్జీవింప నవ్వారిగాఁ
జల్లుం డెంతయుఁ బూన్కి తోడుత విశిష్టాద్వైత బీజంబులన్
బల్లీ పట్టణ దివ్య దేశముల నర్వారణ్య భూ భృత్తులన్.

అని వచియించి వీడ్కొలిపి సందర నా యతి రాజు - వారల
య్యనఘుని యాజ్ఞ చొప్పున సముంచిత రీతిగ వైష్ణవంబుఁ జ
య్యన జన లోక మెల్ల బహుళాదర రీతి గ్రహించునట్లుగా
మునుకొని చేయసాఁగిరి సమూహములై మతమందు జేరగన్.

ఆరబండిన భక్తి నా ధనుర్దాసు
నిష్కామ యుక్తుఁడై నెగడి యాచార్య
కైంకర్య నిష్ఠుఁడై కాలంబు పుచ్చె
నా మహామూర్తి తా నంత్య కాలమునఁ
బరమపద ప్రాప్తి బడయు టబ్బించె
కావుననే వాని ఘనమూర్తి యిపుడు
విగ్రహ రూపమై వెలసి శ్రీరంగ
మునను నేటికిఁ గూడఁ బూజల గొనును
తన్మహాత్మ్య కనేక ధన్యవాదములు
నిర్మలాత్మకు నేడు నీరాజనములు.

# తిరునామములు - శ్రీవైష్ణవ తత్త్వము

'సంప్రదాయ సాహిత్య కళానిధి'

డాక్టర్ : కిడాంబి నరసింహాచార్యులు, ఎం. ఏ; పిహెచ్.డి.



## తిరునామ వైశిష్ట్యము

శ్రీ వైష్ణవము 'శ్రీసంప్రదాయ' మని వ్యవహరింపబడును. ఇది శ్రీసంప్రదాయ మనుటకు కారణము లివి :-

"శ్రీ విష్ణులోకే భగవాన్ హరిః నారాయణః స్వయమ్
ప్రోక్తవాన్ మంత్ర రత్నాదీన్ శ్రియై తాపాది పూర్వకమ్." 1

శ్రీవైష్ణవులకు ప్రధానమైనది రహస్య త్రయములో ఒకటి యగు ద్వయ మంత్రమును తొలుత నారాయణుడు శ్రీదేవికి ఉపదేశించెను. ఆమె ద్వారా ప్రవృత్తమైనందున, ఇది శ్రీసంప్రదాయ మైనది.

భగవ దనుగ్రహము చేతనునిపై ప్రసరించునట్లును, చేతనుడు భగవ దున్ముఖు డగునట్లును ఈ శ్రీదేవి - వీరిరువురి నడుమ పురుష కారము గావించుటచే. అట్టి దేవియొక్క ప్రాముఖ్యమును సంప్రదాయులు గ్రహించి, దీనిని శ్రీసంప్రదాయమని వ్యవహరించిరి.

శ్రీదేవీ నారాయణుల అనుబంధము - వాగర్థముల వలెను, రత్నప్రభల వలెను, పుష్పసౌరభముల వలెను విడదీయరానిది. కనుక విష్ణుసంబంధమున వైష్ణవ మైనట్లే, శ్రీప్రాధాన్యముచే శ్రీసంప్రదాయ మైనది.

---

1. వాసుదేవ సంహిత.

శ్రీరామానుజుల బ్రహ్మసూత్ర భాష్యము 'శ్రీ - భాష్య' మని వ్యవహరింపబడుటయు, తనకు నిరంతర భక్తిరూపాపన్న జ్ఞానము నిమ్మని శ్రీ - నివాసుని శ్రీరామానుజులు వేడుటయు శ్రీప్రాధాన్యమును వివరించును.

శ్రీ సంప్రదాయమునకు జెందినవని తెలుపుటకై, శ్రీ శబ్ద వికృతియైన 'తిరు' శబ్దము - తిరునామములలో మొదట ప్రయోగింపబడినది.

నామ శబ్దమునకు-'సకలేతర విలక్షణ' డని యర్థము.[2] 'సకలేతర విలక్షణ! అర్థి కల్పక! ఆపత్సఖ! అఖిల జగత్స్వామిన్' అని శ్రీ రామానుజులచే సంబోధింప బడినవాడు, నామవాచ్యుడు శ్రీమన్నారాయణుడే.

నామ శబ్దమునకు - 'ప్రాకాశ్యము[3]' (ఎరిగింపదగినది) అనియు అర్థమున్నది. ఎరిగింపదగిన, లేక - ఎరుగదగినవాడు -

"స దేవ సౌమ్యే ఇద మగ్ర ఆసీత్. ఏకమే వా ద్వితీయమ్."

అని ఉపనిషత్తులచే ప్రతిపాదింపబడువాడు నారాయణుడే. కావున, తిరునామములలోని 'నామ' శబ్దము - భగవ ద్వాచక మనియే తెలియ నగును.

ఈ తిరునామములు కీర్తన లగుటచే, తిరునామ సంకీర్తన లనబడెడివి. కాని, కాలక్రమమున సంకీర్తన శబ్దము లేకున్నను - 'తిరునామము' లన్నంతనే, 'తిరునామ సంకీర్తన' లను అర్థము నిచ్చుటచే, సంకీర్తన శబ్దము లుప్తమై, తిరునామము లని వ్యవహరింప

---

2. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము : 7 - వ సంపుటము. 487 పుట
3. అమర కోశము - గురుబాల ప్రబోధిక.

బడినవి, సారాంశ మేమన, తిరునామము లనువవి - శ్రీసాంప్రదాయక మైన 'భగవన్నామ సంకీర్తనలు' అని చెప్పబడినది.

## తిరునామములలో వైష్ణవము

విష్ణు సంబంధము గలది వైష్ణవము. శ్రీ విశిష్టుడైన విష్ణువు నారాధించువారు శ్రీవైష్ణవులు. దశవిధ వైష్ణవులలో - శ్రీవైష్ణవ లక్షణము లిట్లు గలవు :-

"తిరుమంత్ర, ద్వయ, చరమములందు నియతు డగుట, ఆచార్యులయందును శ్రియః పతియందును కృతజ్ఞుడై యుండుట, పరమ సాత్త్వికులతో (భాగవతోత్తములతో) సహవాస మొనర్చుట, అర్థపంచక జ్ఞానము కల్గియుండుట శ్రీ వైష్ణవాధికారి కవశ్యాపేక్షితములు. శ్రీ శబ్దముచే పిరాట్టియొక్క వురుషకారము లభించి, ఆమె దయకు పాత్రుడు కావలె ననియు తెలిపిరి. మనల కావ నవతరించిన యతిరాజు నాశ్రయించి, వాసి యెరిగినవాడు శ్రీ వైష్ణవుడు. భగవద్భాగవతాచార్య కైంకర్య రతుడు, నైచ్యానుసంధాన యుతుడు, శ్రీవిశిష్టు డగు విష్ణువునందు భక్తి కలవాడు శ్రీవైష్ణవుడు." 4

ఆంధ్రమహాభారతమున -

"పాంచరాత్రమునకు ప్రవర్తకుడు శ్రీమహావిష్ణువు కనుక, పాంచరాత్రంబు వైష్ణవంబన బరగు." 5

అనియు -

"ఏక ద్వి త్రిభతు ర్వ్యూహాకారత దోచు హరి." 6

అనియు నుడువబడినది. ఈ వ్యూహాకారమే కాక, భగవత్స్వరూపము - 'పర, విభవ, అంతర్యామి, అర్చా' అని నాలుగు విధముల

4. శ్రీ రామానుజ కీర్తి కౌముది : 3 భా. 61 - 63 పుటలు.
5. ఆంధ్ర మహా భారతము : శాంతి పర్వము : 6 ఆశ్వాసము 517 వచనము.
6 ఆంధ్ర మహా భారతము : శాంతి : 6 ఆశ్వా 500 పద్య.

కలదు. ఇందలి అర్చా రూపము భక్తికి, శరణాగతికి అనుకూలమైనది. భక్తి మార్గమునకు విశేష ప్రాధాన్యము నిచ్చినందున, శ్రీవైష్ణవము విశిష్టాద్వైత సంప్రదాయమైనది.

శ్రీ రామానుజులు పున రుద్ధరించినందున - శ్రీవైష్ణవము శ్రీ రామానుజ దర్శన మని వ్యవహరింపబడినది.

వేదములు ఉపనిషత్తులతో ఏర్పడిన వేదాంత మార్గ మొకటి కలదు. ఆగమములతో, ఆళ్వారుల నాలాయిర ద్రావిడ దివ్య ప్రబంధములతో ఏర్పడిన వేదాంత మార్గ మొకటి కలదు. ఈ రెంటిని జోడించుకొని, పురోగమించు శ్రీవైష్ణవము - 'ఉభయ వేదాంత దర్శన' మనబడుచున్నది.

ఈ విధముగా - శ్రీవైష్ణమునకు గల వివిధ నామములను బట్టి, శ్రీవైష్ణవులకు శ్రీదేవి, శ్రీరామానుజులు, భాగవతులు మొదలగు వారియెడ ఉండవలసిన ప్రతిపత్తిని తెల్పినట్లైనది. అట్లే, శ్రీవైష్ణవ లక్షణముల ననుసరించి - తిరుమంత్ర, ద్వయ, చరమములు, అర్థ పంచకము ఉభయ వేదాంతములు, ప్రపత్తి నిష్ఠ మొదలగు వానిని తెలిసికొని, ఆచరింపదగినవి. శ్రీవైష్ణవులకు చెందిన, పై జెప్పబడిన వివిధాంశములను ఈ గీతములు అనువదించుచున్నందున, ఇవి 'తిరు నామము' లను విశిష్ట నామముతో విలసిల్లుచున్నవి.

## తిరునామ వాఙ్మయ ప్రాశస్త్యము

తెలుగు సాహిత్యమున మనకు లభించిన తొలి భక్తిగీతములు - కృష్ణమాచార్యులు రచించిన 'సింహగిరి వచనములు.' అనంతరము తాళ్ళపాక అన్నమాచార్యులు, పెదతిరుమలాచార్యులు, క్షేత్రయ్య,

త్యాగరాజు వంటి వారు ఈ సాహిత్యమును సమృద్ధము గావించిరి. తిరునామములకు సంబంధించినంత వరకు ఇవి క్రీ: శ: 6 - వ శతాబ్దమునుండి కలవని గ్రంథస్థ ప్రమాణము కలదు.

కూచిమంచి తిమ్మకవి-తన పార్వతీశ్వర శతకమున, సామాన్యులగు రైతులకు లోకువైన పండితుల పాట్లను, వారీసడించుకొన్న విధానమును వర్ణించియుండెను.

"పోపో బాపడ । దోసె లూద లిడినన్ పోలేక పేరాసలన్
వా పో జాగితి వేమి నీ సదుపు తిర్నామంబులో, సుద్దులో
భూపాళంబులొ, లంక నత్తెలొ బళా బొల్లా(వు పోట్లాటలో
కాపాటింపనలం(డు బాలిశులు భర్గా । పార్వతీ వల్లభా ।" 7

అని, పార్వతీ వల్లభునితో మొర పెట్టుకొనిన విధము - అతి స్వాభావికమైన పామర వ్యావహారికము. తిమ్మకవి కాలము క్రీ: శ: 1690 నుండి, 1760 వరకు అని చారిత్రకులు నిర్ణయించిరి.

పై పద్యములో - 'తిర్నామంబులో' అను మాట స్పష్టముగా గన్పట్టుటచే. తిమ్మకవి కాలమున కింకను పూర్వమే అనగా - 16 వ శతాబ్దము నాటికే ఈ తిరునామములు ప్రసిద్ధిలో నున్నట్లు స్పష్టమగుచున్నది.

## తిరునామ పరిహారము

శ్రీమద్రామానుజులు శ్రీవైష్ణవమత సుస్థిరతకై. డెబ్బదినాల్గు సింహాసనముల నేర్పరచిరి. అట్టి సింహాసనముల నధిష్ఠించిన ఆచార్య పురుషులు ఆంధ్ర దేశమునకు విచ్చేసి, ఆళ్వారాచార్య వైభవమును

7. అధిక్షేప శతకములు - భర్గ శతకము 93, 94, 95 పద్యములు. పుట 33. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి (1982.)

ద్రావిడ దివ్య ప్రబంధ విశేషములను పండితులు మొదలు, పామరుల వఱకు అందరకును బోధింపసాగిరి. అట్టి యంశములే తెలుగులో తిరు నామముల రచనకు మూలము లయ్యెను అమంగళ నివృత్తి, పర నిర్వృతి, ఉపదేశము అనునవియే ఈ తిరునామముల పరమ ప్రయో జనము.

ఇట్టి తిరునామములను బహుళ ప్రచారము చేసినవారిలో - 'చాత్తాద శ్రీవైష్ణవులు' అనబడు సాతానులు, 'నిత్యులు' అనబడు మాల దాసరులు అనువారలు ముఖ్యులు. పంచ సంస్కారములు సర్వ వర్ణములకు సమాన స్థాయిని కల్గించినవి. శ్రీవైష్ణవు లందరు ఒక్కటే. 'మన అందరిది ఒకే జాతి, ఒకే సంస్కృతి' అనునట్టి భావ సమైక్యతను ఈ తిరునామములు అభివృద్ధి పరచినవి. సాహిత్య పర ముగా - పద కవితలకు, సంకీర్తన సాహిత్యమునకు తీసిపోనివై, ఒకా నొక తత్త్వము నాశ్రయించి, సేవించుటచే, ఈ తిరునామములు తమ ప్రత్యేకతను నిలుపుకొనుచు, భావ సమైక్యత, మోక్ష పురుషార్థ కాంక్ష అను పరమ ప్రయోజనములను చేకూర్చుచున్నవి.

## తిరునామ భేదములు

ఈ తిరునామములను - 1. కథాత్మకములు. 2. భావాత్మక ములు అని రెండు విధములుగా విభజింపవచ్చును.

1. కథాత్మకము లగు తిరునామములు - శ్రీదేవి, ఆళ్వారులు, శ్రీ రామానుజులు మొదలగు వారి వైభవములను వివరించునట్టివి.

2. కథాత్మకము లగు తిరునామములు - ఆయా ద్రావిడ దివ్యప్రబంధములలోని, రహస్య గ్రంథములలోని శ్రీవైష్ణవ సంప్ర దాయమునకు సంబంధించిన అనేక విషయములను బోధించునట్టివి.

## కథాత్మక తిరునామములు

**ఆండాళ్ :-**

శ్రీదేవీ విభూతియైన ఆండాళునకు చెందిన తిరునామములలో -
ఆమె వైభవ మిట్లు కీర్తింపబడినది :-

"పంచి తులసివనమం దంచితముగ నుద
యించి, శ్రీవిష్ణుచిత్తుల గాంచి ప్రేమమీరగ
బెంచి" న పెరిగిన దీ ఆండాళు. ( పుట 28. )[8]

"కట్టి పువ్వుం దండలు పెట్టి మంచగ కొప్పున
జుట్టి విభుని కొఱకు పెట్టి పంపిన బలుమేటి"

ఈ ఆముక్త మాల్యద.

"హరి పాదాబ్జ మిళిందా !
సుందరాంగి ! నీ యందము గని, గో
విందుడు మది నింపొందుచు నుండెను"

హరిని వలచి వలపింప జేసిన వయ్యారి ఈమె.

"మాసములను యెన్నదు మార్గ శీర్ష
మాసమె ఘన మనుచు
శేష శయనుని విశేషములను ద్రవిడ
భాషచే ముప్పది పాటలు బాడుచు" (పుట 29)

చివరకు -

"రంగనితో గూడెను దాసుల బ్రోవ." (పుట 30)

దాస రక్షణకై భగవంతుని సన్నిధిలోనికి చేరిన దీ చూడికుడుత.

"దేవాదిదేవం తన దివ్య ప్రభా హి దేవి
జీవ దోషం విస్మృత్య స్వీకృతం కరోషి
సాధు యోధ వసూరాధితే జననీ
బోధయ కుత్కృతే పురుషోత్తమం త్వమ్." (పుట 35)

---

8. తిరునామ సంకీర్తనల ప్రక్క గల సంఖ్యలు - నేను సంకలనము చేసిన 'తిరునామములు' అను గ్రంథములోని పుట సంఖ్యలు.

అని ఆమె పురుషకారమును గుర్తుజేసినారీ గీతమున.

"ఆనూరి యిలయాళ్వారుల కనుజయై
బాసిల్లు మీ ముద్దుల పజెని లే వేగ
చూతము రారే." (పుట 36)

అని, శ్రీరామానుజ అను కోవిలణ్ణా ! అని పిలిచిన ఆండాళు సన్నిధికి మనలను రమ్మనుచున్నారు.

**నమ్మాళ్వారులు :-**

ఆళ్వారులలో ప్రథమ గణ్యులైన నమ్మాళ్వారులకు జెందిన తిరునామములే అధిక సంఖ్యలో గానవచ్చును.

"పాయలేనే నద్గురు నెడబాయులేనే
తీరుగ తిరుతామ్రపర్ణి తీరంబున
వైరాగ్యులైన సుజ్ఞాన యోగుల నెడ బాయలేనే ॥
కారి గర్భమున చిన్నారి వెన్నెల బాడి
చేరి తా మునయించు నేనేశుల నెడ" బాయ లేనే ॥
రంగుగ శ్రీరంగపుర నివాసుల కంత
రంగులైన తెన్నరంగం పొన్నడి నెడ" బాయలేనే ॥

అనుచున్నారు. (పుట 42)

"వేదసార మీ ద్రావిడోక్తులను వేడ్కగావించి ప్రాకృతము
లాదియందె రోసి, శఠద్వేషి యనగ పేరుగాంచిన
కారిమార కుమారా ! మీ కంటె ఘను లిక రెవరయ్యా!" (పుట 51.)

"మధుర కవి ప్రాణనాథా
పరతత్త్వ నిర్ణయ ప్రౌఢార్థములు బోధము .
నుల కొనగిన పరాంకుశ యోగి చంద్రా !
తిరునగరి నమ్మయాళ్వారే !
మిమ్ములనే సేవింతునూ." (పుట 58)

అని భాగవతోత్తముడు పలుకుచున్నాడు.

**శ్రీ రామానుజులు :-**

ఆళ్వారుల యనంతరము శ్రీ రామానుజులు స్తుతింపబడిరి. శ్రీవైష్ణవుడు - తాను పెద్దలకు నమస్కరించునపుడు - 'అడియేన్ రామానుజ దాసన్' అని యనును. ఎదుటి వ్యక్తిని శ్రీరామానుజులకు వలెనే, గౌరవ భావముతో సంభావించుట శ్రీవైష్ణవ సంప్రదాయమున పరిపాటి. శ్రీ రామానుజుల కృపాకటాక్షము వల్లనే నేటికిని శ్రీవైష్ణవ సంప్రదాయము సజీవముగా మనగల్గుచున్నది. ఇందువల్లనే శ్రీవైష్ణవ మతము శ్రీరామానుజ దర్శన మను పేర ప్రసిద్ధి గాంచి యున్నది. అట్టి భగవద్రామానుజుల వైశిష్ట్యమును గుర్తించి, భాగవతోత్తములు వారిని తిరునామములలో విశేషముగా కీర్తించి యున్నారు.

"వైష్ణవ సిద్ధాంత స్థాపన జేసిన ధీమతులు" (పుట 191.)
"పరమపదమున శేషుడైన వారు." (పుట 65.)
"పరవాసుదేవునితో పంతగించి, ధరణిలోపల వేంచేసినవారు." (పుట 81)
"పతిత రక్షణకు యీ క్షితి నవతరించిన శ్రీభాష్యకారులు." (పుట 80)

"మొదటి యుగమున అనంతుడై, ముద మొదవగా, పెంపొందవగా
నవయ రెండో యుగమున లక్ష్మణస్వామిగా, బహు ప్రేమగా
వదలకను ద్వాపరమున బలభద్రుడై పెంపారగా
తుదను కలియుగమందు శ్రీరామానుజా యని పేరుగా." (పుట. 66.)

పైన ఉదహరింపబడిన తిరునామములలో - కథాత్మక లక్షణములు కానవచ్చును.

**మణవాళ మహామునులు :-**

వీరికి - 'యతీంద్ర ప్రవణు' లని పేరు. వీరు -
"ద్రవిడాగమ మధు రస లోలురు. (210పుట) పొంగుచు ఉత్తమ పూర్ణ డితని గొల్పు సంగతి జగము లెరుంగును: (పుట 210)

ఉత్తమ నంబికి వీరు భగవ ద్విషయమును బోధించిరి.

'భోగమంటపాధినాథు డీ గురునెద ద్రవిడాగమాంతము చదివెను. (పుట. 209) శ్రీరంగనాథుడే విచ్చేసి, బాలునివలె, వీరి కాలక్షేపమును విని, చివరకు - 'శ్రీశైలేశ దయాపాత్రం' అను శ్లోకమును సాయించిరి.

**ఆచార్య ప్రశంస :-**

తిరునామములలో - ప్రధానులైన ఆండాళు, శఠగోపులు, శ్రీరామానుజులు, వరవర మునులు - పిదప, సర్వాచార్య సాధారణమైన ఆచార్యకోటి ప్రశంస కానవచ్చును.

"యో దద్యాత్ భగవత్ జ్ఞానం, కుర్యా ద్ధర్మోప సేవనమ్
కృత్స్నాం వా పృథివీం దద్యాత్ న త త్తుల్యం కథంచన."

భగవత్ జ్ఞానము నిచ్చు ఆచార్యుని ఋణము - భూమి నంతయు సమర్పించినను తీరదు. వేదాంత దేశికులు స్తోత్రరత్న భాష్యమందు ఇట్లు వ్యాఖ్యానించిరి :-

"ఈశ్వర కృపా హి అనాది రపి ఆచార్య కృపా మపేక్షతే. లీలారస సహచరితా చ. ఆచార్య కృపా తు, త న్నిగ్రహ మపి శమయతి. అనుగ్రహ రసైరా్వ."

'ఆచార్య కృప - అనుగ్రహైక రసా' అన్న మాట గమనింపదగినది. ఇందుకు కూరేశులు చక్కని ఉదాహరణము. తన కన్నుల నూడబెరకుటకు కారకుడై, తనను దయనీయస్థితికి దిగజార్చిన నాలూరాన్ పై దయ జూపు మని, వరదరాజస్వామిని ప్రార్థించిన కూరేశులు ఆచార్య కోటిలో - ఉన్నత స్థితియం దున్నవారు. తిరునామమున -

"చరమ పర్వం బనెడు పరమ నిధి దొరకె సో
దరులార ! రండు ప్రదక్షిణము సేయ॥
తనదు అభిమానమే దంచి నాలూరాను
వెనుదీక రక్షింపవే యటన్న
మునిని కూరేశుని గౌరవించి, తదీయు
ఉను లందరికి మోక్షం బిత్తు ననె శౌరి." (224 పుట)

అని, పై విషయము ప్రస్తావింపబడినది. స్వాచార్యులను స్తుతించు తిరు నామములు కూడ కొన్ని గలవు. నల్లాన్ చక్రవర్తులవారు స్వాచార్య స్తుతిలో ప్రధానముగా కన్పింతురు.

**భాగవతులు :-**

ఆచార్యాభిమానము గలుగుటకు భాగవతసేవ ముఖ్యము. ప్రపత్తియందు ప్రధానమైన లక్షణము కార్పణ్య మనున దొకటి. కార్పణ్య మనగా -

"సతాం దేశిక ముఖ్యానాం సేవా."

అని నుడివిరి. భాగవత సేవ - దాసుడ నను బుద్ధికి దారి తీయును.

"తస్మిన్ త జ్జనే భేదాభావాత్."

భగవంతునివలె, భాగవతులను సేవింపవలెనని నారదభక్తిసూత్రములు వక్కాణించుచున్నవి. అహంకార నిరసనమే కార్పణ్యము. అందులకే శ్రీ రామానుజులు భిక్షాచరణము అవశ్య కరణీయ మనిరి.

"శేషత్వమే ఆత్మావుక్కు స్వరూపమ్."

అని ముముక్షుప్పడి నుడివి యున్నది. అదియే దాస భావన. అందుకు భాగవత సేవ ముఖ్యము.

"తదీయ పదసేవ భవ దుస్తరాంబుధికి నావ." (275 పుట)

అంతే కాదు - భాగవతాపచారము తగదు.

"లయమున వినత నందను రెక్క లూడ కారణ మేమి ?" (పుట 278)

'శాండిలిని' అను భాగవతురాలు నివసించిన ప్రదేశమును హీనమైన స్థలముగా భావించిన గరుడుని రెక్క లూడెను.

"త్రిలోక్యాశయము చెప్పక ఉపరిచరవసు ధరకూలి చావ నేమి ?" (279 పుట)

దేవతలయందలి పక్షపాతముచే, ఋషులకు అపచారము చేసి, ఉపరి చర వసువు అధఃపతితు డయ్యెను.

"హరికన్న వీరలే ఘను లనుచు
నిరంతరము పరకాలముని పూజన మిదుదు
పరిజయాప్త శ్రీ హరుల దోచి భా
న్వర భాగవతార్చనము చేసిర ఏ (283)

తిరుమంగయాళ్వారులు.

"దీని ప్రభావము దెలిసి భక్తపదరేణుముని త దభిధానమున నెనరు." (283 పుట)
విప్రనారాయణులకు - భక్తాంఘ్రిరేణువు అని ప్రత్యేక నామము. భాగవత సేవ ఇంతటి మహిమ గలది.

**శ్రీవైష్ణవులు :-**

సంప్రదాయ గ్రంథములందు చెప్పబడిన శ్రీవైష్ణవ లక్షణములు ఈ తిరునామములలో వివరింపబడినవి.

"తల్లి మాకు శ్రీ యిందిర కన్న
తండ్రి గావలెను శ్రియఃపతి
ఎల్ల భాగవతులు ఇంపైన బంధువులు."
"గురు పరంపర మా వంశము
గురుడె శ్రీహరి యానె గురుతు మాకు."

"దాసత్వమే మాదు కులము
దాసదాస కైంకర్యమె ధనము
వాసిగ వైష్ణవ దాసులకు దాసులము." (294 పుట)
"యతిపతి పద పద్మములె సేవ వదలకుండెడివారము." (302 పుట)
"తిరుమంత్ర ద్వయ చరమార్థములే [9] తెర దీయుట మాకు." (303 పుట)

---

9. తిరుమంత్రము :- ఓం నమో నారాయణాయ.
ద్వయము :- శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే
శ్రీమతే నారాయణాయ నమః.
చరమము :- సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః.

"పంచసంస్కారివి [10] గాకను దురిత
సంచయ మేలాగు మానును." (పుట 295)

"పంతంబుతో అర్థపంచక జ్ఞానంబు [11] ప్రాప్యం బనె తలచేవారము
మంచిగ తత్త్వత్రయమాది రహస్యములు మోక్షసాధనం బనియేము." (పుట 308)

"శ్రీ శ్రియఃపతుల సిద్ధరను సేవించేము." (పుట 309)

"ధరలో శ్రీభాగవతపరులకు శేషత్వ
పరులై నవారి సంబంధులను
గురి గలిగి వారల కులశీల మెన్నక
చరణాబ్జ సంసేవ పరమ భాగ్యమని తలచేవారు." (పుట 311)

ఈ రీతిగా - గోదాదేవినుండి ఇంతవరకు ఉదహరించిన తిరునామములలో - కథాత్మకత లక్షణములు కానవచ్చును. ఇకపై భావాత్మక తిరునామములను కొన్నిటిని పరిశీలింతము ;-

## భావాత్మక తిరునామములు

ఈ తిరునామములలో - శ్రీవైష్ణవ సంప్రదాయ గ్రంథములందలి విశేషము లనేకములు అనువదింపబడినవి.

*గురుపరంపర* :-

శ్రీవచనభూషణమందు ప్రపన్న దినచర్యలో - ప్రతి నిత్యము గురుపరంపర జపించ దగిన దనిరి. సమాశ్రయణము (పంచసంస్కారములు) పొందిన శ్రీవైష్ణవుడు నిత్యము శ్రీపా (ద) తీర్థమును పుచ్చుకొనుటకు ముందు - గురుపరంపరను అనుసంధించును. 'అస్మద్దేశిక

10. పంచ సంస్కారములు :- తాప, పుండ్ర, నామ, మంత్ర, యాగములు.
11. అర్థ పంచక జ్ఞానము :- స్వస్వరూప, పరస్వరూప, ఉపాయ స్వరూప, ఫల స్వరూప, విరోధి స్వరూపములు

మస్మదీయ పరమాచార్యాన్...' అని ఆరంభ మగు శ్లోకము - శ్లోక గురుపరంపర అనియు, అస్మద్గురుభ్యో నమః, అస్మత్పరమ గురుభ్యో నమః ...' మొదలుగా గల వాక్యములు - వాక్య గురు పరంపర అనియు చెప్పబడును.

"గురుపరంపర తలతూ నే గొలుతూ శ్రీమ
ద్గురు పరంపర తలతు."  (పుట 1.)

ఈ తిరునామమున - 'శ్రీమత్' అనుచోట, శ్రీ - శ్రియః పతులను అన్వయించుకొన్నచో, ఇది శ్లోకవాక్య గురుపరంపరకు చేయు రూపము. అవరోహణ క్రమమున - 'గురు పరంపర' ఇందు కలదు.

*శ్రియఃపతి* -

"శ్రియఃపతీ ! తగ వగునా సర్వశేషి
నీ కిది బావ్య మగునా !"  (పుట 10.)

శేషాద్రిప శ్రీనివాసా ! సర్వ చిదచి
త్పోషక చిద్విలాసా !
పోషించుము నీదు పొలతితో చరమ
శేషి నృహరి గురువేషా : సత్యభాషా !"  (పుట 11.)

జీవుని కన్నను, భగవంతునకు గల విశిష్టత - 'శ్రియః పతిత్వము.' ఈశుడు చిదచిత్పోషకుడు (చిదచి ద్విశిష్టుడు). జీవుడు శేషభూతుడు. భగవంతుడు సర్వశేషి.

"మన్నారురంగా ! నీ కన్నా రక్షకు లెవ్వ
రున్నారు శ్రోవకున్నా.
నారాయణా దుగ్ధ వారధి శయనావ
తారాంతర్యా మ్యర్చా ! విస్తారా."  (పుట 18.)

భగవంతునకు - పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా అను

పంచ విధ స్థితులు కలవు. తత్త్వ త్రయ మందలి విషయములు - ఈ గీతమున చెప్పబడినది.

**భగవద్గీత :-**

భగవద్గీత యందలి 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య' అను చరమ శ్లోకార్థము - ఈ క్రింది తిరునామమున అభివ్యక్తము గావింప బడినది :-

"ఇతర ధర్మములు విడచి, శ్రియః పతియే గతి యనుచు
అతి ముదంబున ఆనతిచ్చిన చతుర లక్ష్మణ సూరి వైభవ
అతులితంబగు హరి పదములె గతి యనే రామానుజులను." (పుట 84.)

**అర్థ పంచకము :-**

అర్థ పంచక మను గ్రంథమున - 'ప్రాప్తి విరోధి యావదు, భగవ దపచార, భాగవతాపచార, అసహ్యాపచారంగళుమ్' అని, భగవ త్ప్రాప్తికి విరోధి భాగవతాపచార మని చెప్పబడినది. తిరు నామ కర్తయు -

"భాగవతుల నెల్ల పరిభవించి నే బ్రతికి తేనే." (పుట 76.)

అని నుడివెను. పై అర్థ పంచకమందే - అన్య శేషత్వము, స్వస్వా తంత్ర్యము అనునవి - స్వరూప విరోధము లనిరి. గీత కర్తయు -

"కొంచెమునైన స్వాతంత్ర్యము కూడనిది యని నిషేధించెనే." (పుట 178.)

అని నుడివెను.

**ధాటీ పంచకము :-**

"గురుతర పాషండ ద్రుమకోటికి కొడుటిప్పు యితడు." (పుట 83.)

అను తిరునామ పంక్తులు - ధాటీ పంచకమున కనువాద మనునట్లున్నవి.

**విశిష్టాద్వైతము :-**

"చిదచిదఖిల కరణా కారణా ! " (పుట 181)

"త్రివిధ చిదచి దధినాథ ! " (పుట 102)

విశిష్టాద్వైతమున తత్త్వములు మూడు. చిత్ (జీవుడు), అచిత్తు (ప్రకృతి), ఈశ్వరుడు. స్థూల సూక్ష్మ దశలయందును (సృష్టి లయములు) ఈ రెంటితో విశిష్టుడు ఈశ్వరుడు. విశిష్టమైన అద్వైతము విశిష్టాద్వైతము చిదచిత్తులకు కారణము, చిదచిత్తులకు అధినాథుడు - ఈశ్వరుడు.

"తత్త్వత్రయంబు సత్యంబని తెలుప, రూ
ఢత్వముగా త్రిదండము బట్టితివి మహోపకారా ! " (పుట 181)

తత్త్వములు మూడు అని తెలుపుటకే శ్రీరామానుజులు చేత త్రిదండము (మూడు దండములను) ధరించినారని ఈ పై తిరునామము బోధించుచున్నది.

**అర్చిరాది :-**

రహస్య గ్రంథములలో - 'అర్చిరాది' యొకటి. ఇందు - ముక్తి నొందుటకు అర్హమైన ఆత్మలు పయనించు మార్గము, ఫలము చెప్పబడినవి. 'పరమార్థ స్తుతి' అను రెండు శ్లోకములు - ఈ విషయమునే తెలుపును. 'ప్రమేయ శేఖర' మను రహస్య గ్రంథము సంక్షిప్తముగా దీనినే వివరించును.

"సాగి విరజానది స్నాన మమరున్
ఆది పుణ్యాంగనలు అప్సరసలు మనకు "

స్వాగతము పలుకుదురు.

"అలయకను శ్రీమతే రామానుజా యంటె
ఆ మీద పరమపద మబ్బగత మౌను,
శ్రీమతే రామానుజా యనవె మనసా." (పుట - 879, 880)

అను తిరునామమున, పై గ్రంథములందలి యంశములు సంగ్రహముగా సూచింపబడినవి.

యాదృచ్ఛికప్పడి, నవవిధ సంబంధము, విలక్షణ మోక్షాధికార నిర్ణయము, వార్తామాల, తిరువాశరియమ్, తిరుప్పల్లాణ్డు స్తోత్రరత్నము, యతిరాజ సప్తతి మున్నగు సంప్రదాయగ్రంథములందలి విశేషములు - ఈ తిరునామములలో అనువదింపబడినవి.

## కవితా సౌందర్యము

ఈ తిరునామములు కేవలము శ్రీవైష్ణవ తత్త్వ ప్రచారమునకే ఏర్పడినను, వీనిలో కవితా సౌందర్యముకూడ పరిశీలింపదగి యున్నది.

"రామానుజ రామానుజ మీ రక్షణ లక్షణ చతురత." (పుట 188)

అను తిరునామమున చెప్పబడిన విషయ మిట్లున్నది :-

"వీనిని రక్షింపలేక వరదుడు త్యజియించినాడట. శ్రీదేవి వీని పక్షమున స్వామితో విన్నపములు చేసి చేసి, విసిగినదట. నిత్యులు వీని దోషాధిక్యతకు నివ్వెరపడి, అనిమిషులైనారట. నమ్మాళ్వారులు వీనిని చూడకుండ కన్నులు మూసికొనిరట. పరకాలుడు దొంగతన మను నెపముచే, వీనిని చూచి పారిపోయినాడట. వీనిని సృష్టించిన బ్రహ్మసైతము వీనిని చూచి, తల గొట్టుకొనెనట కనుక, రామానుజా ! అందరు నన్ను వదలినను, మీరు రక్షింప బూనుకొనినారు. మీ రక్షణ చాతుర్యము వర్ణింప బ్రహ్మేంద్రాదుల తరమా ! "

అనుచున్నాడు. కారణములు కానివానిని కారణములుగా ఊహించినాడు. ఇందలి కవిప్రౌఢోక్తి, వక్తృవైచిత్రి - ప్రతిభకు నిదర్శనము.

## నిగూఢ విషయములు

వేదాంత విషయములను నిగూఢముగా చెప్పుట - ప్రాచీన కాలమునుండియు కలదు. ఇందలి గూఢార్థములు - ఆచార్యులను ఆశ్రయింపక తెలియజాలవు. ఒక తిరునామమున -

"లేమ మోక్ష మిక బ్రహ్మాదులకు నైనా
మా దైవ మెంబెరుమానా రనక గాని
పంచ తత్త్వములలో జడి విడిన గాని
పంచమోపాయ రుచి పణతి దెలిసిన గాని
పంచ బాణుని వలం బడకున్న గాని."

ధన, అభిజన, విద్యా, అధికార, సౌందర్యములను పంచ అభిమానముల వదలవలెను. పృథివ్యాది పంచ తత్త్వములకు అతీతుడు కావలెను. పంచబాణుని (మన్మథుని) వలల బడకుండ నుండవలెను పంచమోపాయరుచి ( ఆచార్యాభిమానము ) గనవలెను. (కర్మ, జ్ఞాన, భక్తి, ప్రపత్తి, ఆచార్యాభిమానము అను ఐదు ఉపాయములలో ఐదవది ఆచార్యాభిమానము.)

ఇట్టి గూఢార్థములు గల, అర్థ గౌరవము గల తిరునామము లెన్నియో మనకు కన్పించును. శాస్త్ర విషయములపై అల్ప భావము కలుగకుండుటకు ఇట్టి ప్రయోగములు జరుగుచుండును. వివిధములైన అలంకారముల ప్రయోగము, నవవిధ భక్తిరీతులు, మధురభక్తి మున్నగునవి - ఈ తిరునామములలో గాన్పించు విశేషములు.

## సంగీత రీతులు

తిరునామములు సంకీర్తనల కోవకు చెందినందున, శాస్త్రీయ సంగీత రీతు లిందు కలవు. ఇవి జానపదుల కొఱకు రచింపబడినందున- ఏల, ధవళము, దరువు, చందమామ, చిలుక మొదలగు జానపద సంగీత రీతులు కూడ వీనియందు కలవు. ఈ జానపద రీతులు - రగడ, ద్విపద సీసము మొదలగు ఛందములు ఒకే జాతికి చెందినవి కనుక, ఈ జానపద రీతులలో - ఈ పై రగడ మొదలగు పద్య పాదములుకూడ కన్పించుచుండును. ఈ పద్యములు, జానపద రీతులు రెండును

మాత్రా ఛందస్సుపై ఆధారపడినవి కనుక, పరస్పరము తోడై కన్పించుట సహజము.

## ముగింపు

ఈ విధముగా - కవితాత్మ కలిగి, సంగీత రీతులను, జానపద గీతముల బాణీలను అనుసంధించుకొని, శ్రీవైష్ణవ తత్త్వమును, ద్రావిడములో - సంస్కృతములో గల ఆళ్వారాచార్యుల ప్రబంధము లందలి జటిలమైన విషయములను సులభముగా, పామరుల కందించబడిన ఈ తిరునామములు - పేరులోనే ఒక ప్రత్యేకత గలిగి, తమ విశిష్టతను దెల్పుచు, చిర కాలమునుండి ప్రచారమం దుండి, నేటి వరకును కొనసాగుట - గొప్ప విశేషము. ఇక మున్ముందును ఈ తిరునామము లిట్లే ముముక్షువులకు పాథేయములై, పరమార్థమును ప్రసాదించుచుండ గలవని సంభావింపవచ్చును. అస్తు.



# కవి పండిత పరిచయము

## శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు



జననము :- 1-7-1930. జన్మ స్థానము :- తిరుపతి. జననీ జనకులు :- జానకమ్మ, వేంకట నరసింహాచార్యులు. విద్యాభ్యాసము :- వేద సంస్కృత కళాశాలలో - నెల్లూరు. ఉభయ వేదాంతాధ్యయనము-తండ్రిగారి సన్నిధిలో. డిగ్రీలు- (1) సాహిత్య విద్యా ప్రవీణ (2) భాషాప్రవీణ (3) ఎం. ఏ. (సంస్కృతము). వీ రిపుడు - నెల్లూరులో, వేద సంస్కృత కళాశాలాధ్యక్షులుగా పని చేయుచున్నారు.

రచనలు :- (ముద్రితములు) (1) శుక సందేశమ్ (సంస్కృత పద్యకావ్యము) (2) సంస్కృత భాషా ప్రవేశిక (వ్యాకరణము) (3) శ్రీ వైకుంఠనాథ పంచాశత్ (స్తోత్రము) (4) శ్రీమ న్మహాశిల గిరీశ్వర (పెంచల కోన) సుప్రభాతము (5) స్వాగతమ్ (ఖండ కావ్యము) (6) హాహా హూహూ (శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి తెలుగు నవలకు సంస్కృతానువాదము) (అముద్రితములు) (7) స్వప్న మాలా (డాక్టర్ : బెజవాడ గోపాలరెడ్డిగారి వచన కవితకు సంస్కృత పద్యానువాదము. (8) శర్వరీ (ఆకిలి శ్రీరామ శర్మగారి ఆంధ్ర పద్యకావ్యమునకు సంస్కృత పద్యానువాదము) (9) బాదరాయణ హృదయము (బాదరాయణ, బోధాయన సంవాద రూపమున బ్రహ్మ సూత్రార్థ వివరణము తెలుపుట) (10) ఉపనిష చ్చంద్రికా (ఆంధ్రమున ఉపనిషత్తులకు ప్రతిపదార్థ తాత్పర్యములు గలది. ఛాందోగ్య - బృహదారణ్యకములు మినహా.)

## శ్రీమాన్ తట్టా విజయరాఘవాచార్యులు

జననము 9-6-1959. జన్మస్థానము - కృష్ణా జిల్లా చిన శ్రీరంగపురము. జననీ జనకులు - వెంకట నరసమ్మ, గోపాలకృష్ణమాచార్యులు. విద్యాభ్యాసము :- కృష్ణా జిల్లా - జగ్గయ్యపేట జిల్లా పరిషత్తు ఉన్నత పాఠశాలలో పదియవ తరగతి వఱకు. అనంతరము 1974 నుండి 1976 వఱకు చిట్టిగూడూరు సంస్కృత కళాశాలలో, 1976 నుండి 1981 వఱకు తిమ్మసముద్రము సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసము. 'సాహిత్య విద్యాప్రవీణ' పరీక్షలో ఉత్తీర్ణత. 198: నుండి 1983 వఱకు ఆంధ్ర విశ్వ విద్యాలయమునందు - 'సర్వ దర్శన' విభాగమున అధ్యయనము, సంస్కృతములో ఎం. ఏ. డిగ్రీ స్వీకరణము. పరిశోధన వ్యాస రచనము :- (1) 1984 నుండి తిరుపతి కేంద్రీయ సంస్కృత విద్యా పీఠమునందు, విశిష్టాద్వైత దర్శనమున పరిశోధనము. తత్త్వాధ్యక్షులు, చతుశ్శాస్త్ర పండితులు, 'తర్కవాచస్పతి' బిరుదాలంకృతులు, రాష్ట్రపతి పురస్కార గ్రహీతలగు శ్రీమాన్ N. S. రామానుజ తాతాచార్యులవారి పర్యవేక్షణమున 'వేదార్థ సంగ్రహ సమీక్షాత్మక మధ్యయనమ్' అను విషయముపై పరిశోధన వ్యాసమును రచించి, Ph. D. డిగ్రీ నిమిత్తమై, రాష్ట్రీయసంస్కృత సంస్థానమునందు 9-10-1986 తేదీన సమర్పించిరి. (2) ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు - జైపూరునందు 'ఆత్మ విచారము' అను పరిశోధనాత్మక వ్యాసమును సమర్పించిరి. (3) ఆంధ్ర ప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్సు గుంటూరునందు - 'భక్తేః మోక్ష సాధనత్వే వివిధాభిప్రాయాః' అను శీర్షికతో పరిశోధనాత్మక వ్యాసమును సమర్పించిరి.

ప్రస్తుత పరిశోధనము :- 'విశిష్టాద్వైతస్య ఆంధ్రాణాం యోగదానమ్' (ఆంధ్రులు - విశిష్టాద్వైతము) అను విషయముపై వీ రిపుడు పరిశోధన చేయుచున్నారు.

సంపాదకత్వము - శ్రీమాన్ శిరిశినగళ్ కృష్ణమాచార్యుల వారిచే ఆంధ్రీకరింపబడిన వేదార్థ సంగ్రహమునకు సంపాదకత్వము వహించి, దానిని 'ఆంధ్ర వేదార్థ సంగ్రహ' మను పేర, టి. టి. డి. వారి ఆర్థిక సహాయముతో 1986 లో వెలువరించిరి.

వ్యాఖ్యానము :- 'గీతార్థ సంగ్రహమునకు' సంస్కృతమున 'వివరణము' అను వ్యాఖ్యానమును వీరు రచించిరి.

అనువాదము :- (1) భక్తిసిద్ధాంతః (2) అష్టాక్షరీ మంత్రమాహాత్మ్యమ్ (3) సవిశేషం బ్రహ్మ (4) లక్ష్మీ పురుషకార వైభవమ్ (5 విశిష్టాద్వైతమ్ (6) తత్త్వత్రయమ్ అను సంస్కృత వ్యాసములు, వీనికి ఆంధ్రానువాదములు వీరిచే రచింపబడినవి

(1) క్రియేషన్ ఆఫ్ ది వరల్డు (2) గాడ్ అండ్ సోల్ (3) డాక్టరిన్ ఆఫ్ విశిష్టాద్వైత అనునవి వీరి ఆంగ్ల వ్యాసములు.

ఉద్యోగము :- రాష్ట్రీయ సంస్కృత సంస్థానము (న్యూ ఢిల్లీ) వారిచే ఇటీవల నిర్వహింపబడిన 'ఇంటర్వ్యూలో' వీరు 'సెలక్టు' అయి, తిరుపతిలో- కేంద్రీయ సంస్కృత విద్యా పీఠమున, విశిష్టాద్వైత విభాగమునందు 31-7-1987 తేదీన ఉపన్యాసకులుగా నియుక్తులైరి.

## *డాక్టర్ : చించావట్టణం శ్రీరంగాచార్యులు*




జననము - ధాత నామ సంవత్సర భాద్రపద బహుళ చవితి (6-10-1935). జన్మస్థానము - సిరిపురము, హుజూర్‌నగర్ తాలూకా, నల్లగొండ జిల్లా. జననీ జనకులు - తాయారమ్మ, వేంకటాచార్యులు. ( పరమపద వాసులు)

విద్యా వ్యాసంగము :- ప్రాథమిక దశలో వీరు తమ తండ్రిగారి

చెంత శ్రీవైష్ణవ సంప్రదాయము నెఱింగిరి. ఉన్నత విద్యాభ్యాసము సూర్యాపేట ప్రభుత్వోన్నత పాఠశాలలో 1955 సంవత్సరమున (H. S. C.) మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణత. ఉస్మానియా విశ్వ విద్యాలయమున ఇంటర్ మీడియెట్. 1958 లో - బి. ఏ. 1961 లో వరంగల్లులోగల ప్రభుత్వ శిక్షణాలయమున బి. యిడి. 1963 లో. ఉస్మానియా విశ్వ విద్యాలయమున 1966 లో ఎం. ఏ. అనంతరము ఉద్యోగ నిర్వహణ.

అధ్యాపక వృత్తిలో 16 సంవత్సరములు. జూనియర్ లెక్చ రర్‌గ 10 సంవత్సరములు. 1-1-81 నుండి 1986 మే వరకు జడ్ చర్లలో గల డాక్టర్ : బూరుగుల రామకృష్ణారావు ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా, 1987 జూన్ నుండి, మహబూబ్ నగరులోగల ప్రభుత్వ డిగ్రీ కళాశాలయందును ఆంధ్రో పన్యాసకులుగా పదవీ నిర్వహణ.

పరిశోధనము :- 'గుదిమెళ్ళ రామానుజాచార్యుల ఖండ కావ్య ములు - సమగ్ర పరిశీలనము' అను అంశముపై వీరు - పిహెచ్.డి. పట్టమునకై పరిశోధన వ్యాసమును రచించి, 1985 ఆగష్టులో ఉస్మానియా విశ్వవిద్యాలయమున సమర్పించి, 24-3-1987 తేదీన మౌఖిక పరీక్షానంతరము 'డాక్టరేటు' పట్టమును పొందిరి.

విశేషాంశములు : ఆంధ్రభూమి, మూసీ, జనధర్మ, ఉజ్జీవన్, భక్తినివేదన మున్నగు పత్రికలలో - వివిధాంశములపై వీరి కవితలు, వ్యాసములు కొన్ని ప్రచురితములైనవి. వివిధ విషయములపై వీరి ప్రసంగములు, స్వీయ కవితలు అనేకములు హైదరాబాదు రేడియో కేంద్రమునుండి ప్రసారమైనవి. సంగీత సాహిత్యము లందును, భగవ ద్భాగవత సంసేవనమునందును వీరికి ఆసక్తి మెండు.

## శ్రీ పుతుంబాక శ్రీకృష్ణయ్య



జననము 1898. జన్మస్థానము పెదపాలెము. తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా. జననీ జనకులు: నాగమాంబ, పిచ్చయ్య. శ్రీకృష్ణయ్యగారు సంస్కృతాంధ్ర సాహిత్య వేత్తలు. కవిశేఖరులు. సాధు హృదయులు. పరమ భాగవతోత్తములు. త్యాగధనులు. శ్రీరంగనాథ చరణారవింద మకరంద మధూకరులు. శ్రీరంగక్షేత్రవాసులును - శ్రీ వైష్ణవ యతీశ్వరులు నగు శ్రీ పురుషోత్తమాచార్యస్వామివారి అంతేవాసులు. శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకులు.

సుప్రసిద్ధ మగు శ్రీరంగ క్షేత్రములో వేంచేసియున్న శ్రీరంగనాథస్వామి వీరి యిష్ట దైవము. ఆ క్షేత్రమున, తులామాసములో - వార్షికముగా వచ్చు శ్రీరంగనాయక అమ్మవారి డోలోత్సవమును సంవత్సరమున కొకనాడు కొన్ని సంవత్సరముల వఱకు జరిపించి, ఆనంద భరితు లగుచు, ఆ యమ్మవారి యనుగ్రహమునకు పాత్రులైన ధన్యజీవులు వీరు.

స్వగ్రామ మగు పెదపాలెములో - శ్రీ కోదండరామస్వామివారి ఆలయమును సర్వాంగ సుందరముగా రూపొందించుటయందును, దానికి దివ్య సంపూజ్యతను సమకూర్చుటయందును వీరు చూపిన దీక్షా దక్షతలు ప్రశంసాపాత్రములు. వీరిపుడు పరమపద వాసులు.

రచనలు :- 1. పరీక్షి ద్విలాపము 2. భక్త హృదయము 3. భక్త జీవనము 4. శ్రీగుణ రత్నమాల మున్నగునవి.

**డాక్టర్ : కిదాంబి నరసింహాచార్యులు**



జననము :- తారణ శ్రావణ బహుళ విదియ. (2-7-1943) జన్మ స్థానము:- దొంతి గ్రామము. నర్సాపూరు తాలూకా - మెదక్ జిల్లా. జననీ జనకులు :- కమలమ్మ, యామునాచార్యులు.

విద్యాభ్యాసము :- యాదగిరి గుట్టలో గల శ్రీ లక్ష్మీనరసింహ సంస్కృతి కళాశాలలో - సంస్కృతమున ప్రవేశ పరీక్ష (ఎన్ట్రిన్స్) వరకును, ఆ పైన - హైదరాబాదు - సీతారాంబాగులో గల వేదాంత వివేక వర్ధినీ సంస్కృత కళాశాలలో - సంస్కృత సాహిత్యమున బి. యల్. వరకు వీరు విద్యాభ్యాసము గావించిరి. అనంతరము స్వయం కృషితో - తెలుగు బి ఓ. యల్. డిగ్రీని, ఉస్మానియా విశ్వ విద్యాలయమునుండి ఎం. ఏ. డిగ్రీని సంపాదించిరి.

పరిశోధనము :- "తిరునామములు - సమగ్ర పరిశీలనము" అను సిద్ధాంత వ్యాసమును రచించి, కాకతీయ విశ్వవిద్యాలయమున సమర్పించి, పిహెచ్. డి. పట్టమును పొందిరి.

అధ్యాపనము :- 1963 నుండి తెలుగు ఉపాధ్యాయులుగా, 1970 నుండి కళాశాలలో ఉపన్యాసకులుగా ఉద్యోగములను నిర్వహించుచున్నారు. ప్రస్తుతము నల్లగొండలో - నాగార్జున ప్రభుత్వ సాయం కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేయుచున్నారు.

వ్యాసములు :- స్రవంతి, ఆంధ్రభూమి, భారతి, సప్తగిరి, ఆంధ్రప్రభ మొదలగు పత్రికలలో - వీరి వ్యాసములు కొన్ని ప్రచురింపబడినవి, సాహిత్య విమర్శ, కావ్య పఠనము అను విషయములందు వీరికి అభిరుచి అధికము.

* * *

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 26 | అని | అనియు |
| 9 | 4 | లలొ | లలో |
| 12 | 23 | పఠించుచుప | పఠించుచుందురు. |
| 14 | 24 | సంస్క తము | సంస్కృతము |
| 26 | 22 | లో మున | లోకమున |
| 27 | 14 | దివ | దివ్య |
| 33 | 20 | అణువాయొ | అణువాయే |
| 42 | 18 | ప్రబ ధాధ్యయన | ప్రబంధాధ్యయన |
| 58 | 21 | విప తజ్ఞాన | విపరీత జ్ఞాన |
| 59 | 12 | మృత్పింప | మృత్పిండ |
| 62 | 11 | వత, భాగ | భాగవత |
| 64 | 3 | ఆవస్థయే | అవస్థయే |
| 65 | 8 | ఆయ్యదియే | |
| 82 | 11 | చెతనుల | చేతనుల |
| 93 | 6 | మూలాధా ము | మూలాధారము |
| 95 | 19 | ధృపానుస్మృతి | ధృవానుస్మృతి |
| 96 | 8 | పదముచెత | పదముచేత |
| 96 | 10 | చెపిన | చేపిన |
| 97 | 6 | నొందిʼ | నొంది, |
| 97 | 11 | పలవ గానిʼ | పలనగాని, |
| 97 | 13 | నటిది | నట్టిది |
| 99 | 7 | ఉంత్పాదింప | ఉత్పాదింప |
| 107 | 20 | మందింపబడువు. | మంచింపబడును. |
| 108 | 14 | అటి | అట్టి |
| 108 | 25 | పరచి.రి | పరచిరి. |
| 109 | 19 | కిష్టపడునది, | కిష్టపడునది. |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 111 | 9 | ఉన్ఘాటించిది. | ఉద్ఘాటించిది. |
| 112 | 2 | గాక' | గాక, |
| 115 | 21 | చెయబడియున్న | చేయబడియున్న |
| 120 | 1 | మొనర్పుట గాను | మొనర్పుటకు గాను |
| 125 | 5 | ఇ ద్రియములను | ఇంద్రియములను |
| 130 | 7 | వస్తువు, | వస్తువు. |
| 131 | 2 | భక్తుని | భక్తిని |
| 138 | 17 | బుట్టి పగా | బుట్టింపగా |
| 139 | 9 | కెంతయున్ | కెంతయున్ |
| 142 | 2 | జి తింప | జింతింప |
| 144 | 8 | విదుల్ప వద్దు | విదల్ప వద్దు |
| 144 | 13 | నప్వుచుండు | నవ్వుచుండు |
| 144 | 15 | జూపు నిగుడ్పి; | జూపు నిగుడ్ప ; |
| 146 | 17 | వెను వె ట | వెనువెంట |
| 148 | 20 | మడప౯ బోక | మథంప౯బోక |
| 154 | 22 | నెన్న౯ | నెన్న౯ |
| 157 | 24 | హృదయ బు | హృదయంబు |
| 165 | 20 | నొ దించు | నొందించు |
| 166 | 17 | జి తన | జింతన |
| 194 | 3 | డాక్టర్ | డాక్టర్; |
| 197 | 5 | శ్రీవైష్ణవము | శ్రీవైష్ణవము |
| 203 | 7 | సర్వాచా | సర్వాచార్య |
| 206 | 4 | జ్ఞానంబు | జ్ఞానంబు |



# శ్రీ రామానుజ కీర్తి కౌముది

# పూర్వార్ధ విషయ దీపిక

## మొదటి భాగములో -



## రెండవ భాగములో -

## మూడవ భాగములో -



## నాల్గవ భాగములో -



## ఐదవ భాగములో -



## ఆఱవ భాగములో -

౪. శ్రీ రామానుజ యుగము - నాటి సాంఘికపరిస్థితులు — గూడ సుందరరామయ్య
౫. శ్రీమద్రామానుజులు - శ్రీ వేంకటాచలము — టి.కె.వి.యన్. సుదర్శనాచార్యులు
౬. శ్రీ రామానుజ వాఙ్మయము - తద్విశేషము — విక్రాల శేషాచార్యులు

## ఏడవ భాగములో -

౧. శ్రీనివాస స్తుతి — బృందావనం రంగాచార్యులు
౨. దివ్య ప్రబంధములు - సంగీత సాహిత్యములు — ధనకుధరం వరదాచార్యులు
౩. శ్రీ రామానుజ వైభవము — కందాడై శ్రీనివాసాచార్యులు
౪. శ్రీమద్రామానుజోదాహరణము — చెలమచెర్ల రంగాచార్యులు
౫. శ్రీమద్రామానుజులు - భక్తి తత్త్వము — చించాపట్టణం శ్రీరంగాచార్యులు
౬. శ్రీ యతిరాజ వైజయన్తి — తిరుమల నరసింహాచార్యులు
౭. శ్రీమద్రామానుజులు - విశిష్టాద్వైతము — కె. లక్ష్మీనరసింహాచార్యులు
౮. శ్రీ రామానుజ స్తుతి — పూర్వ కవి

## ఎనిమిదవ భాగములో -

౧. శ్రీ వేంకటాద్రీశ్వర స్తుతి — కోటభట్టరు వేంకట రంగాచార్యులు
౨. దివ్యప్రబంధ నీరాజనము — ధనకుధరం వరదాచార్యులు
౩. భగవ ద్విషయము - తద్విశేషములు — కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు
౪. శ్రీ రామానుజ దర్శనము — తట్టా విజయ రాఘవాచార్యులు
౫. శ్రీ రామానుజ నవరత్నములు — నల్లాన్ చక్రవర్తుల వీరరాఘవాచార్యులు
౬. శ్రీమద్రామానుజులు - యోగవిద్యా రహస్యము — చించాపట్టణం శ్రీరంగాచార్యులు
౭. ధనుర్దాసు — పుతుంబాక శ్రీకృష్ణయ్య
౮. తిరునామములు - వైష్ణవ తత్త్వము — డాక్టర్ : కిడాంబి నరసింహాచార్యులు

మొదటి భాగము టి. టి. డి. సమాచార కేంద్రములలో మాత్రమే లభించును. మిగిలిన భాగములు మా వద్ద లభింపగలవు. రెండవ భాగము రు॥ 20-00. మూడవ భాగము రు॥ 20-00. నాల్గవ భాగము రు॥ 20-00. ఐదవ భాగము రు॥ 25-00. ఆఱవ భాగము రు॥ 30-00. ఏడవ భాగము రు॥ 35-00. ఎనిమిదవ భాగము రు॥ 30-00. (తపాలా ఖర్చులు అదనము.)

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

## మహారాజ పోషకులు

1. శ్రీమాన్ చిలకమర్తి సత్యలక్ష్మణాచార్యులు, B. A; B. L; I. R. S.
(రిటైర్డు ఇన్‌కంటాక్సు ఆఫీసర్) గుంటూరు
2. Sri NARENDER P. REDDY, Ph.D.
*Associate Profesor :-* *The university of Akron* AKRON (U. S. A.)

## పోషకులు

1. శ్రీమాన్ నందూరు సత్యనారాయణాచార్యులు గుడివాడ
2. శ్రీమాన్ కిడాంబి వెంకట నరసింహాచార్యులు పెంటపాడు

## విరాళములు

1. శ్రీ ధనేకుల వెంకటేశ్వరరావు, గుంటూరు రు|| 116-00
2. శ్రీమాన్ వంగల వెంకట నమ్మాళ్వారు,
పోలీసు ఇన్‌స్పెక్టర్, కనిగిరి రు|| 100-00

## సభ్యత్వ వివరములు

***మహారాజ పోషకులు రు|| 1,116. రాజ పోషకులు రు|| 816.***
***పోషకులు రు|| 516.***

ఈ మూడు తరగతుల వారికిని ప్రస్తుతము మావద్ద సిద్ధముగానున్న భాగములను వెంటనే పంపుచు, మిగిలిన భాగములను కాలక్రమమున వరుస వరుసగా పంపగలము. సభ్యత్వ రుసుములను M. O. ద్వారా గాని, D. D. ద్వారా గాని పంపవచ్చును.

*ఉత్తర ప్రత్యుత్తరములకు :-*

# శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల

శ్రీ లక్ష్మీనారాయణ పురము

**గుంటూరు - 522 006**